# సంస్కృతగ్రంథములు

## ఇతిహాస పురాణములు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| బాలరామాయణము, పెద్దచ్చు ... | 0 | 2 |
| ,, సటీక ... | 0 | 4 |
| శ్రీమద్రామాయణము, మూలము మాత్రము ... | 8 | 0 |
| ,, సుందరకాండము, మూలము ... | 2 | 0 |
| ,, ఉత్తరకాండము, శ్లోకప్రతి ... | 2 | 0 |
| శ్రీమద్రామాయణము, 1 కి వ్యాఖ్యములు టీకాతాత్పర్యము | | అచ్చు |
| అధ్యాత్మ రామాయణము, మూలము ... | 2 | 8 |
| ,, ఆంధ్రటీకాతాత్పర్యసహితము ... | 12 | 8 |
| శ్రీమద్రామాయణము, వ్యాఖ్యానచతుష్టయవిశిష్టము, 2 వాల్యములు | 40 | 0 |
| శ్రీమద్రామాయణము, ఆంధ్రతాత్పర్యసహితము:— | | |
| బాలకాండము ,, ... | 4 | 0 |
| అయోధ్యాకాండము ,, ... | 6 | 8 |
| ఆరణ్యకాండము ,, ... | 4 | 0 |
| కిష్కింధాకాండము ,, ... | 4 | 0 |
| సుందరకాండము ,, ... | 5 | 0 |
| యుద్ధకాండము ,, ... | 8 | 8 |
| ఉత్తరకాండము ,, ... | 4 | 8 |
| శ్రీమహాభారతము, గచ్ఛద్వ్యాఖ్యాన సహితము, 3 సంపుటములు | 40 | 0 |
| శ్రీమద్భాగవతము, శ్రీధరీయవ్యాఖ్యాన సహితము, 2 సంపుటములు | 20 | 0 |
| కార్తీకమాహాత్మ్యము, సాంధ్రతాత్పర్యము ... | 1 | 8 |
| కాశీమాహాత్మ్యము, తెనుఁగువచనము ... | 1 | 0 |
| గయామాహాత్మ్యము, తెనుఁగువచనము ... | 0 | 10 |
| [illegible] ఆంధ్ర తాత్పర్యసహితము | 6 | 0 |
| [illegible] మాహాత్మ్యము, ,, ... | 0 | 8 |
| [illegible] మాహాత్మ్యము, ,, ... | 0 | 4 |

# విషయసూచిక







శ్రీరస్తు

# వ్రతరత్నాకరము

## ప్రథమభాగము.

---

# వినాయకవ్రతము

*ఆచమ్య = ఆచమనము చేసి.

శ్లో. శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం,
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే.

†అయం ముహూర్తః సుముహూర్తోఽస్త్వితి భవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు = ఈముహూర్తము మంచి ముహూర్తమగుఁగాక యని పూజ్యులగు పెద్దలనుగ్రహింతురుగాక.

‡అయం ముహూర్తః సుముహూర్తోఽస్తు = ఈముహూర్తము శుభముహూర్తమగుఁగాక.

---

*కర్త ఆచమనము చేయవలసినది. పిదప నమస్కారము చేయవలసినది. పిడికిళ్లతో చెక్కిళ్లయందుఁ దాఁకవలసినది.

† ఈ వాక్యమును వ్రతముచేయువా రచ్చటనుండు బ్రాహ్మణోత్తముల నడుగవలసినది.

‡ ఈవాక్యమును పురోహితుఁడు మొదలగు బ్రాహ్మణోత్తములు బదులిడవలసినది.

1. తదేవ లగ్నం సుదినం తదేవ తారాబలంచంద్రబలంతదేవ, విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతే తేఽంఘ్రియుగం స్మరామి. 2. యత్ర యోగేశ్వరః కృష్ణః యత్ర పార్థో ధనుర్ధరః, తత్ర శ్రీర్విజయోభూతిర్ధ్రువానీతిః మతిర్మమ. 3. అనన్యాశ్చిన్తయన్తో మాం యేజనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాం యోగ క్షేమంవహామ్యహమ్. 4. స్మృతేసకలకల్యాణభాజనంయత్రజాయతే, పురుషన్తమజంనిత్యంవ్రజామిశరణంహరిమ్. 5. సర్వదాసర్వ కార్యేషు నాస్తి తేషామమఙ్గలం, యేషాం హృదిస్థో భగవాన్

1. ఓలక్ష్మీ దేవిభర్తా! నేను నీపాదములను ధ్యానించుచున్నాను. నీపాదములధ్యానించుటయే (నాకు) లగ్నము. అదే శుభదినము. అదియే తారాబలము. అదియే చంద్రబలము. అదియే విద్యాబలము. అదే దైవబలము. 2. ఎచ్చట యోగేశ్వరుఁడగు కృష్ణమూర్తియు, గాండీవధారియగు అర్జునుఁడును నున్నారో, అచ్చట సంపదయు జయమును, వైభవమును బాయకయుండును. 3. ఎవ రితర కార్యములనెల్ల విడిచి నన్నే ధ్యానించుచు, నన్నే యుపాసన చేయుచున్నారో, ఎల్లప్పుడు నాకు భక్తులైయుండువారి యోగక్షేమములను నేను విచారించుకొనుచున్నాను. (అని కృష్ణమూర్తి యర్జునునకుఁ జెప్పెను.) 4. స్మరించినమాత్రముననే సంపదల నొసఁగువాఁడును, సకలభూతముల లోపల నుండువాఁడును, పుట్టుక లేనివాఁడును, శాశ్వతుఁడును నైన విష్ణుమూర్తిని నేను శరణుచొచ్చుచున్నాను. 5-6. మేలులకెల్లనునికిపట్టును, నల్లఁగల్వవలె నల్లనైనవాఁడును, దుష్టులను బీడించువాఁడును నైన శ్రీకృష్ణమూర్తి నేమానవులు తమమనస్సులందుఁ దలఁచుచున్నారో, అట్టివారికిఁ

మఙ్గళాయతనం హరిః. 6. లాభ స్తేషాం జయ స్తేషాం కుత స్తేషాం పరాభవః, యేషామిన్దీవరశ్యామో హృదయస్థో జనార్దనః. 7. ఆపదామపహర్తారం దాతారం సర్వసమ్పదాం, లోకాభి రామం శ్రీరామం భూయోభూయో నమామ్యహమ్.

---

## వి నా య క ప్రా ర్థ నా

సుముఖశ్చైకదన్తశ్చ కపిలో గజకర్ణకః, లమ్బోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః. ధూమకేతుర్గణాధ్యక్షః ఫాల చన్ద్రో గజాననః,వక్రతుణ్డః శూర్పకర్ణో హేరమ్బస్స్కన్దపూర్వజః షోడశైతాని నామాని యః పఠేచ్ఛృణుయాదపి, విద్యారమ్భే వివాహేచ ప్రవేశే నిర్గమే తథా. సఙ్గ్రామే సర్వకార్యేషు విఘ్న

---

జెఱుపు గలుగదు. వారికి లాభమును గెల్పును గలుగునుగాని, వారికోటమియెక్కడిది? వారన్ని కార్యములందును జయమునే పొందుదురు. 7. ఇడుమలను దీర్చి యన్నికలుములనొసంగునట్టి జనప్రియుఁడయిన శ్రీరామమూర్తిని మాటిమాటికి మ్రొక్కు చున్నాను.

సుముఖ, ఏకదంత, కపిల, గజకర్ణక, లంబోదర, వికట, విఘ్నరాజ, గణాధిప, ధూమకేతు, గణాధ్యక్ష, ఫాలచంద్ర, గజానన, వక్రతుండ, శూర్పకర్ణ, హేరమ్బ, స్కన్దపూర్వజ అను పదునాఱు నామములను చదువ ప్రారంభించునప్పుడును, పెండ్లియందును, ఊరికిఁ బ్రయాణమై పోవునప్పుడును, ఊరినుండి మఱలివచ్చునప్పుడు, యుద్ధములకుఁ బోవునప్పుడును, మఱి యనేక కార్యసమయంబులందును చదువువారికిని, వినువారికిని విఘ్నముగలుగదు. మఱియు వేల్పులుగూడఁ దమకోరినకార్య

స్తస్య న జాయతే. అభీప్సితార్థసిద్ధ్యర్థం పూజితో యస్సురై రపి, సర్వవిఘ్నచ్ఛిదే తస్మై శ్రీగణాధిపతయే నమః.

ఓం దైవీ గాయత్రీ ఛన్దః ప్రాణాయామే వినియోగః. ఓం భూః, ఓమ్ భువః, ఓగ్ం సువః, ఓమ్ మహః, ఓమ్ జనః, ఓమ్ తపః, ఓగ్ం సత్యం, ఓమ్ తత్ సవితుర్వరేణ్యం, భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్, ఓమాపో జ్యోతీరసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్.

మమ ఉపాత్త సమస్తదురితక్షయద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభనే ముహూర్తే, అద్య బ్రహ్మణః ద్వితీయపరార్థే, శ్వేతవరాహకల్పే, వైవస్వత మన్వన్తరే, కలియుగే, ప్రథమపాదే, జమ్బూద్వీపే, భరతవర్షే, భరతఖణ్డే, శకాబ్దే, మేరోః, దక్షిణదిగ్భాగే...సమస్తదేవతా బ్రాహ్మణసన్నిధౌ, వర్తమానే, వ్యావహారికచాంద్ర మానేన ప్రభవాదిషష్టిసంవత్సరాణాం మధ్యే...నామసంవత్సరే... అయనే...ఋతౌ...మాసే...పక్షే, ...తిథౌ...వాసర యుక్తాయాం ఏవంగుణవిశేషణవిశిష్టాయా మస్యాంశుభతిథౌ అస్మాకం సహకుటుంబానాం క్షేమస్థైర్యధైర్య విజయాయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం, ధర్మార్థకామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థసిద్ధ్యర్థం, పుత్రపౌత్రాభివృద్ధ్యర్థం, ఇష్ట కామ్యార్థసిద్ధ్యర్థం, మనోవాఞ్ఛాఫలసిద్ధ్యర్థం, సమస్తదురితోప శాన్త్యర్థం, సమస్తమఙ్గళావాప్త్యర్థం, వరసిద్ధివినాయకదేవతా

ములు నెఱవేఱుటకై యేవిఘ్నేశుని బూజించిరో, అట్టి మహాత్ముఁడును సకలవిఘ్నములను బోఁగొట్టువాఁడును నైన మహాగణాధిపతికొఱకు నమస్కారము.

ముద్దిశ్య, వరసిద్ధివినాయక ప్రీత్యర్థం కల్పోక్తప్రకారేణ యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే.*

ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం గణాధిపతిపూజాం కరిష్యే, తదంగత్వేన కలశపూజాం కరిష్యే. †

కలశం గన్ధపుష్పాక్షతై రభ్యర్చ్య (కలశమునకు గంధపు బొట్లు పెట్టి అక్షతలద్ది లోపల నొక పుష్పము నుంచి;) తదుపరి హస్తం నిధాయ (ఆపాత్రమును చేతితో మూసిపెట్టి ఈ క్రింది మంత్రము నుచ్చరించి గంగాదిసకలతీర్థోదకములను కలశమునం దావాహనము చేయవలెను.)

1. కలశస్య ముఖే విష్ణుః కణ్ఠే రుద్రః సమాశ్రితః, మూలేతత్ర స్థితో బ్రహ్మా మధ్యేమాతృగణాః స్మృతాః, 2. కుక్షౌతు సాగరాః సర్వే సప్తద్వీపా వసున్ధరా, ఋగ్వేదోఽథ యజుర్వేదః సామవేదో హ్యథర్వణః. 3. అఙ్గైశ్చ సహితాః సర్వే కలశామ్బుసమా

---

1. కలశముయొక్క పై భాగమున విష్ణువును, గొంతుకడ రుద్రుం డును, అడుగున బ్రహ్మయు, నడుమ సప్తమాతృకలును, లోపల నేడుసముద్రములును, ఏడుద్వీపములును, భూమియు నున్నవి. 2. ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వణవేదములును, శిక్షా వ్యాకరణ, ఛందో, నిరుక్త జ్యోతిషంబు లనెడి యాఱంగముల తోఁ గూడినవై కలశోదకము నాశ్రయించి యున్నవి. 3. పాప

---

* అని చెప్పి పంచపాత్రమునందలి నీటిని తాఁకవలయును.

† ఈ వ్రతము వినాయకవ్రతమే కనుక ఈవ్రతమునందు మొదట వినాయకపూజ యనవసరము. తక్కిన వ్రతములయారంభమునందు గణపతి పూజ చేయవలెను.

శ్రితాః, ఆయాన్తు దేవపూజార్థం దురితక్షయకారకాః. 4. గఙ్గే చ యమునే చైవ గోదావరి సరస్వతి, నర్మదే సింధు కావేరి జలేఽస్మిన్ సన్నిధిం కురు.

మంత్రము—ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వాభూతాన్యాపః ప్రాణావా ఆపః పశవఆపోన్నమాపోఽమృతమాపస్సమ్రాడాపో విరాడాపస్స్వరాడాపశ్ఛన్దాగ్ంస్యాపోజ్యోతీగ్ం ష్యాపోయజూగ్ం ష్యాపస్సత్యమాపస్సర్వా దేవతాఆపోభూర్భువస్సువరాపఓం.

కలశోదకేన పూజాద్రవ్యాణి దేవమణ్టప మాత్మానం సంప్రోక్ష్య=(కలశమందలిజలమును చేతిలోఁ బోసుకొని, పూజకొఱకయిన వస్తువులమీఁదను, దేవునిమందసమునందును తననెత్తినను జల్లుకొనవలసినది.)

---

## గణాధిపతి పూజ

గణానాంత్వాగణపతిగ్ం హవామహేకవిం కవీనాముపమశ్రవ స్తమం జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీదసాదనమ్—మహాగణాధిపతిం ధ్యాయామి. మహాగణాధిపతిం ఆవాహయామి.

మహాగణాధిపతయే ఆసనం సమర్పయామి.

" అర్ఘ్యం సమర్పయామి.

---

ములనెల్లఁ బరిమార్చునట్టి యవి యెల్ల దేవపూజకొఱకు కలశమునందు వచ్చిచేరునుగాక 4. ఓగంగాదేవీ! ఓయమునాదేవీ! ఓగోదావరిదేవీ! ఓసరస్వతీదేవీ! ఓనర్మదాదేవీ! ఓసింధుదేవీ! ఓకావేరిదేవీ! మీరందఱీకలశంబునఁ జేరుదురుఁగాక.

మహాగణాధిపతయే పాద్యం సమర్పయామి.
" " ఆచమనీయం "
" " ఔపచారికస్నానం "
" స్నానానన్తరం ఆచమనీయంసమర్పయామి.
" వస్త్రార్థం అక్షతాన్ "
" యజ్ఞోపవీతార్థం " "
" గంధాన్ ధారయామి.

"గంధస్యోపరి అలంకరణార్థం అక్షతాన్ సమర్పయామి. పుష్పైః పూజయామి. ఓంసుముఖాయ నమః, ఏకదన్తాయ నమః, కపిలాయ నమః, గజకర్ణికాయ నమః, లమ్బోదరాయ నమః, వికటాయ నమః, విఘ్నరాజాయ నమః, గణాధిపాయ నమః, ధూమకేతవే నమః, గణాధ్యక్షాయ నమః, ఫాలచంద్రాయ నమః, గజాననాయ నమః, వక్రతుండాయ నమః, శూర్పకర్ణాయ నమః, హేరమ్బాయ నమః, స్కందపూర్వజాయ నమః, మహాగణాధిపతయే నానావిధపరిమళపుష్పాణి సమర్పయామి. ధూపార్థం అక్షతాన్ సమర్పయామి.

మహాగణాధిపతయే దీపార్థం అక్షతాన్ సమర్పయామి. ఓం—యాత్, దేవసవితః ప్రసువ, సత్యం త్వర్తేన పరిషించామి అమృతమస్తు, అమృతోపస్తరణమసి, స్వాహా, ఓం ప్రాణాయ స్వాహా, ఓం అపానాయ స్వాహా, ఓం వ్యానాయ స్వాహా, ఓం ఉదానాయ స్వాహా, ఓం సమానాయ స్వాహా, ఓం బ్రహ్మణే స్వాహా, బ్రహ్మణిమ ఆత్మామృతత్వాయ. మహాగణాధిపతయే ...నివేదనం సమర్పయామి మహాగణాధిపతయే మధ్యేమధ్యే పానీయం సమర్పయామి, మహాగణాధిపతయే తాంబూలం

సమర్పయామి, మహాగణాధిపతయే నీరాజనం సమర్పయామి, నీరాజనానన్తరం ఆచమనీయం సమర్పయామి.

వక్రతుండ మహాకాయ కోటిసూర్యసమప్రభ, అవిఘ్నం కురు మే దేవ సర్వకార్యేషు సర్వదా. మహాగణాధిపతయే నమః. మంత్రపుష్పం సమర్పయామి. మహాగణాధిపతయే నమః, ఆత్మ ప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి. సర్వోపచారపూజాః సమర్పయామి. యస్య స్మృత్యాచ నామోక్త్యా తపః పూజా క్రియాదిషు, న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వన్దే త మచ్యుతం, మన్త్రహీనం క్రియాహీనం భక్తిహీనం గణాధిప, యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్తు తే. అనయా షోడశోపచారపూజయా భగవాన్ సర్వదేవాత్మకః శ్రీమహాగణాధిపతిః సుప్రసన్నో వరదో భవతు. (అని అక్షతలు పువ్వులతోఁ గూడ నీళ్లు విడువవలసినది) మమ ఇష్టకామ్యార్థఫలసిద్ధి రస్తు.

గణాధిపతిప్రసాదం శిరసా గృహ్ణామి (అని చెప్పి అక్షతలు పుష్పములు శిరస్సున ధరింపవలసినది.)

ఈ ప్రకారము ప్రతివ్రతమునకును మొదట వినాయకపూజ చేయవలయును.

తదంగత్వేన * (ఫలసిద్ధి వినాయక) ప్రాణప్రతిష్ఠాపనం కరిష్యే.

---

*మన మేదేవత నుద్దేశించి వ్రతముఁ జేయఁబోవుచున్నామో, ఆదేవతా నామమును ప్రాణప్రతిష్ఠాపనమునందు ముందుగాఁ జేర్పవలయును. 'వరలక్ష్మీ దేవతాప్రాణప్రతిష్ఠాపనం, సరస్వతీదేవతాప్రాణప్రతిష్ఠాపనం' అని చెప్పవలయును.

## ప్రాణప్రతిష్ఠాపనము

అస్య శ్రీ (వరసిద్ధివినాయక) ప్రాణప్రతిష్ఠాపన మహామన్త్రస్య, బ్రహ్మ విష్ణు మహేశ్వరా ఋషయః, ఋగ్యజుస్సామాథర్వాణి ఛందాంసి, ప్రాణశ్శక్తిః పరాదేవతా, హ్రాం బీజం, హ్రీం శక్తిః, హ్రూం కీలకమ్, మమ (వరసిద్ధివినాయక) ప్రాణప్రతిష్ఠాసిద్ధ్యర్థే జపే వినియోగః.

| కరన్యాసము. | అంగన్యాసము. |
|---|---|
| హ్రాం అంగుష్ఠాభ్యాం నమః | హ్రాం హృదయాయ నమః |
| హ్రీం తర్జనీభ్యాం నమః | హ్రీం శిరసే స్వాహా |
| హ్రూం మధ్యమాభ్యాం నమః | హ్రూం శిఖాయై వషట్ |
| హ్రైం అనామికాభ్యాం నమః | హ్రైం కవచాయ హుమ్ |
| హ్రౌం కనిష్ఠికాభ్యాం నమః | హ్రౌం నేత్రత్రయాయ వౌషట్ |
| హ్రః కరతలకరపృష్ఠాభ్యాం నమః | హ్రః అస్త్రాయ ఫట్ |

భూర్భువ స్సువరో మితి దిగ్బన్ధః.

---

## ధ్యానమ్

1. శ్లో. రక్తామ్భోధిస్థపోతోల్లసదరుణసరోజాధిరూఢా కరాబ్జైః
పాశంకోదణ్డమిక్షూద్భవమలిగణమప్యఙ్కుశం పఞ్చబాణాన్.

---

1. రక్తసముద్రమునందుండు తెప్పలో వెలయుచున్న యెఱ్ఱదామరపువ్వునందుఁ గూర్చుండి, కమలములంబోలు తన చేతులయందు పాశము, చెఱుకువిల్లు, తుమ్మెదలగుంపు, అంకుశము, ఐదుబాణములను, రక్తపూరితమైన పుఱ్ఱెను దాల్చినదియు, మూడునేత్రములచే వెలుఁగునదియు, గబ్బిగుబ్బలుగల

బిభ్రాణాసృక్కపాలం త్రినయనలసితా పీనవక్షోరుహాఢ్యా,
దేవీ బాలార్కవర్ణా భవతు సుఖకరీ ప్రాణశక్తిః పరా నః,
హ్రాం హ్రీం క్రోం య ర ల వ శ ష స హోమ్. ఓం (వర సిద్ధివినాయక) ప్రాణః మమ ప్రాణః (వరసిద్ధివినాయక) జీవః మమ జీవః వాఙ్మనఃశ్రోత్ర జిహ్వాఘ్రాణైః ఉచ్ఛ్వాసరూపేణ బహిరాగత్య, అస్మిన్ బింబే (అస్మిన్ కలశే) (అస్యాం ప్రతిమాయామ్) సుఖేన చరన్ తిష్ఠన్తు స్వాహా.

మంత్రము—అసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణమిహ నోధేహి భోగమ్, జ్యోక్పశ్యేమ సూర్యముచ్చరన్తమనుమతేమృడయానస్స్వస్తి, అమృతం వై ప్రాణా అమృతమాపః ప్రాణానేవ యథా స్థానముపహ్వాయతే.

శ్లో. 'స్వామిన్ సర్వజగన్నాథ యావత్పూజావసానకం,
తావత్త్వం ప్రీతిభావేన (బింబేఽస్మిన్) సన్నిధిం కురు.

*ఆవాహితోభవ, స్థాపితోభవ, సుప్రసన్నోభవ, వరదోభవ, అవకుణ్ఠితోభవ, స్థిరాసనంకురు, ప్రసీద, ప్రసీద, ప్రసీద,

---

దియు, బాలసూర్యునిఁ బోలునదియు నైన పరదేవత ప్రాణశక్తి మాకు సుఖం బొసఁగునది యగుఁ గాక.

1. ఓ స్వామీ ! లోకములన్నిటికి రక్షకుఁడా! నేను జేయు పూజయగునంతవఱకు ఈబింబమునందు (లేక యీప్రతిమయందు, లేక ఈకలశమునందు) సంతోషముతో నాకుఁ బ్రత్యక్షమై యుండుము.

---

* స్త్రీదేవత నుపాసించునప్పుడు "స్వామిని సర్వజగన్నాథే" అనియుం "ఆవాహితా భవ, స్థాపితాభవ, సుప్రసన్నా భవ, అవకుణ్ఠితా భవ" అనియుం అన్ని స్త్రీలింగముగాఁ జెప్పవలెను.

మంత్రము—ఆ త్వా వహన్తు హరయస్సచేతసశ్శ్వేతై రశ్వైస్సహ కేతుమద్భిః, వాతాజవైర్బలవద్భిర్మనోజవై రాయాహి శీఘ్రం మమ హవ్యాయ శర్వోమ్.

(ఈమంత్రము చెప్పి అక్షతలు పుష్పములు తీసికొని ప్రతిమ శిరస్సున నుంచి చేతిని నెత్తినుంచవలెను) యత్కించిన్ని వేదనం కుర్యాత్.

పిమ్మట అవసరనివేదనము (పండు బెల్లము మొదలగునవి.)

ప్రాణప్రతిష్ఠాపనవిధి సంపూర్ణము.

---

## పూ జా ప్రా రం భ ము

అథ వరసిద్ధివినాయకపూజావిధానమ్—

1. శ్లో. భవసఞ్చితపాపౌఘవిధ్వంసనవిచక్షణం, విఘ్నాన్ధకారభాస్వన్తం విఘ్నరాజమహం భజే, ఏకదన్తం శూర్పకర్ణం గజవక్త్రం చతుర్భుజం, పాశాఙ్కుశధరం దేవం ధ్యాయేత్సిద్ధివినాయకమ్. ఉత్తమం గణనాథస్య వ్రతం సంపత్కరం శుభం,

1. శ్రీవినాయకవ్రతము అన్ని వ్రతములలో మేలయినది కలిమి నొసంగునది, శుభముల నిచ్చునది గనుక, సంసారమునఁ జేర్చిన పాపరాసులను బోఁగొట్టుటయందు దిట్టరియు, సూర్యునిమాడ్కి విఘ్నములనెడి చీకటిం బోఁగొట్టువాఁడును, ఒంటికొమ్ముఁగలవాఁడును, చేటచెవులవాఁడును, ఏనుఁగుమోమువాఁడును, నాలుగుచేతులవాఁడును, పాశము అంకుశము అను నాయుధం

భక్తాభీష్టప్రదం తస్మాద్ధ్యాయేత్తం విఘ్ననాయకమ్. ధ్యాయేద్గజాననం దేవం తప్తకాఞ్చనసన్నిభం, చతుర్భుజం మహాకాయం సర్వాభరణభూషితమ్.

శ్రీవరసిద్ధివినాయకం ధ్యాయామి

శ్లో. అత్రాగచ్ఛ జగద్వన్ద్య సురరాజార్చితేశ్వర,
అనాథనాథ సర్వజ్ఞ గౌరీగర్భసముద్భవ. 1

శ్రీవరసిద్ధివినాయకం ఆవాహయామి.

శ్లో. మౌక్తికైః పుష్పరాగైశ్చ నానారత్నైర్విరాజితం,
రత్నసింహాసనం చారు ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్. 2

శ్రీవరసిద్ధివినాయకాయ ఆసనం సమర్పయామి.

---

బులను ధరించినవాఁడును, భక్తులకోరికల నొసఁగువాఁడును, బంగారుచాయగలవాఁడును, గొప్ప మేనుగలవాఁడును సకల భూషణములఁ దాల్చినవాఁడు నైన వరసిద్ధివినాయకుని నేను మనసున ధ్యానించుచున్నాను.

1. లోకములచే పొగడఁదగినవాఁడవు, ఇంద్రాదిదేవతలచే పూజింపఁ బడినవాఁడవు, దిక్కు లేనివారికి దిక్కువు, అన్నిటిని దెలిసినవాఁడవు, పార్వతీదేవికిఁ బుత్త్రుఁడవునైన ఓసిద్ధివినాయకా! నిన్ను (ఈబింబమునందు) ఆవాహనము చేయుచున్నాను.

2. ఓవినాయకా ! ముత్యములు పుష్యరాగములు నీలములు పచ్చలు వజ్రములు గోమేధికములు మొదలగు మణులుచెక్కిన సొగసైన ఆసనము నొసఁగుచున్నాను. దీనిని నాప్రీతికై కైకొనుము.

శ్లో. గౌరీపుత్త్ర నమ స్తేఽస్తు శఙ్కరప్రియనందన,
గృహాణార్ఘ్యం మయా దత్తం గన్ధపుష్పాక్షతైర్యుతమ్.
శ్రీవరసిద్ధివినాయకాయ అర్ఘ్యం సమర్పయామి,

శ్లో. గజవక్త్ర నమ స్తేఽస్తు సర్వాభీష్టప్రదాయక,
భక్త్యా పాద్యం మయా దత్తం గృహాణ ద్విరదానన. 2
శ్రీవరసిద్ధివినాయకాయ పాద్యం సమర్పయామి.

శ్లో. అనాథనాథ సర్వజ్ఞ గీర్వాణవరపూజిత,
గృహాణాచమనం దేవ తుభ్యం దత్తం మయా ప్రభో. 3
శ్రీవరసిద్ధివినాయకాయ ఆచమనీయం సమర్పయామి.

శ్లో. దధిక్షీరసమాయుక్తం మధ్వాజ్యేన సమన్వితం,
మధుపర్కం గృహాణేదం గజవక్త్ర నమోఽస్తు తే. 4
శ్రీవరసిద్ధివినాయకాయ మధుపర్కం సమర్పయామి.

---

1. ఓపార్వతీపరమేశ్వరులముద్దుబిడ్డఁడా! నీకు మ్రొక్కెదను, గంధము, పువ్వులు, అక్షతలతోఁ గూడినయర్ఘ్యము (చేతులకు నీళ్లను) నొసఁగెదను. గ్రహింపుము. 2. ఓసకలజనులకోర్కెల నొసఁగు గజముఖుఁడా! నీకు నమస్కరించెదను. నేను భక్తితో నొసఁగినపాద్యమును (కాళ్లకునీళ్లను) గ్రహింపుము. 3. దిక్కు లేనివారికి ప్రాపా, సర్వము నెఱిఁగినవాఁడా! దేవతాశ్రేష్ఠులచే పూజితుఁడా! ఓ ప్రభూ! ఓదేవా! నేనాచమనీయమునిచ్చెదను. పుచ్చుకొనుము. 4. ఓయేనుఁగుమోముదేవరా! నీకు నమస్కారము. ఆవుపాలు పెరుగు నెయ్యి తేనెలతోఁ గూడిన మధుపర్కము నొసఁగుచున్నాను. దీనిం బుచ్చుకొనుము.

శ్లో. స్నానం పఞ్చామృతై ర్దేవ గృహాణ గణనాయక,
అనాథనాథ సర్వజ్ఞ గీర్వాణగణపూజిత. 1
శ్రీవరసిద్ధివినాయకాయ *పఞ్చామృతస్నానం
సమర్పయామి

1. పాలు—ఆప్యాయస్వ సమేతు తే విశ్వత స్సోమ వృష్ణియం, భవా వాజస్య సంగథే, శ్రీ...నాయకం, క్షీరేణ స్నపయామి.

2. పెరుగు—దధిక్రావ్ణో అకారిషం జిష్ణో రశ్వస్య వాజినః, సురభినో ముఖాకర త్ప్రణ ఆయూగ్ంషి తారిషత్ (శ్రీవర...యకం) దధ్నా స్నపయామి.

3. నెయ్యి—శుక్రమసి జ్యోతిరసి తేజోఽసి దేవోవస్సవితోత్పునాత్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః శ్రీవర...యకం ఆజ్యేన స్నపయామి.

4. తేనె—మధు వాతా ఋతాయతే మధు క్షరన్తి సింధవః, మాధ్వీర్నస్సన్త్వోషధీః. శ్రీవర...యకం మధునా స్నపయామి.

1. దీనులఁ బోషించువాఁడవు, సర్వజ్ఞుఁడవు, దేవతలచేఁ బూజింపఁబడువాఁడవు నైన గణనాయకుఁడా ! పంచామృతములచే నీకు స్నానముచేయించెద అనుగ్రహింపుము.

---

*పంచ అమృతములచే స్నానముచేయుట యనఁగా; ఆవుపాలు, పెరుగు, నెయ్యి, తేనె లేక పంచదార, ఫలోదకము ఇవి పంచామృతము లనఁబడును. వీనితో నభిషేకము చేయునప్పుడు ఈ క్రిందిమంత్రములను గూడఁ జెప్పుట కలదు.

లేక, పంచదార—స్వాదుః పవస్వ దివ్యాయ జన్మనే స్వాదు రిన్ద్రాయ సుహవే తు నామ్నే స్వాదుర్మిత్రాయ వరుణాయ వా యవే బృహస్పతయే మధుమాగ్ం అదాభ్యః=(శ్రీవర...య కం) శర్కరయా స్నపయామి.

ఫలోదకము—యాః ఫలినీర్యా అఫలా అపుష్పా యాశ్చ పుష్పిణీః బృహస్పతిప్రసూతాస్తా నో ముఞ్చన్త్వగ్ంహసః = (శ్రీవర...యకం)ఫలోదకేన స్నపయామి.

1. శ్లో. గంగాదిసర్వతీర్థేభ్య ఆహృతైరమలైర్జలైః,
స్నానం కురుష్వ భగవన్నుమాపుత్త్ర నమోఽస్తు తే.
శ్రీవరసిద్ధి...కం శుద్ధోదకస్నానం కారయామి.

మంత్రము—ఆపోహిష్ఠామయోభువః, తాన ఊర్జే దధాతన, మహేరణాయ చక్షసే, యో వశ్శివతమో రసః, తస్య భాజయతే హనః, ఉశతీరివ మాతరః, తస్మా అరంగమామవః 'యస్య క్షయాయ జిన్వథ' ఆపో జనయథా చ నః.

2. శ్లో. రక్తవస్త్రద్వయం చారు దేవయోగ్యం చ మఙ్గళం,
శుభప్రద గృహాణ త్వం లమ్బోదర హరాత్మజ.
శ్రీవర...య వస్త్రయుగ్మం సమర్పయామి.

మంత్రము—అభివస్త్రా సువసనాన్యర్షాభి ధేనోస్సుదుఘాః

1. ఓభగవంతుఁడా! ఓపార్వతీపుత్త్రుఁడా! నీకు నమస్కరించె దను. గంగానది మొదలగు పుణ్యతీర్థములన్నిటినుండి తెచ్చిన నిర్మలోదకములచే స్నానముచేయుము. 2. భక్తులకు మేలొసఁగు

* వైదికులుశ్లోకములతోఁ గ్రిందిమంత్రములను గూడ చెప్పెదరు. అట్లే అంకటను తెలియవలెను.

పూయమానాః, అభిచన్ద్రాభి క్తవేనో హిరణ్యోఽభ్యశ్వాన్ రథి నో దేవసోమ.

1. శ్లో. రాజతం బ్రహ్మసూత్రం చ కాఞ్చనం చోత్తరీయకం,
గృహాణ దేవ సర్వజ్ఞ భక్తానామిష్టదాయక.
శ్రీవర...య యజ్ఞోపవీతం సమర్పయామి

మంత్రము—యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్య త్సహజం పురస్తాత్, ఆయుష్యమగ్ర్యం ప్రతిముఞ్చ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః.

2. శ్లో. చన్దనాగరు కర్పూర కస్తూరీ కుఙ్కుమాన్వితం,
విలేపనం సురశ్రేష్ఠ ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్.
శ్రీవర...యకం గంధాన్ ధారయామి.

మంత్రము—గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం, ఈశ్వరీగ్ం సర్వభూతానాం త్వామిహోపహ్వయే శ్రియమ్.

---

పెద్దబొజ్జగల ఓశివపుత్రా! దేవతలకు ధరింపదగినవి, చక్కని వియు నైన యీ మేటి యెల్లబట్టలను ధరింపుము.

1. సర్వము తెలిసినయో దేవా! భక్తులకోర్కుల నొసఁగు ఓగణాధిపా! రజతముతో నిర్మించినయజ్ఞోపవీతమును, బంగారు మయమైన యుత్తరీయమును గ్రహింపుము. 2. ఓ దేవతలలో శ్రేష్ఠుఁడా! కస్తూరి, కుంకుమపువ్వు మొదలగు సుగంధద్రవ్య ములు చేర్చిన గంధము పూసెదను స్వీకరింపుము.

1. శ్లో. అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ శాలీయాం స్తణ్డులాన్శుభాన్,
గృహాణ పరమానన్ద శమ్భుపుత్ర నమోఽస్తు తే.

శ్రీవర...కాయ అలంకరణార్థం అక్షతాన్ సమర్పయామి.

మంత్రము—ఆయనే తే పరాయణేదూర్వారోహన్తు పుష్పిణీః,
హ్రదాశ్చ పుణ్డరీకాణి సముద్రస్య గృహా ఇమే.

2. శ్లో. సుగన్ధాని చ పుష్పాణి జాతీకున్దముఖాని చ,
ఏకవింశతిపత్రాణి సంగృహాణ నమోఽస్తు తే.

శ్రీవర...నాయకం పుష్పైః పూజయామి.

అథాంగపూజా:—

| | | |
|---|---|---|
| గణేశాయ నమః పాదౌ పూజయామి | | (పాదములు) |
| ఏకదంతాయ నమః గుల్ఫౌ | ,, | (మడిమలు) |
| శూర్పకర్ణాయ నమః జానునీ | ,, | (మోకాళ్లు) |
| విఘ్నరాజాయ నమః జఙ్ఘే | ,, | (పిక్కలు) |
| ఆఖువాహనాయనమః ఊరూ | ,, | (తొడలు) |
| హేరమ్బాయనమః కటిం | ,, | (పిఱుదు) |
| లంబోదరాయనమః ఉదరం | ,, | (బొజ్జ) |

1. ఎక్కువ యానంద మొసఁగునట్టి యో యీశ్వరుని పుత్త్రుఁడా! నీకు నమస్కారము. మంచిబియ్యముతోఁ జేసిన యక్షతల నొసఁగుచున్నాను గ్రహింపుము. ఓవినాయకా! సువాసనగలజాజులు, మొల్లలు మొదలగుపువ్వులతోను, ముఖ్యముగా ఇరువదియొక్కటి యగు ఆకులతోను బూజించెదను గ్రహింపుము. నీకు మ్రొక్కెదను.

గణనాథాయ నమః నాభిం పూజయామి (బొక్కిలి)
గణేశాయ నమః హృదయం ,, (రొమ్ము)
స్థూలకంఠాయ నమః కంఠం ,, (కంఠము)
స్కందాగ్రజాయ నమః స్కంధౌ ,, (మూపులు)
పాశహస్తాయ నమః హస్తౌ ,, (చేతులు)
గజవక్త్రాయ నమః వక్త్రం ,, (ముఖము)
విఘ్నహంత్రే నమః నేత్రే ,, (కన్నులు)
శూర్పకర్ణాయ నమః కర్ణౌ ,, (చెవులు)
ఫాలచంద్రాయ నమః లలాటం ,, (నొసలు)
సర్వేశ్వరాయ నమః శిరః ,, (తల)
విఘ్నరాజాయ నమః

సర్వాణి అంగాని పూజయామి (అన్ని యంగములు)

అథ ఏకవింశతి పత్రపూజా.

(21 - ఆకులతో చేయుపూజ)

సుముఖాయ నమః మాచీపత్రం పూజయామి (మాచిపత్రి)
గణాధిపాయ నమః బృహతీపత్రం ,, (వాకుడాకు)
ఉమాపుత్రాయ నమః బిల్వపత్రం ,, (బిల్వము)
గజాననాయ నమః దూర్వాయుగ్మం ,, (గరిక)
హరసూనవే నమః దత్తూరపత్రం ,, (ఉమ్మెత్త)
లంబోదరాయ నమః బదరీపత్రం ,, (రేగుఆకు)
గుహాగ్రజాయ నమః అపామార్గపత్రం ,, (ఉత్తరేణి)
గజకర్ణాయ నమః తులసీపత్రం ,, (తులసిదళములు)
ఏకదంతాయ నమః చూతపత్రం ,, (మామిడిఆకు)

వికటాయ నమః కరవీరపత్రం పూజయామి (గన్నేరు)
భిన్నదన్తాయ నమః విష్ణుక్రాన్తపత్రం „ (విష్ణుక్రాంతము)
వటవే నమః దాడిమీపత్రం „ (దానిమ్మాకు)
సర్వేశ్వరాయ నమః దేవదారుపత్రం „ (దేవదారి ఆకు)
ఫాలచన్ద్రాయ నమః మరువకపత్రం „ (మరువము)
హేరమ్బాయ నమః సిన్ధువారపత్రం „ (వావిలాకు)
శూర్పకర్ణాయ నమః జాతీపత్రం „ (జాజిఆకు)
సురాగ్రజాయ నమః గణకీపత్రం „ (ఒకపత్రము)
ఇభవక్త్రాయ నమః శమీపత్రం „ (జమ్మిపత్రి)
వినాయకాయ నమః అశ్వత్థపత్రం „ (రావిపత్రి)
సురసేవితాయ నమః అర్జునపత్రం „ (మద్దిఆకు)
కపిలాయ నమః అర్కపత్రం „ (జిల్లేడాకు)
శ్రీగణేశ్వరాయ నమః ఏకవింశతిపత్రాణి) „ (21-పత్రములు)

## అష్టోత్తరశతనామావళిః

ప్రతినామమునకు కడపట "నమః" అని చేర్చవలయును.

| | | |
|---|---|---|
| ఓం గజాననాయ న | కృతినే | మహాబలాయ |
| గణాధ్యక్షాయ [మః | సుప్రదీపాయ 10 | హేరమ్బాయ |
| విఘ్నరాజాయ | సుఖనిధయే | లమ్బజఠరాయ |
| వినాయకాయ | సురాధ్యక్షాయ | హ్రస్వగ్రీవాయ 20 |
| ద్వైమాతురాయ | సురారిఘ్నాయ | మహోదరాయ |
| ద్విముఖాయ | మహాగణపతయే | మదోత్కటాయ |
| ప్రముఖాయ | మాన్యాయ | మహావీరాయ |
| సుముఖాయ | మహాకాలాయ | మన్త్రిణే |

మఙ్గళస్వరాయ
ప్రమథాయ
ప్రథమాయ
ప్రాజ్ఞాయ
విఘ్నకర్త్రే
విఘ్నహన్త్రే
విశ్వనేత్రే
విరాట్పతయే
శ్రీపతయే
వాక్పతయే
శృంగారిణే
ఆశ్రితవత్సలాయ
శివప్రియాయ
శీఘ్రకారిణే
శాశ్వతాయ
బలాయ 40
బలోత్థితాయ
భవాత్మజాయ
పురాణపురుషాయ
పూష్ణే [ణే
పుష్కరోత్క్షిప్తవారి
అగ్రగణ్యాయ
అగ్రపూజ్యాయ
అగ్రగామినే

మన్త్రకృతే
చామీకరప్రభాయ
సర్వస్మై
సర్వోపాస్యాయ
సర్వకర్త్రే
సర్వనేత్రే
సర్వసిద్ధిప్రదాయ
సర్వసిద్ధయే
పఞ్చహస్తాయ
పార్వతీనన్దనాయ
ప్రభవే
కుమారగురవే 60
అక్షోభ్యాయ [య
కుఞ్జరాసురభఞ్జనా
ప్రమోదాత్తాయ
నాయ
మోదకప్రియాయ
కాన్తిమతే
ధృతిమతే
కామినే
కపిత్థపనసప్రియాయ
బ్రహ్మచారిణే
బ్రహ్మరూపిణే 70

బ్రహ్మవిద్యాదిదాన
భువే
జిష్ణవే
విష్ణుప్రియాయ
భక్తజీవితాయ
జితమన్మథాయ
ఐశ్వర్యకారణాయ
జ్యాయసే [య
యక్షకిన్నరసేవితా
గంగాసుతాయ
గణాధీశాయ 80
గమ్భీరనినదాయ
వటవే
అభీష్టవరదాయ
జ్యోతిషే
భక్తనిధయే
భావగమ్యాయ
మఙ్గళప్రదాయ
అవ్యక్తాయ [మాయ
అప్రాకృతపరాక్ర
సత్యధర్మిణే
సఖ్యే
సరసామ్బునిధయే
మహేశాయ

| | | |
|---|---|---|
| దివ్యాంగాయ [య | విష్వగ్దృశే 100 | సర్వైశ్వర్య ప్రదా |
| మణికిఙ్కిణిమేఖలా | విశ్వరక్షాకృతే | య |
| సమస్తదేవతామూ | కల్యాణగురవే | ఆక్రాన్తచిదచిత్ప్ర |
| సహిష్ణవే [ర్తయే | ఉన్మత్తవేషాయ | భవే |
| సతతోత్థితాయ | అపరజజితే [రాయ | శ్రీవిఘ్నేశ్వరాయ |
| విఘాతకారిణే | సమస్తజగదాధా | నమః 108 |

శ్రీవర...య నమః, అష్టోత్తరశతనామపూజాం సమర్పయామి.

1. శ్లో. దశాఙ్గం గుగ్గులోపేతం సుగన్ధి సుమనోహరం,
ఉమాసుత నమస్తుభ్యం గృహాణ వరదో భవ.
శ్రీవర...య నమః ధూపమాఘ్రాపయామి.

మంత్రము—ధూరసి ధూర్వ ధూర్వన్తం ధూర్వతం యోఽస్మాన్ ధూర్వతి తం ధూర్వయం వయం ధూర్వామః.

2. శ్లో. సాజ్యం త్రివర్తిసంయుక్తం వహ్నినా ద్యోతితం మయా,
గృహాణ మఙ్గళం దీపమీశపుత్ర నమోస్తు తే.

శ్రీవర...య నః దీపం దర్శయామి.

మంత్రము—ఉద్దీప్యస్వ జాతవేదోపఘ్నం నిరృతిం మమ,

---

1. ఓపార్వతీపుత్త్రా! నీకు నమస్కారము. పదియంగములు గలది, గుగ్గిలము వేయఁబడిన పరిమళముగలిగి మనస్సునకు సంతోషముచేయు ధూపము వేయుచున్నాను. పీల్చుము. నాకు వరంబుల నొసఁగుము.

2. ఓపరమేశ్వరునిపుత్త్రుఁడా! నీకు మ్రొక్కెదను. నేయిపోసి మూఁడువత్తులువేసి వెలిఁగించిన మంగళదీపమును గైకొనుము.

పశూగ్ శ్చ మహ్యమావహ జీవనంచ దిశో దశ, మా నోహిగ్ం సీజ్జాతవేదో గామశ్వం పురుషం జగత్, అబిభ్రదఘ్ను ఆగ హి త్రియా మా పరిపాలయ.

1 శ్లో. సుగంధాన్ సుకృతాంశ్చైవ మోదకాన్ ఘృతపాచితాన్,
నైవేద్యం గృహ్యతాం దేవ చణముద్గైః ప్రకల్పితాన్.

2 భక్ష్యం భోజ్యం చ లేహ్యం చ చోష్యం పానీయమేవ చ,
ఇదం గృహాణ నైవేద్యం మయా దత్తం వినాయక.

శ్రీవర...కాయ నమః మహానైవేద్యం సమర్పయామి.

*మంత్రము—దేవ సవితః ప్రసువ సత్యంత్వర్తేన పరిషిం చామి అమృతమస్తు అమృతోపస్తరణమసి స్వాహా, ఓంప్రాణాయ స్వాహా, అపానాయ స్వాహా, వ్యానాయ స్వాహా, ఉదానాయ స్వాహా, సమానాయ స్వాహా, బ్రహ్మణే స్వాహా.

2. మధ్యే మధ్యే పానీయం సమర్పయామి, హస్తప్రక్షాళనం సమర్పయామి, పాదప్రక్షాళనం సమర్పయామి, శుద్ధాచమనీయం సమర్పయామి.

శ్లో. పూగీఫలసమాయుక్తం నాగవల్లీదళైర్యుతం,
కర్పూరచూర్ణసంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్.

శ్రీవర...స్వామినే నమః తాంబూలం సమర్పయామి.

---

1. నేతియందుఁ బక్వముచేసిన సెనగపెసలపప్పు పూర్ణము పెట్టిన కుడుములను, మఱి యనేక భక్ష్యభోజ్యలేహ్య చోష్య పానీయాదులతోఁగూడిన మహానివేదన చేయుచున్నాను. ఓ వినాయకుఁడా! ఆరగింపుము.

---

* దీనియర్థము ముందు వ్రాయఁబడినది.

1 శ్లో. సదానందద విఘ్నేశ పుష్కలాని ధనాని చ,
భూమ్యాం స్థితాని భగవన్ స్వీకురుష్వ వినాయక.
శ్రీవర...కాయ నమః సువర్ణపుష్పం సమర్పయామి.

2 శ్లో. ఘృతవర్తిసహస్రైశ్చ కర్పూరశకలై స్తథా,
నీరాజనం మయా దత్తం గృహాణ వరదో భవ.
శ్రీవర...కాయ నమః నీరాజనం దర్శయామి. నీరాజనానన్తరం ఆచమనీయం సమర్పయామి.

మం—హిరణ్యపాత్రం మధో పూర్ణం దధాతిమధవ్యోఽసానీతి, ఏకధా బ్రహ్మణ ఉపహరతి ఏకధైవయజమాన ఆయు స్తేజో దధాతి.

అథ దూర్వాయుగ్మ (=గరికెపోచలు) పూజా.

గణాధిపాయ నమః దూర్వాయుగ్మం పూజయామి "దూర్వాయుగ్మం పూజయామి" అని ప్రతినామమువెంబడిఁ జెప్ప వలయును.

గణాధిపాయ నమః
ఉమాపుత్రాయ నమః
ఆఖువాహనాయ నమః
వినాయకాయ నమః
ఈశపుత్రాయ నమః
సర్వసిద్ధిప్రదాయ నమః
ఏకదన్తాయ నమః
ఇభవక్త్రాయ నమః
మూషకవాహనాయ నమః
కుమారగురవే నమః

దూర్వాయుగ్మపూజా సమాప్తా.

---

1 సత్పురుషులకు సంతోషముగలిగించు ఓ వినాయకా! విఘ్నేశా! భూమియందున్న యావద్ధనములను గ్రహింపుము.

2 ఓవిఘ్నేశా! వేయి నేతిలోముంచినవత్తులును, అనేక కర్పూరపుఁ దునుకలును నుంచి వెలిఁగించిన నీరాజనమును గ్రహింపుము.

1 శ్లో. గణాధిప నమస్తేఽస్తు ఉమాపుత్రాఘనాశన,
వినాయకేశతనయ సర్వసిద్ధిప్రదాయక.
ఏకద న్తైకవదన తథా మూషకవాహన,
కుమారగురవే తుభ్యమర్పయామి సుమాఞ్జలిమ్.*
శ్రీవర...కాయ నమః మంత్రపుష్పం సమర్పయామి.
2 శ్లో. ప్రదక్షిణం కరిష్యామి సతతం మోదకప్రియ,
నమస్తే విఘ్నరాజాయ నమస్తే విఘ్ననాశన.
శ్రీవర...కాయనమః ఆత్మప్రదక్షిణనమస్కారాంత్సమర్పయామి.
3. శ్లో. అర్ఘ్యం గృహాణ హేరమ్బ సర్వభద్రప్రదాయక,
గన్ధపుష్పాక్షతైర్యుక్తం పాత్రస్థం పాపనాశన. †
శ్రీవర...కాయ నమః పునరర్ఘ్యం సమర్పయామి.

---

1 ఓగణాధిపా! పార్వతికిఁ బుత్త్రుఁడా! పాపముల నాశనము చేయువాఁడా! పరమేశుని పుత్త్రుఁడా! అన్నికోరికల నొసఁగువాఁడా! ఒంటికొమ్మువాఁడా! ఏకవదనుఁడా! మూషకము నెక్కువాఁడా! కుమారుని యన్నయగువాఁడా! నీకు మంత్రపుష్పము నర్పించుచున్నాను. 2 కుడుములందుఁ బ్రియుఁడా! విఘ్నములఁబోఁగొట్టువాఁడా! ఎల్లప్పుడు నీకుఁ బ్రదక్షిణనమస్కారములు చేయుచున్నాను. 3 అందఱికి మేలొసఁగువాఁడవు. పాపములఁ బోఁగొట్టువాఁడవు నైనవినాయకా! గంధపుష్పాక్షతలతోఁ గూడినపాత్రమునందున్న యర్ఘ్యమును గ్రహింపుము.

---

* ఇక్కడ మంత్రపుష్పము చెప్పవచ్చును. ఆమంత్రములు మంత్రపుష్పము అనుగ్రంథమునుండి తెలియవలెను.

† (ఇట్లు 3-౪-లా దానికంటె హెచ్చుమారులు ఈ శ్లోకమునుచెప్పి యర్ఘ్యమును విడువవలయును.

1 శ్లో. యం బ్రహ్మవేదాన్తవిదో వదన్తి పరంప్రధానం పురుషం తథాన్యే, విశ్వోద్గతేః కారణమీశ్వరం వా తస్మై నమో విఘ్నవినాయకాయ.

2 శ్లో. నమస్తుభ్యం గణేశాన నమస్తే విఘ్ననాశన,
ఈప్సితం మే వరం దేహి పరత్ర చ పరాం గతిమ్.

3 శ్లో. వినాయక నమస్తుభ్యం సతతం మోదకప్రియ,
నిర్విఘ్నం కురు మే దేవ సర్వకార్యేషు సర్వదా.

ఇతి ప్రార్థనా=అని వినాయకునిఁ బ్రార్థనచేయవలయును.

వాయనదానము.

శ్లో. గణేశః ప్రతిగృహ్ణాతు గణేశో వై దదాతి చ,
గణేశస్తారకోభాభ్యాం గణేశాయ నమో నమః.

(ఈ వాక్యమును వాయనమిచ్చువాఁడు చెప్పవలెను)

దేవస్య త్వా సవితుః ప్రసవే అశ్వినోర్బాహుభ్యాంపూష్ణో హస్తాభ్యామాదదే—ఈ మంత్రమును వాయనము పుచ్చుకొను వారు చెప్పవలెను.

---

1 వేదాంతులు వినాయకుని బ్రహ్మమనియు, మఱికొందఱు ప్రపంచముయొక్కయుత్పత్తికి కారణభూతుఁడైన ప్రధాన పురుషుఁడనియుఁ జెప్పుదురు. అట్టివినాయకుని నమస్కరించు చున్నాను. 2 ఓగణాధిపా! విఘ్నములఁ బోఁగొట్టువాఁడా! నీకు మ్రొక్కుచున్నాను. నాకుఁ గోరినకోర్కులను, పరలోకమున నుత్తమగతి నొసఁగుము. 3 ఎల్లపుడు కుడుములందుఁ బ్రియమైనవాఁడ వగు ఓ వినాయకా! నీకు నమస్కారము.

1 వినాయకస్య ప్రతిమాం వస్త్రయుగ్మ సమన్వితాం,
తుభ్యం దాస్యామి విప్రేన్ద్ర యథోక్తఫలదో భవ.

2 ప్రసీద దేవదేవేశ ప్రసీద గణనాయక, ప్రదక్షిణం కరోమి
మహేశపుత్ర విఘ్నేశ సర్వదా, ప్రదక్షిణం కరోమి త్వా
మమ త్వం సన్నిధౌ భవ.

3 యాని కాని చ పాపాని జన్మాన్తరకృతాని చ,
తాని తాని ప్రణశ్యన్తి ప్రదక్షిణపదేపదే.

4 పాపోఽహం పాపకర్మాహం పాపాత్మా పాపసమ్భవః,
త్రాహి మాం కృపయా దేవ శరణాగతవత్సల.

---

ఓ దేవా! నీవెల్లప్పుడు నాకార్యములను విఘ్నములు లేకుండ ననుకూలము చేయుము.

1 ఓ బ్రాహ్మణోత్తమా! ధోవతులజోడుతోఁగూడ వినాయకుని ప్రతిమను నీకు నొసఁగుచున్నాను. శాస్త్రోక్తమైన ఫలము నొసఁగుము. [ఈశ్లోకమును జెప్పి వినాయకుని ప్రతిమాదానము చేయవలయును.] 2 ఓ దేవదేవా! నాయందను గ్రహింపుము. పరమేశ్వరుని పుత్రుఁడా! ఓగణనాథా! నీకుఁ బ్రదక్షిణం బొనర్చెదను. నాకుఁ బ్రత్యక్షమగుము. 3 నేను జన్మజన్మములందుఁ జేసిన పాపకర్మంబు లన్నియుఁ బ్రదక్షిణము చేయునొక్కొక్కయడుగునను వొలఁగుచున్నవి. 4 నేను పాపుఁడను, పాపపుఁబనులు నేయువాఁడను, పాపబుద్ధిగలవాఁడను, పాపములకునికియైయుండువాఁడను. ఓ దేవా! శరణుచొచ్చినవారిని కాపాడువాఁడా! నన్నుఁ గృపతోఁ గాపాడుము.

అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ,
తస్మాత్కారుణ్యభావేన రక్షరక్ష వినాయక.

తా. నీవు తక్క నాకు వేఱుదిక్కు లేదు. కావున వినాయకా! నన్ను దయతోఁ బలుమాఱు గాపాడుము (అని ప్రదక్షిణ నమస్కారములఁ జేయవలెను.)

పూజావిధానం సంపూర్ణమ్.

---

కథా ప్రారంభము

శ్లో. ఆసీత్పురా చన్ద్రవంశే రాజా ధర్మఇతి శ్రుతః, స్వరాజ్యే దైవయోగేన జ్ఞాతిభిః కుటిలైర్హృతే. 1. అనుజైర్భార్యయా సార్ధం జగామ గహనం వనం, బహువృక్షసమాకీర్ణం నానామృగసమన్వితమ్. 2. బహుపక్షికులోపేతం వ్యాఘ్రభల్లూకసఙ్కులమ్,

తా. పూర్వము చంద్రవంశమున ధర్మరాజని ప్రసిద్ధికెక్కిన నృపాలుండుండెను. ఆతఁడు తన గ్రహచారము చాలమిచేతఁ దన రాజ్యమును దాయాదు లపహరింపఁగా తమ్ములును భార్యయుఁగూడి పెక్కు వృక్షములతోఁగూడి పెక్కుపక్షులును, పులులు, ఎలుఁగుబంట్లు మొదలగు బహుభీకరమృగంబులు గలిగి చొఁరనలవికాకయున్న వనమును బ్రవేశించెను.

తత్రతత్ర సమావిష్టా మునయో బ్రహ్మవాదినః. 3. ఆదిత్య సన్నిభాః సర్వే సర్వే వహ్నిసమప్రభాః, తేజోమణ్డలసఙ్కాశా వాయుపర్ణామ్బుభక్షకాః. 4. అగ్నిహోత్రరతా నిత్యమతిథీ

నాం చ వ్రాజకాః, ఊర్ధ్వబాహూనిరాలమ్బాః సర్వే ముని గణాస్తథా. 5. తాన్ పశ్యన్ ధర్మరాజోఽపి సంభ్రమేణ సమన్వితః. సూతాశ్రమం సమాసాద్య సూతం దృష్ట్వా ససంభ్రమః. 6. నత్వా చ భార్యయా సార్థమనుజైః సముపావిశత్.

తా. ఆవనమునం దచ్చటచ్చట బ్రహ్మవాదులయిన మునులు కూర్చుండియుండిరి. వారందఱు సూర్యుని, అగ్నిని బోలిన కాంతిగలవారును, వెలుఁగుల రాశింబోలినవారును, గాలియు ఆకలములు నీరుమాత్రమే యాహారముగాఁ గలవారును, ఎల్లప్పు డగ్నిహోత్రములను జేయువారును, అతిథులను బూజించువారును, చేతులు పైకెత్తియు ఆధారములేకయుఁ దపస్సు చేయువారును నైయుండిరి. ధర్మరాజు మునులందరిని జూచి మనస్సున సంతసము పడుచు సూతమహాముని యాశ్రమమునకుఁబోయి యమ్మునీంద్రునింజూచి తత్తరపాటుతోఁగూడినవాఁడై, తాను భార్యతోను తమ్ములతోనుగూడ నమ్మునీంద్రునికి నమస్కరించి యాతని యాజ్ఞవడసి కూర్చుండి యామునీంద్రులతో ని ట్లనియె.

ధర్మఉవాచ—సూతసూత మహాప్రాజ్ఞ సర్వశాస్త్రవిశారద. 7. వయం చ భార్యయా సార్థం జ్ఞాతిభిః పరిపీడితాః, స్వరాజ్యం సకలం చైవ పుత్రాశ్చాపహృతా హి నః. 8. తవ దర్శనమాత్రేణ సర్వం దుఃఖం వినాశితం, మమోపరి కృపాం కృత్వా వ్రతం బ్రూహి దయానిధే. 9.

తా. "సకలశాస్త్రములను జదివిన గొప్పపండితుఁడవైన ఓ సూతమహామునీ! మాదాయాదు లగుకౌరవులు మాతో మోసపుజూదమాడి, మారాజ్యంబంతయు లాగికొని మమ్మును

ద్రౌపదిని సకలవిధంబుల బాధించి, మాపుత్త్రులనుజంపి, మాకుఁ దీరనిదుఃఖము గలిగించిరి. తమ దర్శనప్రభావముచేతనే మా దుఃఖమెల్లం బోలఁగినవి. దయకు నిధియైన ఓమహాత్మా! మామీఁద ననుగ్రహించి, మాకు మరల రాజ్యము వడయుటకు సాధనమైన యొక వ్రతంబు ననుగ్రహింపవలయును" అని ధర్మరాజు సూతమహాముని నడుగఁగా, నమ్మునీంద్రుఁ డి ట్లనియె.

సూత ఉవాచ.—వ్రతం సంపత్కరం నృణాం సర్వసౌఖ్య ప్రవర్ధనం, శృణుధ్వం పాణ్డవాః సర్వే వ్రతానాముత్తమం వ్రతమ్. 10. రహస్యం సర్వపాపఘ్నం పుత్రపౌత్రాభివర్ధనం, వ్రతం సాంబశివేనైవ స్కన్దస్యోదోభిధితం పురా. 11.

తా. ఓపాండవులారా! మీరందఱు వినుఁడు. వ్రతములలో నెల్ల నుత్తమమైన వ్రతమున్నది. ఆవ్రతము మానవులకు సంపదను, సౌఖ్యములన్నిటిని వృద్ధినొందించునది. పరమగోప్యమైనది. సకలపాపములను బోఁగొట్టునది. పుత్రపౌత్రాదులను వృద్ధిచెందించునది. ఓపాండవులారా! తొల్లి యీవ్రతమును పరమేశ్వరుడు కుమారస్వామికి నుపదేశించెను. కుమారస్వామి పరమేశ్వరుని పృచ్ఛచేసినరీతియు, ఆపరమేశ్వరుఁడు కుమారునికిఁ బదులు చెప్పినరీతియు నెఱిఁగించెదను వినుఁడు.

కైలాసశిఖరే రమ్యే నానామునినిషేవితే, మన్దారవిటపిప్రాన్తే నానామణివిభూషితే. 12. హేమసింహాసనాసీనం శఙ్కరం లోకశఙ్కరం, పప్రచ్ఛ షణ్ముఖస్తుష్టో లోకానుగ్రహకాఙ్క్షయా. 13. స్కన్దఉవాచ. కేన వ్రతేన భగవన్ సౌభాగ్యమతులం భవేత్, పుత్రపౌత్రాన్ ధనం లబ్ధ్వా మనుజః సుఖ

మేధతే. 14. తన్మే వద మహాదేవ వ్రతానాముత్తమం వ్రతం,
ఈశ్వర ఉవాచ. అస్తిచాత్ర మహాభాగ గణనాథ ప్రపూజనమ్.
15. సర్వసమ్పత్కరం శ్రేష్ఠమాయుఃకామార్థసిద్ధిదం, మాసే
భాద్రపదే శుక్లచతుర్థ్యాం వ్రతమాచరేత్. 16. ప్రాతః స్నాత్వా
శుచిర్భూత్వా నిత్యకర్మ సమాచరేత్, స్వశక్త్యా గణ
నాథస్య స్వర్ణరౌప్యమథాకృతిమ్. 17. అథవా మృణ్మయం
కుర్యాద్విత్తశాఠ్యం న కారయేత్, స్వగృహస్యోత్తరే దేశే
మణ్డపం కారయేత్తతః. 18. తన్మధ్యేఽష్టదళం పద్మం యవైర్వా
తణ్డులేన వా, ప్రతిమాం తత్ర సంస్థాప్య పూజయిత్వాప్రయ
త్నతః. 19. శ్వేతగన్ధాక్షతైః పుష్పైర్దూర్వాఙ్కురసమన్వితైః,
ధూపైర్దీపైశ్చ నైవేద్యైర్మోదకైర్ఘృతపాచితైః. 20. ఏకవిం
శతిసంఖ్యాని నారికేళఫలాన్యపి, రంభాజమ్బుకపిత్థాఘానిక్షుఖ
ణ్డాంశ్చతావతః. 21. ఏవమన్యఫలాపూపైర్నైవేద్యం కారయే
త్సుత, నృత్తగీతైశ్చవాద్యైశ్చ పురాణపఠనాదిభిః. 22. తర్పయే
ద్గణనాథం చ విప్రాన్ దానేన శ్రోత్రియాన్, బంధుభిః స్వజనైః
సార్థం భుంజీయాత్తైలవర్జితమ్. 23. ఏవం యః కురుతే
మర్త్యో గణనాథప్రసాదతః, సిద్ధ్యన్తి సర్వకార్యాణి నాత్ర
కార్యా విచారణా. 24. తతః ప్రభాతే విమలే పునఃపూజాంసమా
చరేత్, మౌంజీం కృష్ణాజినం దణ్డముపవీతం కమణ్డలుమ్. 25.
పరిధానం తథా దద్యాద్యథావిభవముత్తమం, ఉపాయనం
తతో దద్యాదాచార్యాయ స్వశక్తితః. 26. అన్యేభ్యో దక్షి
ణాం దద్యాద్బ్రాహ్మణాన్ భోజయేత్తతః, త్రైలోక్యవిశ్రుతం
చైతద్వ్రతానాముత్తమోత్తమమ్. 27. అన్యైశ్చ దేవమునిభి
ర్గన్ధర్వైః కిన్నరైస్తథా, చీర్ణమేతద్వ్రతం సర్వైః పురాకల్పే

షడానన. 28. ఇతి పుత్త్రాయ శర్వేణ షణ్ముఖాయోదితం పురా, ఏవం కురుష్వ ధర్మజ్ఞ గణనాథ ప్రపూజనమ్. 29. విజయస్తే భవేన్నిత్యం సత్యంసత్యం వదామ్యహం, ఏతద్వ్రతం హరిశ్చాపి దమయన్తీ పురాఽకరోత్. 30. కృష్ణో జామ్బవతీమాగాద్రత్నం చాపి స్యమన్తకం, దమయన్తీ నళంచైవ వ్రతస్యాస్య ప్రభావతః. 31. శక్రేణ పూజితః పూర్వం వృత్రాసురవధే తథా, రామదేవేన తద్వచ్చ సీతాయా మార్గణే తథా. 32. భగీరథేన తద్వచ్చ గఙ్గామానయతా పురా, అమృతోత్పాదనార్థాయ తథా దేవాసురైరపి. 33. కుష్ఠవ్యాధియుతేనాపి సామ్బేనారాధితః పురా, ఏవముక్తస్తు సూతేన సానుజః పాణ్డునన్దనః. 34. పూజయామాస దేవస్య పుత్త్రం త్రిపురఘాతినః, శత్రుసంఘం నిహత్యాశు ప్రాప్తవాన్ రాజ్యమోజసా. 35. పూజయిత్వా మహాభాగం గణేశం సిద్ధిదాయకం, సిద్ధ్యన్తి సర్వకార్యాణి మనసా చిన్తితాన్యపి. 36. తేన ఖ్యాతిం గతో లోకే నామ్నా సిద్ధివినాయకః, విద్యారమ్భే పూజితశ్చేత్ విద్యాలాభో భవేద్ధ్రువమ్. 37. జయం చ జయకామశ్చ పుత్త్రార్థీ లభతే సుతాన్, పతికామా చ భర్తారం సౌభాగ్యం చ సువాసినీ. 38. విధవా పూజయిత్వా తు వైధవ్యం నాప్నుయాత్క్వచిత్, బ్రాహ్మణః క్షత్త్రియో వైశ్యః శూద్రో వాఽప్యథవా స్త్రియః. 39. అర్భకశ్చాపి భక్త్యా చ వ్రతం కుర్యాద్యథావిధి, సిద్ధ్యన్తి సర్వకార్యాణి గణనాథప్రసాదతః. 40. పుత్త్రపౌత్త్రాభివృద్ధిం చ గజాద్యైశ్వర్యమాప్నుయాత్. 41.

ఇతి వినాయకవ్రతకల్పః సమాప్తః.

---

తా. మునులందఱికి ఉనికిపట్టయిన రమ్యమైన కైలాసపర్వత శిఖరంబున నవరత్నములచేఁ జెక్కఁబడిన కల్పవృక్షము క్రింద బంగారుసింహాసనముమీఁద లోకులకు మేలుచేయునట్టియీశ్వరుఁడు కూర్చుండియుండఁగా కుమారస్వామి జనులకు మేలుచేయ గోరినవాఁడై, తండ్రినిఁ జూచి "యోభగవంతుఁడా! మానవుం డేవ్రతము నాచరించినయెడల నతనికి సాటిలేని సంపదలు గలుగును? పుత్త్రపౌత్త్రులును, ధనమును గలవాఁడై మనుష్యుఁడు సుఖముకలిగి యుండును? ఓమహాదేవా! నాకిట్టివ్రతములలో నుత్తమోత్తమమయిన యొకవ్రతంబు ననుగ్రహింపుము" అని యడుగఁగా, శివుఁడును తన కుమారునిఁ జూచి యిట్లనియె.

కుమారా! సకలసంపదలను, దీర్ఘాయుస్సును, కోరినకోరికలను, పశులను నొసఁగునట్టి గణపతిపూజనమనెడి యొక వ్రతంబు గలదు. ఆవ్రతమును భాద్రపదశుక్లచతుర్థినాఁ డాచరింపవలెను. ఆదినమున ఉదయమున లేచి స్నానముజేసి పరిశుద్ధుఁడై సంధ్యావందనము మొదలగు నిత్యకర్మములను జేసికొని, తనశక్తికిఁ దగినట్లు ద్రవ్యలోపము చేయక వెండితోఁగాని, బంగారుతోఁగాని, తుదకు మంటితోఁగాని వినాయకునిప్రతిమను జేసికొని తనయింటియొక్క యుత్తరపువైపున నొకపాలవల్లి నేర్పఱచి, దానినడుమ నెనిమిదిదళములుగలకమలమును యవలతోఁగాని బియ్యపుఁబిండితోఁగాని నిర్మించి, యచ్చట నాప్రతిమను బెట్టి భక్తిపూర్వకముగా తెల్లనిగంధముతోను అక్షతలతోను పూవులతోను గరికపోచలతోను యిరువది యొకపత్రములతోను పూజచేసి, ధూపదీపములను సమర్పించి నేతితో వండినకుడుములు, ఇరువదియొకటేసివంతున టెంకాయలు, ఇంకను అరఁటిపండ్లు, నేరేడిపండ్లు, వెలఁగపండ్లు,

చెఱకుగడలు, మఱి యనేకవిధము లగుభక్ష్యములు పండ్లును నైవేద్యముపెట్టి వినాయకునిసన్నిధిని నాట్యములుసల్పి, పాటలు పాడి పురాణపఠనము మొదలగు ఉపచారములచే వినాయకునిఁ దనివి నొందించి, వేదాధ్యయనపరు లయినబ్రాహ్మణులకు వాయనదానంబుచేసి, పిమ్మట తానును తనబంధువులును మిత్రులును తృప్తిగా నూనె తగులకుండ భోజనము సలుపవలయును. ఈప్రకారము భక్తితో నీ వినాయకవ్రతంబు నాచరించువానికిఁ బను లన్నియు సందేహాము లేకుండ సిద్ధింపఁగలవు. ఆమఱుసటిదినము ఉదయమున నిద్రలేచి, ముందటిదినమందువలెనే సకలానుష్ఠానములను దీర్చుకొని గణనాయకునికి పునఃపూజ చేయవలయును. ఆదినమున నొకబ్రహ్మచారికి వినాయకునిప్రీతికై, ముంజదర్భత్రాటిని, కృష్ణాజినమును, దండమును, యజ్ఞోపవీతమును, కమండలమును, వస్త్రమును తన శక్తికిఁ దగినట్లుగా నీయవలయును. పిమ్మటఁ దనపురోహితునికి శక్తికి లోపములేకుండ ఉపాయన మియ్యవలెను. తక్కినబ్రాహ్మణులకును శక్తికొలఁది దక్షిణలిచ్చి, భోజనముపెట్టవలయును. ఇది వ్రతములలోనెల్ల నుత్తమవ్రతంబు. మూఁడులోకంబులందును బ్రసిద్ధిచెందినది. ఈవ్రతమును ముందటికల్పమున దేవతలును, మునులును, గంధర్వులును, కిన్నరులును, మఱి యనేకులాచరించిరి. ఓధర్మరాజా! యీ ప్రకారము పరమశివుఁడు తన పుత్రుఁడయినకుమారస్వామి కుపదేశించెను. ఓధర్మరాజా! నీవును ఈప్రకారముగా గణపతిపూజచేయుము. నీకు తప్పక జయంబు గలుగఁగలదు. నామాటనిక్కము. నిక్కము. నమ్ముము. ఈవ్రతమును భూలోకమునెందరోయాచరించిరి. ఈవ్రతముచేసి దమయంతి నలుని బడసెను. కృష్ణుఁడాచరించి జాంబవతిని, స్యమంతక

మణిని బడసెను. ఇంద్రుఁడు పూజించి వృత్రాసురునిసంహరించెను. రావణుఁడు సీతనెత్తుకొని పోయినప్పుడు, రాముఁ డీవ్రతము చేసి సీతను బడసెను. భగీరథుఁడు గంగ దెచ్చునపుడును దేవాసురు లమృతము పుట్టించునిమిత్తమును, సాంబుఁడు తన కుష్ఠరోగము తొలఁగునిమిత్తమును ఈగణనాథవ్రతము లాచరించితమతమకోరికలను బడసిరి. ఇట్లు సూతమహాముని చెప్పఁగా ధర్మరా జావిధిప్రకారము గణపతిపూజఁ గావించి, శత్రువులను సంహరించి, రాజ్యమును దనపరాక్రమమున సంపాదించుకొని సుఖంబుండెను. మనసులోఁ దలఁచినకార్యములుగూడ జరుగుచుండును గనుకనే ఆవినాయకునికి సిద్ధివినాయకుఁ డని పేరు ప్రసిద్ధికి వచ్చినది. ఈగణనాథుని విద్య యారంభించునపుడు పూజించినయెడల విద్య బాగుగ వచ్చును. జయముగోరువాఁడు పూజచేసిన జయమునుపొందును. బిడ్డలుగోరువాఁడు పూజించిన బిడ్డలంగాంచును. మగని కోరుదానికి వయస్సుమగఁడు వచ్చును. సుమంగలి పూజించినయెడల సౌభాగ్యమును బొందును. విధవ పూజించినయెడలఁ బైజన్మకు విధవత్వము రానేరదు. బ్రాహ్మణక్షత్రవైశ్యశూద్రు లనెడి నాలుగువర్ణములవారును, స్త్రీలును, పిల్లవాండ్రునుగూడ యథావిధిగా నీవ్రతము సేయవలయును. గణనాయకుని ప్రసాదమువలన నట్టిమనుష్యునికి సకల కార్యములుసిద్ధించును. పుత్రపౌత్రాభివృద్ధియు, ఏనుఁగులవఱకు నుండెడికల్మియుఁ గలుగును అని పాండురాజపుత్రునికి సూతమహామునిచెప్పఁగా నతఁడట్లైచేసి సకలైశ్వర్యములనుబొందెను.

ఇది శ్రీస్కాందపురాణమున ఉమామహేశ్వరసంవాదమున
వినాయకవ్రతకల్పము సంపూర్ణము.

---

# సరస్వతీ వ్రతము



ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ మమ (అస్మాకం) ధర్మార్థకామమోక్షరూప చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థం సకలవిద్యాపారంగతత్వసిద్ధ్యర్థం చ వర్షే వర్షే ప్రయుక్తాం శ్రీసరస్వతీదేవతాముద్దిశ్య సరస్వతీదేవతా ప్రీత్యర్థం కల్పోక్తప్రకారేణ యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచారపూజాం కరిష్యే. *

అని సంకల్పముచేసి కలశపూజాదులను చేయవలెను.



## సరస్వతీపూజా ప్రారంభము

శ్లో. (పుస్తకేషు యతో దేవీ క్రీడతే పరమార్థతః, తతస్తత్ర ప్రకుర్వీత ధ్యానమావాహనాదికమ్.) ధ్యానమేవం ప్రకుర్వీత సాధకో విజితేన్ద్రియః, ప్రణవాసనమారూఢాం తదర్థత్వేన నిశ్చితామ్. అఙ్కుశం చాక్షసూత్రంచ పాశం వీణాంచ ధారిణీం, ముక్తాహారసమాయుక్తాం మోదరూపాం మనోహరామ్.

---

* "శుక్లాంబరధరం" మొదలగు భగవద్ధ్యానము మొదటఁజేసి పిమ్మట పైరీతిగా సంకల్పముచేసి, ఆవల కలశపూజయు, గణాధిపతిపూజయు, ప్రాణప్రతిష్ఠయుఁ జేసి, పూజనారంభింపవలెను. భగవద్ధ్యానము, సంకల్పవిధానము, గణాధిపతిపూజ, ప్రాణప్రతిష్ఠ వీనివిధానములను వినాయకవ్రతముఁ జూచి తెలిసికొనవలయును. గ్రంథము పెరుగు ననెడి హేతువుచే నవి యిచ్చట వ్రాయఁబడలేదు.

కృతేన దర్పణాభేన వస్త్రేణోపరి భూషితాం, సుస్తనీం వేద వేద్యాం చ చన్ద్రార్ధకృతశేఖరామ్. జటాకలాపసంయుక్తాం పూర్ణ చన్ద్రనిభాననాం, త్రిలోచనాం మహాదేవీం స్వర్ణనూపురధారి ణీమ్. కటకైః స్వర్ణరత్నాద్యైర్ముక్తావలయభూషితాం, కమ్బు కణ్ఠీం సుతామ్రోష్ఠీం సర్వాభరణభూషితామ్. కేయూరై ర్మేఖ లాద్యైశ్చ ద్యోతయన్తీం జగత్త్రయం, శబ్దబ్రహ్మాత్మికాం దేవీం ధ్యానకర్మసమాహితః.

సరస్వత్యై నమః ధ్యాయామి.

(సరస్వతి పుస్తకములందు సర్వదా క్రీడించుచుండును గావున జితేంద్రియుఁడయినపురుషార్థములఁ గోరునతఁడు పుస్త కములందే ధ్యానావాహనాది పూజలం జేయవలయును) ఓం కారరూప మగుపీఠమునఁ గూర్చుండునదియు, ఆఓంకారార్థమని నిర్ణయింపఁబడినదియు, అంకుశము, జపమాల, పాశము, వీణను ధరించునదియు, ముత్యాలసరములను దాల్చినదియు, సంతోష స్వరూపురాలును, చక్కఁగా నేయబడిన యద్దము, బోలెడి వెలిపట్టుబట్టను గట్టినదియు, సుస్తనియు వేదములచే నెఱుఁగఁ దగినదియు, అర్ధచంద్రుని శిరస్సునందుఁ దాల్చినదియు, జడల గుంపుతో వెలయునదియు, నిండుచంద్రుని బోలు మోముగల దియు, మూఁడుకన్నులు గలదియు, దేవతలలో నెక్కుడయిన నదియు, బంగారపుటందెలు, రవలుచెక్కిన చేతిగాజులు, ఢిడ్యాణము, వంకీలు మొదలగు సకలభూషణంబులఁ దాల్చి నదియు, ఎఱ్ఱనిమోవియు, శంఖమువంటి మెడయుఁ గలదియు, తనభూషణముల మెఱుఁగుచే ముల్లోకంబులను వెలుఁగఁజేయు నదియునైన శబ్దబ్రహ్మస్వరూపిణి యగుసరస్వతీదేవిని ధ్యానించు చున్నాను.

అత్రాగచ్ఛ జగద్వన్ద్యే సర్వలోకైకపూజితే,
మయా కృతామిమాం పూజాం గృహాణ జగదీశ్వరి.

సరస్వతీమావాహయామి

జగములనేలునట్టియు, జనులచేఁ గొనియాడంబడు ఓతల్లీ! యిచ్చటికి విజయముచేసి నేనొనర్చుపూజను గైకొనుము.

అనేకరత్నసంయుక్తం సువర్ణేన విరాజితం,
ముక్తామణ్యాఞ్చితం చారు చాసనం తే దదామ్యహమ్.

సరస్వత్యై ఆసనం సమర్పయామి.

ఓ సరస్వతీ! రతనాలుచెక్కి ముత్యాలసరంబులు గట్టిన బంగారపుసింహాసనము నొసఁగెదను అనుగ్రహింపుము.

గన్ధపుష్పాక్షతైః సార్ధం శుద్ధతోయేన సంయుతం,
శుద్ధస్ఫటికతుల్యాఙ్గి పాద్యం తే ప్రతిగృహ్యతామ్.

సరస్వత్యై పాద్యం సమర్పయామి

ఓస్ఫటికమువలెఁ దెల్లనైనమేనుగలదేవీ! గంధపుష్పాక్షతలు చేర్చిన పరిశుద్ధజలముచేఁ బాద్య మొసఁగెదను. స్వీకరింపుము.

భక్తాభీష్టప్రదే దేవి దేవదేవాదివన్దితే,
ధాతృప్రియే జగద్ధాత్రి దదామ్యర్ఘ్యం గృహాణ మే.

సరస్వత్యై నమః అర్ఘ్యం సమర్పయామి

భక్తుల కోరికల నిచ్చుదానా! ఇంద్రుఁడు మొదలగుదేవతలచేఁ గొనియాడఁ బడుదానా! లోకరక్షకురాలా! బ్రహ్మదేవునిరాణీ! నే నిచ్చు అర్ఘ్యమును స్వీకరింపుము.

పూర్ణచన్ద్రసమానాభే కోటిసూర్యసమప్రభే,
భక్త్యా సమర్పితం వాణి గృహాణాచమనీయకమ్.

సరస్వత్యై నమః ఆచమనీయం సమర్పయామి.

పున్నమచంద్రునివలెను, కోటిసూర్యులవలెను ప్రకాశించు ఓదేవీ! నేను భక్తితో నొసఁగు ఆచమనీయమును గ్రహింపుము.

కమలభువనజాయే కోటిసూర్యప్రకాశే, విశదశుచివిలాసే
కోమలే హారయుక్తే, దధిమధుఘృతయుక్తం క్షీరరమ్భా
ఫలాఢ్యం, సురుచిరమధుపర్కం గృహ్యతాం దేవవన్ద్యే.

సరస్వత్యై మధుపర్కం సమర్పయామి

కోటిసూర్యులవంటి కాంతిగలదానవు, శుభ్రమైనచిఱునగవు గలదానవు, హారములఁ దాల్చినదానవు, దేవతలచేఁ గొనియాడఁబడుదానవునైన యో బ్రహ్మపత్నీ ! పెరుగు, తేనె, పాలు, అరఁటిపండ్లు గలిపినమధుపర్కము నొసఁగెదను గ్రహింపుము.

* దధిక్షీరఘృతోపేతం శర్కరామధుసంయుతం,
పంచామృతస్నానమిదం స్వీకురుష్వ మహేశ్వరి.

సరస్వత్యై పఞ్చామృతస్నానం సమర్పయామి

శుద్ధోదకైశ్చ సుస్నానం కర్తవ్యం విధిపూర్వకం,
సువర్ణకలశానీతై ర్నానాగన్ధసువాసితైః.

సరస్వతీం స్నాపయామి

---

*పంచామృతము, స్నానము, వస్త్రము, యజ్ఞోపవీతము, గంధము ధూపము, దీపము, నైవేద్యము, నీరాజనము మొదలగువానికిగాను వలయుం మంత్రములను (వినాయకవ్రతమునందు) చూడవలయును.

బంగారు పాత్రములతోఁ దెచ్చి, సువాసనద్రవ్యములు చేర్చిన శుద్ధజలములతో స్నానము చేయింపవలయును.

శుక్లవస్త్రద్వయం దేవి కోమలం కుటిలాలకే,
మయి ప్రీత్యా త్వయా వాణి బ్రహ్మాణి ప్రతిగృహ్యతామ్.
సరస్వత్యై వస్త్రయుగ్మం సమర్పయామి.

వంకరముంగురులుగల ఓ బ్రహ్మదేవునిరాణీ! నేను రెండు తెల్లనివస్త్రముల నర్పించెద కైకొనుము.

శబ్దబ్రహ్మాత్మికే దేవి శబ్దశాస్త్రకృతాలయే,
బ్రహ్మసూత్రం గృహాణ త్వం బ్రహ్మశక్రాదిపూజితే.
సరస్వత్యై యజ్ఞోపవీతం సమర్పయామి.

వ్యాకరణ శాస్త్రమందు వసించుదానవు, ఇంద్రుడు మొదలగు దేవతలచేఁ గొనియాడఁబడుదానవు నైనశబ్దబ్రహ్మ స్వరూపురాలా! యజ్ఞోపవీతము నొసఁగుచున్నాను. గ్రహింపుము.

కటకముకుటహారై ర్నూపురై రంగ దాద్యై
ర్వివిధసుమణియుక్తై ర్మేఖలారత్నహారైః,
కమలదళవిలాసే కామదే సంగృహీష్వ
ప్రకటితకరుణార్ద్రే భూరిశో భూషణాని
సరస్వత్యై ఆభరణాని సమర్పయామి.

ఎక్కువదయగలిగి, భక్తుల కోరికలనిచ్చు ఓ దేవీ! చేతి మురుగులు, కిరీటము, హారములు, అందెలు, వంకీలు, మొల నూళ్లు మొదలగు నవరత్నములు చెక్కిన పలుసొమ్ములను గ్రహింపుము.

చన్దనాగరుకస్తూరీకర్పూరాద్యైశ్చ సంయుతం,
గన్ధం గృహాణ తం దేవి విధిపత్ని నమోఽస్తు తే.
సరస్వత్యై గంధం సమర్పయామి.

ఓ బ్రహ్మదేవుని రాణీ! చందనము, అగరువు, కస్తూరి, పచ్చకర్పూరము మొదలగు సువాసనద్రవ్యములు గలిపినగంధమును గ్రహింపుము, ఓ దేవీ! నీకు మ్రొక్కెదను.

అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ శాలితణ్డులనిర్మితాన్,
గృహాణ వరదే దేవి బ్రహ్మపత్ని శుభాత్మకాన్.
సరస్వత్యై అక్షతాన్ సమర్పయామి.

ఓవరముల నొసఁగు బ్రహ్మదేవునిరాణీ! తెల్లని బియ్యముతోఁ గలిపిన యక్షతల నొసఁగుచున్నాను.

నన్ద్యావర్తాదిపుష్పైశ్చ మల్లికాభిర్మనోహరైః,
కరవీరైర్మనోరమ్యైర్వకులైః కేతకైః శుభైః,
పున్నాగైర్జాతికుసుమైర్మన్దారైశ్చ సుశోభితైః,
నీలోత్పలైః శుభైశ్చాన్యైస్తత్కాలతరుసమ్భవైః,
కల్పితాని చ మాల్యాని గృహాణామరవన్దితే.
పుష్పైః పూజయామి.

ఓ దేవీ! నంద్యావర్తము, జాజి, మల్లె, పొగడ, తామరలు మొదలగు తత్కాల పుష్పములతోఁ గట్టిన దండలను విడిపూవులను సమర్పించెదను గైకొనుము.

---

## అథాంగపూజ

బ్రహ్మణ్యై నమః పాదౌ పూజయామి.
బ్రహ్మణ్యమూర్తయే నమః గుల్ఫౌ ,,

జగత్స్వరూపిణ్యై నమః జంఘే పూజయామి.
జగదాద్యాయై నమః జానునీ ,,
చారువిలాసిన్యై నమః ఊరూ ,,
కమలభూమయే నమః కటిం ,,
జన్మహీనాయై నమః జఘనం ,,
గమ్భీరనాభయే నమః నాభిం ,,
హరిపూజ్యాయై నమః ఉదరం ,,
లోకమాత్రే నమః స్తనౌ ,,
విశాలవక్షసే నమః వక్షః స్థలం ,,
గానవిచక్షణాయై నమః కంఠం ,,
స్కందప్రపూజ్యాయై నమః స్కన్ధౌ ,,
ఘనబాహవే నమః బాహూ ,,
పుస్తకధారిణ్యై నమః హస్తౌ ,,
శ్రోత్రియబన్ధవే నమః శ్రోత్రే ,,
వేదస్వరూపాయై నమః వక్త్రం ,,
సునాసాయై నమః నాసికాం ,,
బింబోష్ఠ్యై నమః ఓష్ఠౌ ,,
కమలచక్షుషే నమః నేత్రే ,,
తిలకధారిణ్యై నమః ఫాలం ,,
చన్ద్రమూర్తయే నమః చికురాన్ ,,
సర్వప్రదాయై నమః ముఖం ,,
మహాసరస్వత్యై నమః శిరః ,,
బ్రహ్మరూపిణ్యై నమః సర్వాణ్యఙ్గాని పూజయామి.



## అథాష్టోత్తరశతనామపూజా

ప్రతినామమునకు వెంబడి "నమః" అని చేర్పవలయును.

ఓం సరస్వత్యై నమః
మహామాయాయై
వరప్రదాయై
శ్రీప్రదాయై
పద్మనిలయాయై
పద్మాక్ష్యై
పద్మవక్త్రాయై
శివానుజాయై
పుస్తకహస్తాయై
జ్ఞానముద్రాయై
రమాయై
కామరూపిణ్యై
మహావిద్యాయై
మహాపాతకనాశి
న్యై నమః
మహాశ్రయాయై
మాలిన్యై
మహాభోగాయై
మహాభుజాయై
మహాభాగాయై
మహోత్సాహాయై
దివ్యాఙ్గాయై

సురవన్దితాయై
మహాకాళ్యై
మహాపాశాయై
మహాకారాయై
మహాఙ్కుశాయై
పీతాయై
విమలాయై
విశ్వాయై
విద్యున్మాలాయై
వైష్ణవ్యై
చన్ద్రికాయై
చన్ద్రలేఖావిభూషి
తాయై నమః
సావిత్ర్యై
సురసాయై
దేవ్యై
దివ్యాలఙ్కారభూషి
తాయై
వాగ్దేవ్యై
వసుధాయై
తీవ్రాయై
మహాభద్రాయై

మహాబలాయై
భోగదాయై
భారత్యై
భామాయై
గోవిన్దాయై
గోమత్యై
జటిలాయై
విన్ధ్యవాసిన్యై
చణ్డికాయై
బ్రాహ్మ్యై
బ్రహ్మజ్ఞానైకసాధ
నాయై
సౌదామిన్యై
సుధామూర్తయే
సుభద్రాయై
సురపూజితాయై
సురవాసిన్యై
సునాసాయై
వినిద్రాయై
పద్మలోచనాయై
విద్యారూపాయై
విశాలాక్ష్యై

బ్రహ్మజాయాయై
మహాబలాయై
త్రయీమూర్తయే
త్రికాలజ్ఞాయై
త్రిగుణాయై
శాస్త్రరూపిణ్యై
శుమ్భాసురప్రమథిన్యై
శుభదాయై
సర్వాత్మికాయై
రక్తబీజనిహన్త్ర్యై
చాముండాయై
అంబికాయై
ముండకాయప్రహరణాయై నమః
ధూమ్రలోచనమర్దనాయైనమః
సర్వదేవస్తుతాయై
సౌమ్యాయై
సురాసురనమస్కృతాయై నమః
కాలరాత్ర్యై
కళాధారాయై
వాగ్దేవ్యై
వరారోహాయై
వారాహ్యై
వారిజాసనాయై
చిత్రామ్బరాయై
చిత్రగన్ధాయై
చిత్రమాల్యవిభూషితాయై నమః
కారకాయై
కామప్రదాయై
వన్ద్యాయై
రూపసౌభాగ్యదాయిన్యై
శ్వేతాననాయై
నీలభుజాయై
శ్వేతస్తనసుపూజితాయై
రక్తమధ్యాయై
నీలజంఘాయై
నిరఞ్జనాయై
చతురాననసామ్రాజ్యాయై
చతుర్వర్గఫలప్రదాయై
హంసవాహనాయై
బ్రహ్మవిష్ణుశివాత్మికాయై
శ్రీసరస్వత్యై నమః.

అష్టోత్తరశతనామపూజాం సమర్పయామి.

దశాఙ్గం గుగ్గులోపేతం సుగన్ధం చ మనోహరం,
ధూపం గృహాణ కల్యాణి భక్తిం త్వయ్యచలాం కురు.

సరస్వత్యై ధూపమాఘ్రాపయామి

ఘృతాక్తవర్తిత్రితయాద్దీపితం దీపమమ్బికే;
గృహాణ చిత్స్వరూపే త్వం కమలాసనవల్లభే.

సరస్వత్యై దీపం దర్శయామి.

ఓతల్లీ! జ్ఞానరూపురాలా! ఓ బ్రహ్మదేవుని రాణీ! మూఁడు వత్తులువేసి నేతితో వెలిఁగించిన దీపమును గైకొనుము.

అపూపాన్ వివిధాన్ స్వాదూన్ శాలిపిష్టోపపాచితాన్,
మృదులాన్ గుడసమ్మిశ్రాన్ సజీరకమరీచికాన్.
కదళీపనసామ్రం చ సుపక్వాని ఫలాని చ,
కన్దమూలం వ్యఞ్జనాది సోపదంశం మనోహరమ్.
అన్నం చతుర్విధోపేతం క్షీరాన్నం సఘృతం దధి,
శీతోదకం చ సుస్వాదు కర్పూరైలాదివాసితమ్.
భక్ష్యభోజ్యసమాయుక్తం నైవేద్యం ప్రతిగృహ్యతామ్.
సరస్వత్యై నైవేద్యం సమర్పయామి.

పూర్ణము పెట్టిచేసిన యనేకపిండివంటకములను, జీలకఱ్ఱ మిరియాలుచేర్చి బెల్లము గలిపి వండినవంటకములను, అరఁటి, పనస, మామిడి మొదలగు చక్కఁగా ముగ్గినపండ్లను, చిలుగడము మొదలగుదుంపలను, కూరగాయలు, ఊఁఱుఁబిండ్లు, ఊఁఱుఁగాయలు, పలువిధములైన యన్నములు, పాయసము, నేయి, పెరుగు, వట్టివేళ్లు, పచ్చకర్పూరము, ఏలకులు మొదలగునవి కొట్టివేసిన భక్ష్యభోజ్యములతోఁగూడిన నైవేద్యమును ఆరగింపుము.

తాంబూలం చ సకర్పూరం పూగనాగదళైర్యుతం,
గృహాణ దేవదేవేశి తత్త్వరూప నమోఽస్తు తే.
సరస్వత్యై తామ్బూలం సువర్ణపుష్పం చ సమర్పయామి

ఓ బ్రహ్మస్వరూపురాలా! దేవతలకెల్లమించినదానా! తాంబూలము నను గ్రహింపుము. నీకు నమస్కారము.

నీరాజనం గృహాణ త్వం జగదానన్దదాయిని,
జగత్తిమిరమార్తాణ్డమణ్డలే తే నమోనమః.

సరస్వత్యై నీరాజనం సమర్పయామి.

సూర్యుఁడు చీఁకటిని బోఁగొట్టునట్టు లోకులయజ్ఞానముఁ బోఁగొట్టి, జగత్తునకు సంతోష మొసఁగు ఓదేవీ! నీరాజనము నిచ్చుచున్నాను. అనుగ్రహింపుము. నీకుఁ బలుమాఱు మ్రొక్కెదను.

శారదే లోకమాతస్త్వమాశ్రితాభీష్టదాయిని,
పుష్పాఞ్జలిం గృహాణ త్వం మయా భక్త్యా సమర్పితమ్.

సరస్వత్యై మన్త్రపుష్పం సమర్పయామి.

ఓ జగములకుఁ దల్లీ! భక్తుల కోర్కు లొసఁగుదానా! నేను భక్తితో సమర్పించినమంత్రపుష్పమును గ్రహింపుము.

యా కున్దేన్దుతుషారహారధవళా యా శుభ్రవస్త్రావృతా
యా వీణావరదణ్డమణ్డితకరా యా శ్వేతపద్మాసనా,
యా బ్రహ్మాచ్యుతశఙ్కరప్రభృతిభిర్దేవైః సదా పూజితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిఃశేషజాడ్యాపహా.

సరస్వత్యై మంత్రపుష్పం సమర్పయామి.

మల్లెపూలవలెను, చంద్రునివలెను, మంచువలెను, తెల్లనైనముత్యాలహారములను దాల్చినదియు, తెల్లనిపట్టుబట్టగట్టినదియు, వీణను వరదండమును జేతఁ దాల్చినదియు, తెల్లనితామరపువ్వునందుఁగూర్చుండునదియు, బ్రహ్మవిష్ణురుద్రులు మొదలగు దేవతలచేఁ గొనియాడఁబడునదియు, సకలజనుల యజ్ఞానముం బోఁగొట్టునదియునైన పూజ్యురాలగుసరస్వతీదేవి నన్నుఁగాపాడునుగాక!

పాహి పాహి జగద్వన్ద్యే నమస్తే భక్తవత్సలే,
నమస్తుభ్యం నమస్తుభ్యం నమస్తుభ్యం నమోనమః.
సరస్వత్యైచతుర్దశ (౧౪) ప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి.

ఓలోకపూజ్యురాలా! భక్తులందుఁ బ్రేమగలదానా! నన్నుఁ గాపాడుము. నీకు వేలకొలఁది నమస్కారములు.

పాశాఙ్కుశధరా వాణీ వీణాపుస్తకధారిణీ,
మమ వక్త్రే వసేన్నిత్యం దుగ్ధకున్దేన్దునిర్మలా.
చతుర్దశసు విద్యాసు రమతే యా సరస్వతీ,
చతుర్దశసు లోకేషు సా మే వాచి వసేచ్చిరమ్.

పదునాలుగులోకంబులందును, పదునాలుగు విద్యలయందును, పాశము, అంకుశము, వీణ, పుస్తకము అను నాలుగింటిని నాలుగుచేతులందుఁ దాల్చి విహరించుచు, క్షీరమువలెను, మల్లెపువ్వులవలెను, చంద్రునివలెను తెల్లనై వెలుఁగు సరస్వతి నామోమున వసించునుగాక.

---

## సరస్వతీ ప్రార్థనా

లడ్డుకాన్ ఘృతసంయుక్తాన్ చతుర్దశ మనోహరాన్,
సదక్షిణం సతామ్బూల ముత్తమాయ ద్విజాతయే.
సరస్వతి నమస్తుభ్యం వరదే భక్తవత్సలే,
ఉపాయనం ప్రదాస్యామి విద్యావృద్ధిం కురుష్వ మే.
భారతీ ప్రతిగృహ్ణాతు భారతీవై దదాతి చ,
భారతీ తారకోభాభ్యాం భారత్యై తే నమో నమః,

ఓ సరస్వతీదేవీ! నీప్రీతికై దక్షిణతాంబూలములను పదునాలుగులడ్డులను బ్రాహ్మణునకువాయన మొసఁగుచున్నాను. ఓవరములనొసఁగురాణీ! నాకు విద్యాభివృద్ధి నొసఁగుము.

యస్య స్మృత్యా చ...సరస్వతి, యత్పూజితం...తే అనయా కల్పోక్తప్రకారేణ కృతయా షోడశోపచారపూజయా భగవతీ సర్వదేవాత్మికా మహాసరస్వతీ సుప్రీతా సుప్రసన్నా వరదా **భవతు.**

పూ జా వి ధి స ం పూ ర్ణ ము.

---

## కథా ప్రారంభము

శ్రీసూతః. శృణుధ్వం మునయః సర్వే వ్రతానాముత్తమం వ్రతం, దుర్గాలక్ష్మీమహాదేవీ పూజనం నామ నామతః 1. ఆశ్వయుజ్మాసి సంప్రాప్తే ప్రతిపచ్ఛుభవాసరం, తదారభ్య ప్రయత్నేన నవరాత్రిషు పూజయేత్ .2.అథవా మూలనక్షత్రం సమారభ్య ప్రపూజయేత్. తత్రాప్యశక్తో విప్రేన్ద్రో నవమ్యాం తు ప్రపూజయేత్. 3. ఏతద్వ్రతం నరః కృత్వా సర్వసిద్ధిమవాప్నుయాత్, నిత్యైశ్వర్యసమాయుక్తో దుర్గాలోకమవాప్నుయాత్. 4. ఋషయః. పురా కేన కృతం హ్యత్ర కేన ప్రాప్తం మహత్సుఖం, ఏతద్బ్రూహి మహాభాగ కృపాస్మాసు తవాస్తి చేత్. 5. శ్రీసూతః. శ్రోతవ్యం చ ప్రయత్నేన కృతం వ్రతమనుత్తమం, పురా కృతయుగే చాసీత్సుకేతురితి విశ్రుతః.6.రాజా పరమధర్మాత్మా ప్రజాపాలనతత్పరః, నిత్యైశ్వర్యసమాయుక్తో హస్త్యశ్వరథసఙ్కులః, 7. తస్య భార్యా విశాలాక్షీ పురాసా ప్రాప్తయౌవనా, సాభూన్నామ్నా సువేదీతి సర్వమఙ్గళ సంయుతా. 8.తస్య రాష్ట్రే న దుర్భిక్షం న భయం చాపి విద్యతే, ఏవం ప్రవర్తమానే తు జ్ఞాతీనాం క్రోధ ఆగమత్. 9. సోఽపి

రాజా మహాభాగశ్చతురఙ్గబలాన్వితః, జ్ఞాతయో యత్ర వర్తన్తే తత్ర యాత్రాం చకార హ. 10. ప్రయయౌ జ్ఞాతయోయత్ర సుకేతుస్తత్ర తైః సహ, స యుద్ధం కృతవాన్ రాజా తైశ్చ సర్వం వినాశితమ్. 11. పలాయమానస్య తతో సువేదీ సహసాభ్యయాత్, భర్త్రా సాకం సమాగత్య వనాన్తరముపాగమత్. 12. వనాన్తరం ప్రవిశ్యాథ గహ్వరం వనమావిశత్, నిరన్నౌ క్షుధితౌ శ్రాన్తౌ క్షుత్క్షామేన చ సంయుతౌ. 13. శరనిర్భిన్నగాత్రస్తు స రాజా రోగితాం గతః, న చ చారయితుం శక్తః పతియుక్తా వనాన్తరే. 14. సాపి దుఃఖేన మహతా విలలాప సుదుఃఖితా, సాపి స్కన్ధే వాహయిత్వా విచచార వనాద్వనమ్. 15. తస్యాః శోకం నాశయితుం మునిరాఙ్గీరసోఽభ్యగాత్, దృష్ట్వాతు శోకసన్తప్తాంపతివాహభరాన్వితామ్. 16.దయాళురాహతాం వీక్ష్య మారోదీర్భద్రమస్తు తే. ఆంగీరసః.కౌ యువాం దంపతీ యాతౌ బహుదుఃఖసమన్వితౌ. 17. రాజ్యబంధుజనైర్హీనౌ క్షుత్క్షామేన చ పీడితౌ,ఏకాకినౌ సమాయాతౌకిం కార్యం వనగహ్వరే. 18. ఏతద్బ్రూహి మహాభాగే మా శోకం కర్తుమర్హసి, రక్షిష్యామి న సందేహో ఘోరదుఃఖార్ణవాదహమ్.19. సువేదీ:— భగవన్ దేవదేవేశ మునినాథ మహామతే, రాజ్యబన్ధువిహీనోయం స్వజనైశ్చ నిరాకృతః. 20. కేనోపాయేన వై బ్రహ్మన్ స్వరాజ్యం కేన హేతునా, పుత్రసమ్పత్తిమేవాథ ప్రాప్నుయాత్కేనవై సుఖమ్. 21. తద్బ్రూహి మే మహాభాగకృపాళో దీనవత్సల. ఆంగీరసః. శీఘ్రమేహి మయాసాకం పఞ్చవట్యాశ్శుభేతటే. 22. దుర్గాస్థానం మహాక్షేత్రమత్ర సన్నిహితా సదా,

తస్యాం సమ్పూజ్యతే దేవీ పుత్రపౌత్రాదిసమ్పదః.23. రాజ్యం చ మహాదైశ్వర్యం పునః ప్రాప్తో భవిష్యతి, సాపి తద్వచనం శ్రుత్వా సఞ్చారగమనే మతిమ్. 24. స్వపతిం వాహయిత్వాథ తేన సాకం యయౌ ముదా, తతః సుదూరమధ్వానం గత్వా పఞ్చవటీం తటీమ్. 25. తతః స్నానం కృతవతీ సువేదీ పతినా సహ, తద్బ్రాహ్మణేన సంయుక్తా దుర్గాం దేవీం సరస్వతీం, ఆఙ్గీరసో మహాతేజాః కారయామాస పూజనమ్. 26. ప్రతిపత్తు సమారభ్య నవమ్యన్తం చ భక్తితః, కుఙ్కుమాగరుకస్తూరీ కర్పూరైశ్చ సమన్వితమ్.27. నానావిధైః సుపుష్పైశ్చ రక్తవస్త్రాదిభిః క్రమాత్, పూజయిత్వామహాదేవీం షోడశైరుపచారకైః, 28. దశమేఽహని సంప్రాప్తే ప్రాతః స్నాత్వా మహామతిః. హవనం కారయామాస పాయసాన్నేన మన్త్రితమ్. 29. దుర్గాం దేవీతి మన్త్రేణ చకార హవనం ముదా, ఆంగీరసం మహాభాగం దంపతీపూజనం ముదా. 30. దశదానాన్యథో కృత్వా బ్రాహ్మణానాం విశేషతః,వ్రతం సమాప్య విధివదాశ్రమంపునరాగమత్. 31. తస్య వ్రతస్య మాహాత్మ్యాద న్తర్వత్నీ బభూవ హ, దశమే మాసి సంప్రాప్తే సుషువే లోకసున్దరమ్. 32. పుత్రసంజననం దృష్ట్వా ఋషిరాఙ్గిరసో మునిః, జాతకర్మాదిసంస్కారం చకార భగవానృషిః. 33. సూర్యప్రతాపనామేతి నామ తస్య చకార హ, శుక్లపక్షే యథా చన్ద్రో వర్ధతే చ దినేదినే. 34. తథైవ వవృధే బాలో మాత్రా పిత్రా చ పోషితః, సబాలో యావసం ప్రాప్తస్సర్వశాస్త్రవిశారదః. 35. ఋషిదత్త ప్రభావేన మహాబలపరాక్రమః, బాలశ్చప్రాప్తిసమ్పన్నో హ్యాను

జ్ఞాప్య మహాబుభీక్ష.36.స గత్వా శత్రుదేశం తు సుయుద్ధం కృతవాం స్తదా, తేన విధ్వంసితం సైన్యం పలాయనపరం హ్యభూత్. 37. స్వరాజ్యం ప్రాప్తవాన్ బాలో మాత్రా పిత్రా సమన్వితః, వర్షే వర్షే చ సా దేవీ చకారైతద్వ్రతం శుభమ్. 38. తేన పుణ్య ప్రభావేన పుత్రపౌత్రాదిసంయుతా, ఇహ సౌఖ్యం సమాసాద్య పరత్ర చ శుభాం గతిమ్. 39. తస్మాదేతద్వ్రతం కార్యం సర్వవర్ణాశ్రమాదిభిః, యే చ శృణ్వన్తి సతతం శ్రావయన్తి చ యే నరాః. 40. తే సర్వే పాపనిర్ముక్తా యాస్యన్తి పరమాం గతిమ్. ఇతి శ్రీస్కాన్దపురాణే సరస్వతీవ్రతకల్పః సంపూర్ణః.

## శమీ ప్రార్థనా

దశమ్యాం సాయాహ్నే శమీపూజాం కృత్వా తదనన్తరం ధ్యాయేత్.

ధ్యానశ్లోకాః. శమి శమయ మే పాపం శమి శత్రువినాశిని, అర్జునస్య ధనుర్ధారి రామస్య ప్రియదర్శిని. 1. శమీంకమలపత్రాక్షీం శమీం కణ్టకధారిణీం, ఆరోహతు శమీం లక్ష్మీర్నృణామాయుష్యవర్ధనీ. 2. నమో విశ్వాసవృక్షాయ పార్థశస్త్రాస్త్రధారిణే, త్వత్తః పత్రం ప్రతీక్ష్యామి సదా మే విజయీ భవ. 3. ధర్మాత్మా సత్యసన్ధశ్చ రామో దాశరథిర్యది, పౌరుషే చాప్రతిద్వన్ద్వః శరైనం జహి రావణిమ్. 4. అమఙ్గళానాం శమనీం దుష్కృతస్య చ నాశినీం, దుఃస్వప్ననాశినీం ధన్యాం ప్రపద్యేఽహం శమీం శుభామ్. 5.

# సరస్వతీ వ్రతకథ

ఒకానొకప్పుడు సూతమహాముని శౌనకాదిమునీంద్రులను జూచి యిట్లనియె:—"ఓ మునులారా! మీ రందఱు వినుఁడు. దుర్గా లక్ష్మీ సరస్వతీపూజ యను వ్రతములలో నుత్తమవ్రతం బొక్కటి కలదు. ఆ వ్రతముయొక్క విధానంబు నెఱిఁగించెదను. వినుఁడు. ఆశ్వయుజశుద్ధపాడ్యమి మొదలీ వ్రతంబును తొమ్మిది దినములు చేయవలయును. లేదేని మూలానక్షత్రమునాఁటినుండి యైనను జేయవలెను. దానికి శక్తిలేనివాఁడు మహానవమినాఁ డైనను జేయవలెను. ఈ వ్రతంబు నాచరించుమానవుఁడు శాశ్వత సంపదతోఁ గూడినవాఁడై యుండి, యీ దేహంబు విడిచినపిమ్మట దుర్గాదేవియొక్క లోకంబును జెందుచున్నాఁడు." అని సూతుఁడు ఋషులతోఁ జెప్పఁగా, వా రమ్మునిపుంగవునిఁ జూచి, "ఓమహాత్మా తొల్లి యీ వ్రతంబు నెవ్వ రాచరించిరి? ఎవరికి దీని వలన గొప్పసుఖంబు గలిగెను? ఆనతిం"డని యడుగఁగా సూత మహాముని వారితో నిట్లనియె. "ఓఋషులారా! మీరు సావధాన ముగా వినుఁడు. ఆ వ్రతమహిమను మీకుఁ దెలియఁజెప్పెదను. తొల్లి కృతయుగంబున సుకేతువను రాజొకఁ డుండెను. అతఁడు పుణ్యాత్ముఁడు. జనులను న్యాయముతోఁ బాలించువాఁడు. ఎడ తెగనికలిమితోఁ గూడినవాఁడు. చతురంగబలసమృద్ధిగలవాఁడు. అతనికి విఱివిగలకన్నులుగలదియు, వయసుగలదియు, సకలశుభ కార్యములఁ జేయునదియు నైనసువేది యనుభార్యగలదు. ఆపతి వ్రత యాతనికిఁ దగినదై యుండును. ఆతనిరాజ్యమున క్షామము, చోరభయము లేకయుండెను. అట్లు అతఁడు రాజ్యమేలుచుం డఁగా నాతనిసామంతరాజులకు ఆతనిమీఁద ఓర్వలేమిపుట్టెను. ఆసంగతి సుకేతువెఱిఁగి, వారిపైకి యుద్ధమునకుఁ బోయెను. ఆ

శత్రువులాతనిదండునంతయుఁజంపి, యతనినిఁగొట్టఁగా నతఁడోడి పరుగెత్తనారంభించెను. అట్లుపరుగెత్తుచుండు ఆసుకేతువు నతని భార్యసువేది వెంబడించెను. అట్లు వారిద్దఱొకవనమునుండి మఱి యొకవనంబునకుఁ బోవుచు నొక్కయేకాంతమయిన యరణ్యము నడుమఁజేరిరి. వారాహారములేక యాఁకలిదప్పులకు మిక్కిలి డస్సిరి. రాజన్నతో శత్రువులబాణముల దెబ్బలుతినియున్న వాఁ డగుటచే రోగములలోఁజిక్కినడువలేకపోయెను. అంతనాసువేది తనయాఁకలిదప్పులకేకాక, తనభర్తయొక్కయవస్థకును మిక్కిలి విచారపడినదై, తనమగనిని తన భుజములమీఁద నెక్కించుకొని, ఒకవనమునుండి మఱియొకవనంబునకుఁ బోవుచుండెను. ఆప్రకారము సువేది పోవునప్పుడాంగీరసమహాముని యెదురపడెను. ఆసువేది యమ్మునినిఁ జూచి వెక్కివెక్కి యేడ్చెను. ఆయాంగీరసమహాముని యాసువేదిని జూచి 'అమ్మాయీ! దుఃఖపడకుము. నీకు మేలయ్యెఁడు. మీరలెవ్వరు? ఏల బహుదుఃఖములలోఁబడి యున్నారు? మీరాజ్యమేది? మీబంధువులు ఎచ్చట నున్నారు? ఏల యాఁకలితోఁగష్టపడుచున్నా' రని యడుగఁగా, సువేది, తనమగండు శత్రువులతో యుద్ధముచేసి యందోడి యడవులకు వచ్చి రోగములలోఁబడి నడువలేకపోఁగాఁ దానిట్లు మగనిని మోసుకొని పోవుచున్నట్లు చెప్పి తనకష్టము దొలఁగి సుఖపడఁ దగినయుపాయముఁ దెలుపఁగోరెను. ఆంగీరసుఁడును, 'ఓసువేదీ? పంచవటీనదీతీరమునకు నాతోఁగూడ రమ్ము. అచ్చట దుర్గాదేవళ మున్నది. ఆదుర్గాదేవిని బూజించినట్లైన, మీకు పుత్రపౌత్రాది సంపదలును, రాజ్యమును, మహదైశ్వర్యమునుగలుగు'నని చెప్పఁగా, సువేదియు నచ్చటికిఁ బోఁదలఁచి, భర్తనుమోసికొని బహుదూరముపోయి, యాపంచవటీనది యొద్దఁజేరి భర్తతోఁగూడ

స్నానముచేసి, యాబ్రాహ్మణోత్తమునియానతిప్రకారము దుర్గా దేవిని ఆశ్వయుజశుద్ధపాడ్యమిమొదలు మహానవమివఱకుఁ గుంకుమాదులతోఁబూజించి, పదియవదినమున 'దుర్గాం దేవీగ్ శరణమహం ప్రపద్యేఽలక్ష్మీర్మే నశ్యతాంత్వాం వృణే"అనుమంత్రముచే క్షీరాన్నముతో హోమముచేయించెను. తర్వాత సువేది యాంగీరసమహామునికి దంపతిపూజచేసి, బ్రాహ్మణులకెక్కువగా దశదానములిచ్చి వ్రతము పూర్తిగావించుకొని, తనయాశ్రమమునకు వచ్చెను. వచ్చినకొన్నిదినములకే ఆసువేది గర్భముదాల్చి, తొమ్మిదినెలలునిండినతోడనే పురుషశిశువును గనెను. ఆంగీరస మహామునియే యాశిశువునకు జాతకర్మనామకరణంబులు జరిపించెను. ఆమునియే యాశిశువునకు సూర్యప్రతాపుఁడని పేరు పెట్టెను. ఆబాలుఁడు శుక్లపక్షచంద్రునిమాడ్కి దినదినప్రవర్ధమానుఁడై సకలశాస్త్రములను జదివి, యౌవనము పొంది ఋషియొసఁగిన ప్రభావముతోఁగూడి మహర్షులందఱి దీవనలను బడసి శత్రుపురంబునకుఁ బోయి పగతురనందఱం బరిమార్చి, తన రాజ్యము లాగికొని, తల్లిదండ్రులతోఁగూడఁ దనపురంబునఁకేగి రాజ్యముచేయుచు సుఖంబుగా నుండెను.ఆసువేదియుఁ బ్రతియేఁటను ఈవ్రతమునాచరించి పుత్రపౌత్రధనసమృద్ధిగలదైయిహంబున సర్వసుఖములను బొంది, పరలోకమున శాశ్వతమోక్షసుఖమును బొందినదాయెను ; కావున మునీంద్రులారా ! సకలవర్ణాశ్రమములవారును ఈవ్రతంబు చేయవలెను. ఈవ్రతకథను విన్నవారును, చదివినవారును, చదివి వినిపించినవారును పాపములనుండి తొలఁగి యుత్తమలోకంబు నొందుదురు.

శ్రీస్కాందపురాణాంతర్గతంబగుసరస్వతీవ్రతము సంపూర్ణము.

# వరలక్ష్మీ వ్రతము

*ఆచమ్య. 'శుక్లాంబరధరం విష్ణు'మిత్యాది...భూర్భువస్సువరోమ్. మమ ఉపాత్తసమస్తదురితక్షయద్వారా శ్రీపరమేశ్వరప్రీత్యర్థం శుభే...తిథౌ అస్మాకం సహకుటుమ్బానాం క్షేమస్థైర్యవిజయాయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం ధర్మార్థకామమోక్షచతుర్విధఫలపురుషార్థసిద్ధ్యర్థం సత్సన్తానసౌభాగ్యఫలావాప్త్యర్థం వర్షేవర్షే ప్రయుక్తాం వరలక్ష్మీముద్దిశ్య వరలక్ష్మీప్రీత్యర్థం భవిష్యోత్తరపురాణకల్పోక్తప్రకారేణ యావచ్ఛక్తి ధ్యానావాహనాదిషోడశోపచారపూజాం కరిష్యే, తదంగత్వేన కలశపూజాం కరిష్యే. (కలశపూజచేసి) ఆదౌ గణాధిపతిపూజాం కరిష్యే. (మొదట గణాధిపతిపూజచేసి) వరలక్ష్మీప్రాణప్రతిష్ఠాపనం కరిష్యే. (వరలక్ష్మీప్రాణప్రతిష్ఠాపనచేసి) పూజామారభేత. (పూజ యారంభింపవలయును.)

## వరలక్ష్మీ పూజా ప్రారంభము

శ్లో. పద్మాసనే పద్మకరే సర్వలోకైకపూజితే,
నారాయణప్రియే దేవి సుప్రీతా భవ సర్వదా.
క్షీరోదార్ణవసమ్భూతే కమలే కమలాలయే,
సుస్థిరా భవ మే గేహే సురాసురనమస్కృతే.
వరలక్ష్మీ దేవతాం ధ్యాయామి

---

* కలశపూజ, గణాధిపతిపూజ, ప్రాణప్రతిష్ఠాపనవిధులను గూర్చి వినాయకవ్రతారంభమునందుఁ జూచి తెలుసుకొనుడు.

తా. కమలాసనమందుఁగూర్చుండినదానవు, పద్మము చేతఁ బట్టినదానవు, సకలజనులచే ముఖ్యముగాఁ గొనియాడఁబడు దానవునైన ఓ విష్ణు దేవునిరాణీ! నీవు నాయెడ నెల్లప్పుడును ప్రీతిగలిగి యుండుము. పాల్కడలియందుఁబుట్టినదానవు, దేవాసురులచే నమస్కరింపఁబడినదానవు, తామరపువ్వులందు వసించుదానవు నైన ఓలక్ష్మీదేవీ! నీవు మాయింట శాశ్వతముగా నుండుము. అని ధ్యానముచేయవలెను.

సర్వమంగళమాఙ్గల్యే విష్ణువక్షఃస్థలాలయే,
ఆవాహయామి దేవి త్వాం సుప్రీతా భవ సర్వదా.

వరలక్ష్మీదేవతామావాహయామి.

తా. అన్ని శుభకార్యములకు శుభంబు నొసఁగుదానా! విష్ణువుఱొమ్ముననుండుదానా! ని న్నావాహనచేయుచున్నాను. ఓ దేవీ! నాయెడం గడుఁబ్రేమగలిగియుండుము.

సూర్యాయుతనిభస్ఫూర్తే స్ఫురద్రత్నవిభూషితం,
సింహాసనమిదం దేవి స్థీయతాం సురపూజితే.

వరలక్ష్మీదేవతాయై రత్నసింహాసనం సమర్పయామి.

తా. పదివేలసూర్యులవలెఁ బ్రకాశించుదానా! ధగధగ మెఱయురత్నములచే నలంకరింపఁబడిన సింహాసనమిదిగో వేయుచున్నాను. దేవతలచే పూజింపఁబడిన యోయమ్మా! కూర్చుండుము.

శుద్ధోదకం చ పాత్రస్థం గన్ధపుష్పాదిమిశ్రితం,
అర్ఘ్యం దాస్యామి తే దేవి గృహాణ సురపూజితే.

వరలక్ష్మీదేవతాయై అర్ఘ్యం సమర్పయామి.

తా. ఓదేవపూజితురాలా! గంధము పుష్పములు మొదలగుసువాసనద్రవ్యములతోఁగూడిన శుద్ధోదకముతో నర్ఘ్యము నొసఁగుచున్నాను. అనుగ్రహింపుము.

సువాసితజలం రమ్యం సర్వతీర్థసముద్భవం,
పాద్యం గృహాణ దేవి త్వం సర్వదేవనమస్కృతే.
వరలక్ష్మీదేవతాయై పాద్యం సమర్పయామి.

తా. దేవతలందఱిచేఁ గొనియాడఁబడుదానా! అన్నితీర్థములనుండి తెచ్చిన సుగంధజలముతోఁ బాద్యము నొసఁగెదను. స్వీకరింపుము.

సువర్ణకలశానీతం చన్దనాగరుసంయుతం,
గృహాణాచమనం దేవి మయా దత్తం శుభప్రదే.
వరలక్ష్మీదేవతాయై ఆచమనీయం సమర్పయామి.

తా. శుభముల నొసఁగుదానా! బంగారుగిండ్లతోఁ దెచ్చిన చందనము, అగరు చేర్చినయుదకముతో ఆచమనీయ మొసఁగుచున్నాను.

*పయోదధిఘృతోపేతం శర్కరామధుసంయుతం,
పఞ్చామృతస్నానమిదం గృహాణ కమలాలయే.
వరలక్ష్మీదేవతాయై పఞ్చామృతస్నానం సమర్పయామి.
గఙ్గాజలం మయాఽనీతం మహాదేవశిరఃస్థితం,
శుద్ధోదకస్నానమిదం గృహాణ విధుసోదరి.
వరలక్ష్మీదేవతాయై స్నానం సమర్పయామి.
స్నానానన్తరం ఆచమనీయం సమర్పయామి.

---

* పంచామృతమంత్రములను స్నాన, వస్త్ర, యజ్ఞోపవీతధూపాది మంత్రములను వినాయకవ్రతముఁ జూచి తెలిసికొనవలయును.

తా. ఓచంద్రునితోఁ బుట్టినదానా! ఈశ్వరునిశిరస్సునుండి వచ్చిన గంగాజలమును దెచ్చితిని. ఈతీర్థముతో స్నానమాచరింపుము.

సురార్చితాంఘ్రియుగళే దుకూలవసనప్రియే,
వస్త్రయుగ్మం ప్రదాస్యామి గృహాణ హరివల్లభే.
వరలక్ష్మీదేవతాయై వస్త్రయుగ్మం సమర్పయామి.

తా. దేవతలచేఁ బూజింపఁబడిన పాపములతోఁగూడిన దానవు, తెలిపట్టుచీరగట్టినదానవునైన వెన్నునిరాణీ! నీకు వలువలజతఁ గట్టబెట్టెదను అనుగ్రహింపుము.

కేయూరకఙ్కణే దివ్యే హారనూపురమేఖలాః,
విభూషణాన్యమూల్యాని గృహాణ ఋషిపూజితే.
వరలక్ష్మ్యై ఆభరణాని సమర్పయామి.

తా. ఋషులమన్ననలఁబడసిన యోదేవీ! కడియములు, వంకీలు, హారములు, అందెలు, మొలనూలు మొదలగు సకల భూషణములను దాల్పుము.

తప్తహేమకృతం దేవి గృహాణ త్వం శుభప్రదే,
ఉపవీతమిదం దేవి గృహాణ త్వం శుభప్రదే.
వరలక్ష్మీదేవతాయై యజ్ఞోపవీతం సమర్పయామి.

తా. శుభములొసఁగుదానా! అపరంజితోఁజేసి,ముత్యాలసరములతో నలంకరించిన యజ్ఞోపవీతమును ధరింపుము.

కర్పూరాగరుకస్తూరీరోచనాదిభిరన్వితం,
గన్ధం దాస్యామ్యహం దేవి ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్.
వరలక్ష్మీదేవతాం గంధాన్ ధారయామి.

తా. ఓ దేవీ! పచ్చకర్పూరము, అగరు, కస్తూరి, కుంకుమ పువ్వు మొదలగు సువాసనద్రవ్యములతోఁ జేర్చినచందనము నొసఁగుచున్నాను. కృపసేయుము.

అక్షతాన్ ధవళాన్ దేవి శాలీయాం స్తండులాన్ శుభాన్,
హరిద్రాకుంకుమోపేతాన్ గృహ్యతామబ్ధిపుత్రికే.
వరలక్ష్మీదేవతాయై అక్షతాన్ సమర్పయామి

తా. ఓసముద్రునికూఁతురా! తెల్లనియక్షతలను పసుపు కుంకుమ కలిపి యొసఁగుచున్నాను. వీనిని గ్రహింపుము.

మల్లికాజాతికుసుమైశ్చంపకై ర్వకుళై రపి,
శతపత్రైశ్చ కల్హారైః పూజయామి హరిప్రియే.
వరలక్ష్మీదేవతాం పుష్పైః పూజయామి.

తా. మొల్లలు, జాజులు, సంపెంగలు, పొగడలు, తామరలు, కల్వలు మొదలగుపూవులతో, ఓవిష్ణుని ప్రియురాలా! నిన్ను బూజించుచున్నాను.

## అథాంగపూజా

"పూజయామి" అని ప్రతిపదమునకుఁ గడపట చేర్పుఁడు.

| | |
|---|---|
| చఞ్చలాయై నమః పాదౌ | సుముఖాయై నమః ముఖం |
| చపలాయైనమః జానునీ | శ్రియై నమః ఓష్ఠౌ |
| పీతామ్బరధరాయై నమః ఊరూ | సునాసికాయై నమః నాసికాం |
| కమలవాసిన్యై నమః కటిం | సునేత్ర్యై నమః నేత్రే |
| పద్మాలయాయై నమః నాభిం | రమాయై నమః కర్ణౌ |
| మద మాత్రే నమః స్తనౌ | కమలాయై నమః శిరః |
| లలితాయై నమః భుజద్వయం | వరలక్ష్మ్యై నమః సర్వాణ్యఙ్గాని |
| కమ్బుకంఠ్యై నమః కణ్ఠం | పూజయామి. |

## అష్టోత్తరశత (108) నామపూజ

"నమః" అని ప్రతినామముచివరను జేర్చవలయును.

ఓమ్ ప్రకృత్యై
వికృత్యై
విద్యాయై
సర్వభూతహితప్రదాయై
శ్రద్ధాయై
విభూత్యై
సురభ్యై
పరమాత్మికాయై
వాచే
పద్మాలయాయై 10
పద్మాయై
శుచయే
స్వాహాయై
స్వధాయై
సుధాయై
ధన్యాయై
హిరణ్మయ్యై
లక్ష్మ్యై
నిత్యపుష్టాయై
విభావర్యై
అదిత్యై

దిత్యై
దీప్తాయై
వసుధాయై
వసుధారిణ్యై
కమలాయై
కాన్తాయై
కామాక్ష్యై
క్రోధసంభవాయై
అనుగ్రహప్రదాయై
బుద్ధయే 31
అనఘాయై
హరివల్లభాయై
అశోకాయై
అమృతాయై
దీప్తాయై
లోకశోకవినాశిన్యై
ధర్మనిలయాయై
కరుణాయై
లోకమాత్రే 40
పద్మప్రియాయై
పద్మహస్తాయై
పద్మాక్ష్యై

పద్మసున్దర్యై
పద్మోద్భవాయై
పద్మముఖ్యై
పద్మనాభప్రియాయై
రమాయై
పద్మమాలాధరాయై
దేవ్యై 50
పద్మిన్యై
పద్మగన్ధిన్యై
పుణ్యగన్ధాయై
సుప్రసన్నాయై
ప్రసాదాభిముఖ్యై నమః
ప్రభాయై
చన్ద్రవదనాయై
చన్ద్రాయై
చన్ద్రసహోదర్యై
చతుర్భుజాయై 60
చన్ద్రరూపాయై
ఇన్దిరాయై
ఇన్దుశీతలాయై
ఆహ్లాదజనన్యై
పుష్ట్యై

శివాయై
శివకర్యై
సత్యై
విమలాయై
విశ్వజనన్యై 70
తుష్ట్యై
దారిద్ర్యనాశిన్యై
ప్రీతిపుష్కరిణ్యై
శాన్తాయై
శుక్లమాల్యామ్బర
ధరాయై
శ్రియై
భాస్కర్యై
బిల్వనిలయాయై
వరారోహాయై
యశస్విన్యై 80
వసుంధరాయై

ఉదారాంగాయై
హరిణ్యై
హేమమాలిన్యై
ధనధాన్యకర్యై
సిద్ధయే
స్త్రైణసౌమ్యాయై
శుభప్రదాయై [యై
నృపవేశ్మగతానన్దా
వరలక్ష్మ్యై
వసుప్రదాయై
శుభాయై [యై
హిరణ్యప్రాకారా
సముద్రతనయాయై
జయాయై
మఙ్గళాయై
దేవ్యై [యై
విష్ణువక్షఃస్థలస్థితా

విష్ణుపత్న్యై
ప్రసన్నాక్ష్యై [101
నారాయణసమాశ్రి
తాయై
దారిద్ర్యధ్వంసిన్యై
దేవ్యై
సర్వోపద్రవవారిణ్యై
నవదుర్గాయై
మహాకాళ్యై [యై
బ్రహ్మవిష్ణుశివాత్మికా
త్రికాలజ్ఞానసమ్ప
న్నాయై
భువనేశ్వర్యై 108
ఓంవరలక్ష్మీదేవతా
యై నమః

అష్టోత్తరశతనామపూజాం సమర్పయామి.

దశాఙ్గం గుగ్గులూపేతం సుగన్ధం చ మనోహరం,
ధూపం దాస్యామి దేవేశి వరలక్ష్మీర్గృహాణ తమ్.
శ్రీవరలక్ష్మీదేవతాయై ధూపమాఘ్రాపయామి.

ఘృతాక్తవర్తిసంయుక్తమన్ధకారవినాశకం,
దీపం దాస్యామి తే దేవి గృహాణ ముదితా భవ.
శ్రీవరలక్ష్మీదేవతాయై నమః దీపం దర్శయామి.

తా. ఓదేవీ! నేతితోఁ దడిపినవత్తులు వేసినదీపమును వెలిఁగించుచున్నాను. స్వీకరించి సంతోషపడుము.

నైవేద్యం షడ్రసోపేతం దధిమధ్వాజ్యసంయుతం,
నానాభక్ష్యఫలోపేతం గృహాణ హరివల్లభే.

ధూపదీపానన్తరం ఆచమనీయం సమర్పయామి.

తా. షడ్రసములుగలదియు, అనేకభక్ష్యములతోను, పండ్లతోనుగూడిన నైవేద్యమును బెట్టుచున్నాను. ఓవిష్ణుపత్నీ! ఆరగింపుము.

శ్రీవరలక్ష్మీదేవతాయై నైవేద్యం సమర్పయామి.

ఘనసారసుగన్ధేన మిశ్రితం పుష్పవాసితం,
పానీయం గృహ్యతాం దేవి శీతలం సుమనోహరమ్.

తా. పచ్చకర్పూరపు తావితోను, వట్టివేళ్లవాసనతోను, పువ్వులవాసనతోను కూడినచల్లనియుదకంబు పుచ్చుకొనుము.

శ్రీవరలక్ష్మీదేవతాయై పానీయం సమర్పయామి.

పూగీఫలసమాయుక్తం నాగవల్లీదళైర్యుతం,
కర్పూరచూర్ణసంయుక్తం తామ్బూలం ప్రతిగృహ్యతామ్.

శ్రీవరలక్ష్మీదేవతాయై తామ్బూలం సమర్పయామి.

నీరాజనం సమానీతం కర్పూరేణ సమన్వితం,
తుభ్యం దాస్యామ్యహం దేవి గృహ్యతాం విష్ణువల్లభే.

తా. ఓదేవీ! విష్ణుపత్నీ! కర్పూరనీరాజన మొసఁగుచున్నాను. గ్రహింపుము. శ్రీవరలక్ష్మీదేవతాయై నమః నీరాజనం దర్శయామి. నీరాజనానన్తరం ఆచమనీయం సమర్పయామి.

పద్మాసనే పద్మకరే సర్వలోకైకపూజితే,

నారాయణప్రియే దేవి సుప్రీతా భవ సర్వదా.
శ్రీవరలక్ష్మీదేవతాయై నమః మన్త్రపుష్పం సమర్పయామి.
యాని కాని చ పాపాని జన్మాన్తరకృతాని చ,
తానితాని ప్రణశ్యన్తి ప్రదక్షిణపదేపదే.
శ్రీవరలక్ష్మీదేవతాయై నమః ప్రదక్షిణం సమర్పయామి.
నమస్తే త్రిలోక్యజనని నమస్తే విష్ణువల్లభే,
త్రాహి మాం భక్తవరదే వరలక్ష్మీర్నమో నమః.

తా. ఓ ముల్లోకములతల్లీ! విష్ణునిరాణీ! భక్తులకోరికల నొసఁగు ఓవరలక్ష్మీ! నీకు మ్రొక్కెదను నన్నుఁ గాపాడుము.

శ్రీవరలక్ష్మీదేవతాయై నమస్కారాన్ సమర్పయామి.

*అథ (నవసూత్ర) తోరగ్రంథి పూజా.

కమలాయై నమః ప్రథమగ్రన్థిం పూజయామి. రమాయై నమః ద్వితీయగ్రన్థిం పూజయామి. లోకమాత్రే నమః తృతీయగ్రన్థిం పూజయామి. విశ్వజనన్యైనమః చతుర్థగ్రన్థిం పూజయామి. మహాలక్ష్మ్యైనమః పఞ్చమగ్రన్థిం పూజయామి. క్షీరాబ్ధితనయాయై నమః షష్ఠగ్రన్థింపూజయామి. విశ్వసాక్షిణ్యై నమః సప్తమగ్రన్థిం పూజయామి. చన్ద్రసోదర్యై నమః అష్టమగ్రన్థిం పూజయామి. హరివల్లభాయై నమః నవమగ్రన్థిం పూజయామి. తోరముకట్టుకొనునప్పుడు చెప్పుమంత్రము—బధ్నామి దక్షిణే హస్తే నవసూత్రం శుభప్రదం, పుత్రపౌత్రాభివృద్ధిం చ సౌభాగ్యం దేహి మే రమే.

---

* తోరపుముళ్లను బూజించుట. ఆతోరమునకు తొమ్మిదిముడు లుండవలెను. ఒక్కొక్కముడియు తెలియునట్లు విడిగా నుంచి ఒక్కొక్కముడిని పూజింపవలెనుగాని, కుప్పగా పెట్టఁగూడదు. గ్రంథి=ముడి.

వాయనమిచ్చువిధి—

ఏవం సంపూజ్య కల్యాణీం వరలక్ష్మీం స్వశక్తితః,
దాతవ్యం ద్వాదశాపూపం వాయనం హి ద్విజాతయే.

తా. ఈప్రకారము మోక్షమునొసఁగు వరలక్ష్మీదేవిని తనశక్తికొలఁదిని బూజించి, బ్రాహ్మణునికి తాముజేసిన భక్ష్యములలో పండ్రెండు వాయనమియ్యవలసినది. వాయనమిచ్చునప్పుడు చెప్పు మంత్రము.—

ఇందిరా ప్రతిగృహ్ణాతు ఇందిరా వై దదాతి చ,
ఇందిరా తారకోభాభ్యాం ఇందిరాయై నమో నమః.

తా. లక్ష్మీదేవియే యిచ్చునది, లక్ష్మీదేవియే తీసికొనునది. ఇందిరయే యిద్దఱికి తారకము. ఇందిరకొఱకు నమస్కారము. 'యస్య స్మృత్యా చ నామోక్త్యా తపఃపూజాక్రియాదిషు, న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వన్దే తమచ్యుతమ్. మన్త్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వరి, యత్పూజితంమయా దేవి పరిపూర్ణం తదస్తు తే. అనయా కల్పోక్తప్రకారేణ కృతయా షోడశోపచారపూజయా భగవతీ సర్వదేవాత్మికా వరలక్ష్మీదేవతా సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు. మమ ఇష్టకామ్యార్థసిద్ధిరస్తు' అని అక్షతలు నీళ్లు విడువవలసినది.

ఇతి పూజావిధానం సమాప్తమ్.

---

## కథా ప్రారంభము

కైలాసశిఖరే రమ్యే నానాగణనిషేవితే, మన్దారవిటపిప్రాన్తే నానామణివిభూషితే. 1. పాటలాశోకపున్నాగఖర్జూరవకుళాన్వితే, కుబేరవరుణేన్ద్రాది దిక్పాలైశ్చ సమావృతే. 2. నార

దాగ స్త్వవాల్మీకిపరాశరసమావృతే, రత్నపీఠే సుఖాసీనం శంకరం లోకశఙ్కరమ్. 3. పప్రచ్ఛ గౌరీ సంతుష్టా లోకానుగ్రహకామ్యయా. గౌరీ—భగవన్ సర్వలోకేశ సర్వభూతహితే రత. 4. యద్రహస్యమిదం పుణ్యం తదాచక్ష్వ మమానఘ. ఈశ్వరః—వ్రతానాముత్తమంనామ సర్వసౌభాగ్యకారణమ్. 5. సర్వసమ్పత్ప్రదం శీఘ్రం పుత్రపౌత్రప్రవర్ధనం, వరలక్ష్మీవ్రతం నామ వ్రతమస్తి మనోహరమ్. 6. శుక్లే శ్రావణికే మాసే పూర్ణిమోపాంత్యభార్గవే, యదాతు నారీ వర్తేత వ్రతే తస్యాః ఫలం శృణు. 7. గౌరీ—విధినా కేన కర్తవ్యం తత్ర కా నామ దేవతా, కయా చారాధితా పూర్వం సాభూత్సంతుష్టమానసా. 8. ఈశ్వరః—వరలక్ష్మీవ్రతం పుణ్యం వక్ష్యామి శృణు పార్వతి, కుణ్డినం నామ నగరం సర్వమణ్డనమణ్డితమ్. 9. హేమప్రాకారసంయుక్తం చామీకరగృహోజ్జ్వలం, తత్రాభూద్బ్రాహ్మణీ కాచిన్నామ్నా చారుమతీ శ్రుతా. 10. పతిభక్తిరతా సాధ్వీ శ్వశ్రూశ్వశురయోర్మతా, కళావతీ సా విదుషీ సతతం మఞ్జుభాషిణీ. 11. తస్యాః ప్రసన్న చిత్తాయా లక్ష్మీః స్వప్నగతా తదా, ఏహి కల్యాణి భద్రం తే వరలక్ష్మీః సమాగతా. 12. నభోమాసే పూర్ణిమాయాం నాతిక్రాన్తే భృగోర్దినే, మత్పూజా తత్ర కర్తవ్యా వరం దాస్యామి కాంక్షితమ్. 13. ఇత్యుక్తాం వరలక్ష్మీం సా తుష్టావ పరయా ముదా, నమస్తే సర్వలోకానాం జనన్యై పుణ్యమూర్తయే. 14. శరణ్యే త్రిజగద్వన్ద్యే విష్ణువక్షఃస్థలాలయే, త్వయావలోకితః సద్యః స ధన్యః స గుణాన్వితః. 15. స శ్లాఘ్యః సకుటుమ్బీ చ స శూరః సచ పణ్డితః, జన్మాంతరసహస్రేషు కిం మయా సుకృతంకృతమ్. 16. అతస్త్వత్పాదయుగళం పశ్యామిహరివల్లభే,

ఏవం స్తుతా సా కమలా ప్రాదాత్తస్యై బహూన్వరాన్. 17.
తతశ్చారుమతీ సాధ్వీ స్వప్నాదుత్థాయ సంభ్రమాత్, తత్సర్వం
కథయామాసబంధూనాం పురతస్తదా. 18. శ్రుత్వాతు బాన్ధవాః
సర్వే సాధు సాధ్వీతి చాబ్రువన్, తత్రైవ కరవామేతి తదాగ
మనకాంక్షిణః. 19. భాగ్యోదయేన సంప్రాప్తే వరలక్ష్మీదినే తథా,
స్త్రియః ప్రసన్నహృదయా నిర్మలాశ్చిత్రవాససః. 20. నూతనై
స్తండులైః పూర్ణే కుమ్భే చ వటపల్లవైః. సాయం చారుమతీ
ముఖ్యాశ్చక్రుః పూజాం ప్రయత్నతః. 21. పద్మాసనే పద్మకరే సర్వ
లోకైకపూజితే, నారాయణప్రియే దేవి సుప్రీతా భవ సర్వదా.
22. ఇత్యాదిమన్త్రైఃసకలైరుపచారాన్యథాక్రమం, కృత్వాతు
దక్షిణే హస్తే నవసూత్రం దధుః స్త్రియః. 23. హావిష్యం
సఘృతం చైవ వరలక్ష్మ్యై న్యవేదయన్, గన్ధాదిభిరలంకృత్య సు
శీలం వృద్ధభూసురమ్. 24. తస్మై దత్వా వాయనం చ ద్వాదశా
పూపసంయుతం, తతో దేవీసమీపే తు హావిష్యం చక్రు
రజ్జనాః. 25. అథ లక్ష్మీప్రసాదేన ముక్తామాణిక్యభూషితాః,
నూపురాక్రాన్తచరణా మణికాఞ్చనభూషణాః. 26. పుత్రపౌత్రైః
పరివృతా ధనధాన్యసమృద్ధిభిః, అన్నదానరతా నిత్యం బన్ధు
పోషణతత్పరాః. 27. స్వం స్వం సద్మ సమాజగ్ముస్తాస్త్వశ్వరథ
సఙ్కులం, అన్యోన్యం కథయామాసుః శ్రుతం చారుమతీము
ఖాత్. 28. ఇదం సత్యమిదం సత్యం నరో భద్రాణిపశ్యతి, వయం
చారుమతీముఖ్యా ఉపలబ్ధమనోరథాః. 29. పుణ్యా చారుమతీ
ధన్యా భూయో భాగ్యవతీ చిరం, స్వయం యస్మాన్మహాలక్ష్మ్యా
బోధితం హి వ్రతోత్తమమ్. 30. ఇతి చారుమతీం సాధ్వీం
తుష్టువుస్తత్ర యోషితః, వరలక్ష్మీవ్రతం నామ తదాది భువి

విశ్రుతమ్. 31. ఏతత్తే సర్వమాఖ్యాతం వ్రతానాముత్తమం వ్రతం, య ఇదం శృణుయాద్వాపి శ్రావయేద్వా సమాహితః, సిధ్యన్తి సర్వకార్యాణి వరలక్ష్మీప్రసాదతః. 32.

## వరలక్ష్మీ వ్రతకథ

సకలమునిగణంబులతోఁ గూడి రమ్యమైయున్న కైలాస పర్వతశిఖరంబున నానావిధంబులగుమణులుచెక్కినదియు, పాట లములు, అశోకములు, సురపొన్నలు. ఖర్జూరములు, పొగడలు మొదలగు పెక్కువృక్షములతోఁ గూడినదియునై, కుబేరుఁడు, వరుణుఁడు, ఇంద్రుఁడు మొదలగుదిక్పాలురకును, నారదుఁడు, అగస్త్యుఁడు, వాల్మీకి, పరాశరుఁడు మొదలగుఋషులకు నాట పట్టయి యుండుకల్పవృక్షపుఁజేరువ, రత్నమయమైనసింహాసనము నందు నింపుగాఁ గూర్చుండియున్నట్టి జనులకు సుఖములఁగలి గించువాఁడయిన శంకరునిఁ జూచి, పార్వతీదేవి కడుముదమంది "సకలలోకంబులనేలుచు సకలభూతములందును దయగలిగియుం డునట్టి యోనాథుఁడా! రహస్యమయి పావనమయిన యొకశుభ వ్రతంబును నాకుఁ దెల్పుము" అని లోకముల నేలుకోరినదై యడిగెను. అంతట నీశ్వరుఁడు పార్వతి కిట్లనియె. 'ఓపార్వతీ! వ్రతములలోనెల్ల నుత్తమ మయినవ్రత మొక్కటి యున్నది. అది సకలసంపదలకుమూలమైనది. శీఘ్రముగానే పుత్రపౌత్రులను ఒసఁగునది. ఈపావనవ్రతము వరలక్ష్మీవ్రత మనఁబడును. ఈ వ్రతమును శ్రావణమాసంబునందు పూర్ణిమకు ముందుగావచ్చెడి శుక్రవారమునాఁ డాచరింపవలెను. ఓపార్వతీ! ఆవ్రతముచేసిన స్త్రీకిఁ గలుగు పుణ్యఫలంబుఁ జెప్పెదనాలకింపు" మని పార్వతికి పరమశివుఁడు చెప్పఁగా, నాపార్వతీదేవియు వెండియు శంకరునిఁ

జూచి, "నాథా ఆ వ్రతంబు నేవిధితోఁ జేయవలెను? ఆ వ్రతంబునం దే దేవతను గొలువవలయును? ఆవరలక్ష్మీదేవి నింతకుముం దెవరారాధించి యామెను సంతోషపెట్టిరి?" అని యడుగఁగా, నీశ్వరుఁడు పార్వతీదేవితో ని ట్లనియె.

"ఓ ప్రియురాలా! పావనమైనవరలక్ష్మీవ్రతప్రభావంబు చెప్పెద నాలకింపుము. బంగారుప్రాకారముతోఁగూడి, బంగారుమయంపు టిండ్లతోఁగూడి సకలభూషణములచే సింగారింపఁబడిన కుండిన మను పేరుగలపట్టణమొకటి కలదు. ఆపట్టణమందుచారుమతియను బ్రాహ్మణస్త్రీయొకతె యుండెను. ఆమె భర్తయందు భక్తి గలిగి అత్తమామలకు శుశ్రూష సల్పుచుండును. ఆమె యన్నిపనులను జేయఁగలది, అన్ని శాస్త్రములను జదివినది, ఎల్లప్పుడు ఇంపుగా మాటాడునది. నిర్మలమైనమనస్సుగల యాచారుమతీదేవికి లక్ష్మీ దేవి స్వప్నమందుఁ బ్రత్యక్షమై "ఓమంగళకరురాలా! రమ్ము నీకు మేలయ్యెడు. వరలక్ష్మీదేవి వచ్చినది శ్రావణమాసంబునఁ బున్నమకు ముందుఁగా వచ్చెడిశుక్రవారంబున నన్నుఁ బూజింపుము. నీకు కోరినవరంబు నొసంగెదను." అని చెప్పగా చారుమతి స్వప్నమందే యావరలక్ష్మీదేవి నెక్కువసంతసముతో" జగములకన్నింటికిఁ దల్లివి. పుణ్యస్వరూపురాలవు; శరణుచొచ్చిన వారిని గాపాడుదానవు; ముల్లోకములవారిచేఁ గొనియాడఁబడిన దానవు; విష్ణువుయొక్క ఱొమ్మున నుండుదానవునైన యో దేవీ! నీవెవనిని గటాక్షముతో జూతువో, ఆమానవుఁడే పుణ్యాత్ముఁడు; ఆతఁడే సుగుణములతోఁగూడినవాఁడు; ఆతఁడే కొనియాడఁబడినవాఁడు; ఆతఁడే యాలుబిడ్డలు గలవాఁడు; ఆతఁడే శూరుఁడు; ఆతఁడే పండితుఁడును. ఓహరిప్రియురాలా!

ఇతరములైన పెక్కువేల జన్మములలో నెంతపుణ్యము జేసితినో! అట్లుకాని మీపాదారవిందముల దర్శనము నాకబ్బునా” అని యావరలక్ష్మీదేవిని బహువిధములుగా స్తోత్రముచేసెను. ఆవర లక్ష్మీదేవియు ఆచారుమతిచే స్తోత్రముచేయఁబడినదై ఆచారు మతికిఁ బెక్కువరంబుల నొసఁగి యంతర్ధానము నొందెను.

చారుమతియు స్వప్నమువచ్చిన పిమ్మట పరుండి నిద్ర పోవక మేల్కాంచి, సూర్యోదయమైన తరువాత తన స్వప్న వృత్తాంతమును దన బంధువులకుఁ దెలిపెను. బంధువు లును “చారుమతీ, నీస్వప్నంబు బాగుగా నున్నది. మంచిది, మనమందఱము అలాగే చేయుద” మనియు నిశ్చయించు కొని శ్రావణపూర్ణిమకు ముందటిశుక్రవార మెన్నఁడు వచ్చునా యని యెదురుచూచుచుండిరి. వారియదృష్టవశంబున వరలక్ష్మీ వ్రతదినము ప్రాప్తింపఁగా, స్త్రీలు మనస్సులందు విచారము మాని, పరిశుద్ధముగా స్నానముచేసి, వింతవింతలైన బట్టలఁ గట్టి క్రొత్తబియ్యముతోను, మఱియిగుళ్లతోను నిండినపూర్ణ కుంభమునందు వరలక్ష్మీదేవి నావాహనముచేసి, చారుమతి మొదలగువారందఱు భక్తితోఁ బూజలు సల్పిరి. “పద్మాసనే పద్మకరే...సర్వదా” అను శ్లోకముచెప్పి, యా వరలక్ష్మీదేవి నావాహనముచేసి, మఱియు కల్పమందుఁ జెప్పఁబడినప్రకారము షోడశోపచారపూజలను జేసి, కుడిహస్తమందుఁ దోరమును కట్టుకొని, నేతితోఁజేయఁబడినభక్ష్యభోజ్యచోష్యలేహ్యపానీ యాది సకలవిధపదార్థంబులను నివేదనచేసి చక్కని నిష్ఠగల యొక ముసలిబ్రాహ్మణునికిఁ బండ్రెండుభక్ష్యములను దక్షిణా తాంబూలాదులతో వాయన మిచ్చి యా దేవి సన్నిధానంబున

దాము నివేదనచేసినభక్ష్యభోజ్యాదులగు సకలపదార్థములతోఁ గూడిన యన్నమును దనివితీఱ భుజించిరి.

తర్వాత వరలక్ష్మీప్రభావంబుననే చారుమతి మొదలగు స్త్రీలందఱు వరలక్ష్మీదేవి యనుగ్రహమువలన ముత్యాల మాణిక్యముల హారములను మెడనిండ ధరించిరి. కాలియందె లను, రవలుచెక్కిన సొమ్ములను బడసిరి. ఇట్లు కలిమియే కాక, పుత్రపౌత్రాదులను, ధనధాన్యసమృద్ధిని బడసి, యెల్లప్పుడన్న దానమునందును బంధువులపోషణయందును మిక్కిలి శ్రద్ధ గలవారలై, చతురంగబలముచే నిండిన తమతమ గృహంబు లకుఁ జనిరి.

ఓపార్వతీ! చారుమతీదేవివలన విన్న యావరలక్ష్మీ వ్రతంబు ఆనగరమందుండువా రొండొరులకుఁ జెప్పికొనిరి. ఓ పార్వతీ! ఇది నిజము. ఇది నిజము. ఈ వ్రతంబు నాచరించుటవలన మానవుఁడు మేలులను బడయును. చారుమతీదేవిమూలమున మనము కోరిన కోర్కెలెల్లఁ బడసితిమి. చారుమతి యెంతపుణ్యాత్తు రాలు! ఎంతమహిమగలది! ఆమెకు వరలక్ష్మీదేవియే ప్రత్యక్షమై యీ వ్రతంబు నుపదేశించినది. అని యాచారుమతిని బొగడిరి. ఓపార్వతీ! అది మొదలీ వ్రతము వరలక్ష్మీవ్రతంబని లోకమునఁ బ్రసిద్ధమయ్యెను. ఇది వ్రతములలోనెల్ల నుత్తమవ్రతము. దీని నీకు సవిస్తరముగాఁ జెప్పితిని. ఎవరీ వ్రతంబును వినుచున్నారో లేక నెమ్మదిగా ఒరులచేత వినిపించుచున్నారో, వారికివరలక్ష్మీదేవి ప్రభావమువలన సకలకార్యములును సిద్ధించును" అని పార్వతీ దేవికిఁ జెప్పెను. ఇది భవిష్యోత్తరపురాణంబునందలి పార్వతీ పరమేశ్వరుల సంవాదమున వరలక్ష్మీవ్రతంబు సంపూర్ణము.

# అనంతవ్రతము

ఆచమ్య = ఆచమనముచేసి.

*శుక్లాంబరధరం... న్తయే. అయంముహూర్త,—గణాధిపతయే నమః. ఓం దైవీగాయత్రీచ్ఛన్దః. ప్రాణాయామే వినియోగః. ఓంభూః...సువరోమ్.

మమ ఉపాత్తసమస్తదురితక్షయద్వారా శ్రీపరమేశ్వరప్రీత్యర్థం శుభే శోభనే...నామసంవత్సరే, దక్షిణాయనే, వర్షర్తౌ, భాద్రపదమాసే, శుక్లపక్షే, చతుర్దశ్యాం...వాసరయుక్తాయాం ...నక్షత్రయుక్తాయాం ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ అస్మాకం సహకుటుమ్బానాం క్షేమస్థైర్యవిజయాయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం, ధర్మార్థకామమోక్షచతుర్విధఫలపురుషార్థసిద్ధ్యర్థం పుత్రపౌత్రాభివృద్ధ్యర్థం శ్రీమదనంతపద్మనాభదేవతాముద్దిశ్య, అనన్తపద్మనాభదేవతాప్రీత్యర్థం కల్పోక్తప్రకారేణ యావచ్ఛక్తిధ్యానావాహనాది షోడశోపచారపూజాం కరిష్యే. †తదఙ్గత్వేన కలశపూజాం కరిష్యే. కలశస్యోపరి హస్తం నిధాయ (కలశము చేతితో మూసికొని) కలశస్య—

---

*వినాయకవ్రతమం జూడుఁడు.

† అని సంకల్పముచేసి, కలశపూజ, గణాధిపతిపూజ, అనంతపద్మనాభస్వామి ప్రాణప్రతిష్ఠ చేయవలయును. ఇది వినాయకవ్రతమునఁ జూచి యెఱుఁగవలయును.

రాపఠిమ్. కలశోదకేన పూజాద్రవ్యాణి దేవమణ్డపం ఆత్మానం చ ప్రోక్ష్య. తదంగత్వేన గణాధిపతిపూజాం కరిష్యే. ఓం గణా నాం త్వా...శ్రీమహాగణాధిపతయే నమః, సర్వోపచారపూజాః సమర్పయామి. తదఙ్గత్వేన అనన్తపద్మనాభప్రాణప్రతిష్ఠాం కరిష్యే.అస్య శ్రీఅనన్తపద్మనాభప్రాణప్రతిష్ఠామహామన్త్రస్య... సర్వోపమ్ యత్కించిన్ని వేదనం కుర్యాత్.

ప్రాణప్రతిష్ఠా సమాప్తా.

## యమునా పూజా

మయా కరిష్యమాణానన్తవ్రతపూర్వాఙ్గత్వేన యమునా పూజాం కరిష్యే.

శ్లో.క్షీరోదార్ణవసంభూతే ఇన్ద్రనీలసమప్రభే,
ధ్యానం కరోమి యమునే విష్ణురూపి నమోఽస్తు తే.
యమునాం దేవీం ధ్యాయామి.
యమునే తే నమస్తుభ్యం సర్వకామప్రదాయిని,
ఆవాహయామి భక్త్యా త్వాం సాన్నిధ్యం కురు సువ్రతే.
యమునాం దేవీమావాహయామి.
యమునే తే నమస్తుభ్యం సర్వకామప్రదాయిని,
రత్నసింహాసనం దేవి స్వీకురుష్వ మయార్పితమ్.
యమునాదేవ్యై ఆసనం సమర్పయామి.
సర్వే సముద్రాః సరితః తీర్థాని జలదా నదాః,
సింహాసనసమారూఢే దేవశక్తిసమన్వితే.
పాద్యం గృహాణ దేవేశి సర్వలక్షణసంయుతే,
యమునాదేవ్యై పాద్యం సమర్పయామి.

వైడూర్యహారసంయుక్తే సర్వలోకహితే శివే,
గృహాణాచమనం దేవి శఙ్కరార్ధశరీరిణి.
యమునాదేవ్యై ఆచమనీయం సమర్పయామి.
దేవపాదే నమస్తుభ్యం సర్వలోకహితే ప్రియే,
సర్వపాపప్రశమని తుఙ్గభద్రే నమోఽస్తు తే.
యమునాదేవ్యై స్నానం సమర్పయామి.
గురుపాదే నమస్తుభ్యం సర్వలక్షణసంయుతే,
సువ్రతం కురు మే దేవి తుఙ్గభద్రే నమోఽస్తు తే.
యమునాదేవ్యై వస్త్రయుగ్మం సమర్పయామి.
కృష్ణవేణి నమస్తుభ్యం కృష్ణవేణి సులక్షణే,
మధుపర్కం గృహాణేదం మయా దత్తం శుభప్రదే.
యమునాదేవ్యై మధుపర్కం సమర్పయామి
నన్దిపాదే నమస్తుభ్యం శఙ్కరార్ధశరీరిణి,
సర్వలోకహితే తుభ్యం భీమరథ్యై నమోఽస్తు తే.
యమునాదేవ్యై ఆభరణాని సమర్పయామి.
సహ్యపాదసముద్భూతే సర్వకామఫలప్రదే,
సర్వలక్షణసంయుక్తే భవనాశిని తే నమః.
యమునాదేవ్యై ఉత్తరీయం సమర్పయామి.
కృష్ణపాదసముద్భూతే గఙ్గే త్రిపథగామిని,
జటాజూటసముద్భూతే సర్వకామఫలప్రదే.
యమునాదేవ్యై గన్ధాన్ సమర్పయామి.
గోదావరి నమస్తుభ్యం సర్వాభీష్టప్రదాయిని,
స్వీకురుష్వ జగద్వన్ద్యే అక్షతానమలాన్ శుభాన్.
యమునాదేవ్యై అక్షతాన్ సమర్పయామి.

మన్దారైః పారిజాతైశ్చ పాటలాశోకచమ్పకైః,
పూజయామి తవ ప్రీత్యై వరదే భక్తవత్సలే.
యమునాదేవ్యై పుష్పాణి పూజయామి.

అథాఙ్గపూజా.

"పూజయామి" అని ప్రతినామమునకుఁ గడపటఁ జేర్పవలయును.

చఞ్చలాయై నమః పాదౌ
సుజఙ్ఘాయై నమః జఙ్ఘే
చపలాయై నమః జానునీ
పుణ్యాయై నమః ఊరూ
కమలాయై నమః కటిం
గోదావర్యై నమః స్తనౌ
భవనాశిన్యై నమః కణ్ఠం
తుఙ్గభద్రాయై నమః ముఖం
సున్దర్యై నమః లలాటం
దేవ్యై నమః నేత్రే
పుణ్యశ్రవణకీర్తనాయై నమః కర్ణౌ
సునాసికాయైనమః నాసికాం
భాగీరథ్యైనమః శిరః
యమునాయై నమః సర్వాణ్యఙ్గాని.

శ్లో. దశాఙ్గం గుగ్గులూపేతం చన్దనాగరుసంయుతం,
యమునాయై నమస్తుభ్యం. ధూపోఽయం ప్రతిగృహ్యతామ్.
యమునాదేవ్యై ధూపమాఘ్రాపయామి.

శ్లో. ఘృతవర్తియుతం దీపం త్రైలోక్యతిమిరాపహం,
గృహాణ మఙ్గళం దేవి సర్వేశ్వరి నమోఽస్తు తే.
యమునాదేవ్యై దీపం దర్శయామి.

శ్లో. సర్వభక్ష్యైశ్చ భోజ్యైశ్చ రసైః షడ్భిః సమన్వితం,
నైవేద్యం గృహ్యతాం దేవి యమునాయై నమో నమః.
యమునాదేవ్యై నైవేద్యం సమర్పయామి.

శ్లో. పానీయం పావనం శ్రేష్ఠం గంగాదిసరిదుద్భవం,
హస్తప్రక్షాళనార్థం వై గృహాణ సురపూజితే.
యమునాదేవ్యై హస్తప్రక్షాళనం సమర్పయామి.

శ్లో. కర్పూరవాసితం చూర్ణం క్రముకాద్యైః సమన్వితం,
తామ్బూలం గృహ్యతాం దేవి యమునాయై నమోఽస్తు తే.
యమునాదేవ్యై తామ్బూలం సమర్పయామి.

* నీరాజనం మంత్రపుష్పం ప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి.

యస్య స్మృత్యా చ...పరిపూర్ణం తదస్తు తే అనయా షోడశోపచారపూజయా యమునాదేవీ సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు.

యమునాపూజావిధానం సంపూర్ణమ్.

అనంతరం శ్రీమదనంతపద్మనాభం ధ్యాయేత్

శ్లో. కృత్వా దర్భమయం దేవం పరిధానసమన్వితం,
ఫణైః సప్తభిరావిష్టం పింగళాక్షం చతుర్భుజమ్.
దక్షిణాగ్రకరే పద్మం శఙ్ఖం తస్యాప్యధఃకరే,
చక్రమూర్ధ్వకరే వామే గదాం తస్యాప్యధః కరే.
దధానం సర్వలోకేశం పీతామ్బరధరం హరిం,
దుగ్ధాబ్ధిశాయినం ధ్యాత్వా చైవమావాహయేత్సుధీః.

"ఓం నమో భగవతే వాసుదేవాయ" ఇత్యనేన పూర్వోక్తవిశేషణవిశిష్టం శ్రీమదనన్తపద్మనాభం ధ్యాయేత్.

---

* "జాతవేదసే" అను మంత్రముచే నీరాజనము. "గౌరీమిమాయ సలిలానితక్షతి" అనుమంత్రముచే మంత్రపుష్పము. "యానికానిచ" అను శ్లోకముచే ప్రదక్షిణనమస్కారములను జేయవలయును.

తా. దర్భలతో ననంతపద్మనాభస్వామిని నిర్మించి, యేడు పడగలేర్పఱచి వస్త్రముతోఁ జుట్టి, పచ్చనికన్నులు పెట్టి, నాలుగుచేతులు పెట్టి యానాలుగింటిలో కుడివైపు పై చేతియందు శంఖమును, ఎడమవైపు పై చేతియందుఁ జక్రమును, క్రిందిచేతియందు గదను ధరించియున్నట్లు నిర్మింపవలయును, అట్లునిర్మించిన కూర్చమునందు సర్వలోకేశ్వరుఁడును, పీతాంబరము ధరించినవాఁడును, క్షీరసాగరమునందు శయనించినవాఁడును నైన యనంతపద్మనాభస్వామిని ధ్యానింపవలయును. "ఓం నమో భగవతే వాసుదేవాయ" ఈ మంత్రముచే పూర్వోక్తవిశేషణవిశిష్టుఁడైన అనంతపద్మనాభస్వామినిధ్యానింపవలయును.

ఆగచ్ఛానన్త దేవేశ తేజోరాశే జగత్పతే,
ఇమాం మయా కృతాం పూజాం గృహాణ సురసత్తమ.

లోకములకు నాథుఁడవు, వెలుఁగులగుమివి. వేల్పులతేఁడవు నైన యనన్తా నాపూజను గ్రహింపుము.

శ్రీమదనన్తపద్మనాభస్వామినమావాహయామి-

అనన్తాయ నమస్తుభ్యం సహస్రశిరసే నమః,
రత్నసింహాసనం చారు ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్.

వేయి పడగలుగల యోయనంతా! నీకు నమస్కరించెదను. రత్నములు చెక్కిన చక్కని సింహాసనము ననుగ్రహింపుము.

శ్రీమదనన్తపద్మనాభస్వామినే ఆసనం సమర్పయామి.

దోరస్థాపనమ్:—

తన్యాగ్రతో దృఢం సూత్రం కుంకుమాక్తం సుదోరకం,
చతుర్దశగ్రన్థియుక్తముపకల్ప్య ప్రపూజయేత్.

తా. ఆయాసనమునకు ముందటఁ బదునాలుగుముళ్లు వేసిన గట్టితోరమునుంచి పూజ సేయవలయును.

అనన్తగుణరత్నాయ విశ్వరూపధరాయ చ,
అర్ఘ్యం దదామి తే దేవ గణాధిపతయే నమః.

తా. మితిలేని గుణములకు నిధివి, విశ్వరూపంబు ధరించిన వాఁడవు, వేల్పులమూఁకలకుఁ బెద్దవు నైనయోదేవా! నీకర్ఘ్యం బొసఁగెదను.

శ్రీమదనన్త............మినే అర్ఘ్యం సమర్పయామి.

సర్వాత్మన్ సర్వలోకేశ సర్వవ్యాపిన్ సనాతన,
పాద్యం గృహాణ భగవన్ దివ్యరూప నమోఽస్తు తే.

తా. ఓసర్వస్వరూపా! సర్వలోకపతీ! సర్వవ్యాపీ! శాశ్వతుఁడా! ఓభగవంతుఁడా! ఓదివ్యరూపా! నీకు మ్రొక్కెదను. పాద్యంబు స్వీకరింపుము.

శ్రీమదనన్త మినే పాద్యం సమర్పయామి.

దామోదర నమస్తేఽస్తు నరకార్ణవతారక,
గృహాణాచమనం దేవ మయా దత్తం హి కేశవ.

తా. సంసారసముద్రమునుండి తరింపఁజేయు ఓకేశవా! ఓదామోదరా! నేనొసఁగెడి యాచమనమును గ్రహింపుము.

శ్రీమదనన్త...స్వామినే ఆచమనీయం సమర్పయామి.

అనన్తానన్తదేవేశ అనన్తఫలదాయక,
దధిమధ్వాజ్యసంయుక్తం మధుపర్కం దదామి తే.

తా. సకలదేవతలకు నాథుఁడా! మేరలేని కోర్కెల నొసఁ

గెడివాఁడా! తేనె, పెరుఁగు, పాలు; నెయ్యితోఁగూడిన మధుపర్కము నొసఁగెదను.

శ్రీమదనన్తపద్మ...మినే మధుపర్కం సమర్పయామి.

శ్లో. అనన్తగుణగమ్భీర విశ్వరూపధరానఘ,
పఞ్చామృతైశ్చ విధివత్స్నాపయామి దయానిధే.

తా. సాటిలేనిగుణంబులుగల గంభీరుఁడవు, విశ్వరూపమును ధరించినవాఁడవు, పుణ్యమూర్తివియు నైన యో యనంతా! దయ కునికిపట్టయినవాఁడా! నిన్నుఁ బంచామృతంబులతో స్నానము చేయించెదను.

శ్రీమదనన్త—మినం పఞ్చామృతైః స్నాపయామి.

గంగే చ యమునే చైవ గోదావరి సరస్వతి,
నర్మదే సిన్ధు కావేరి జలేఽస్మిన్ సన్నిధిం కురు.
స్నానం ప్రకల్పయే త్తీర్థైః సర్వపాపప్రముక్తయే.

తా. ఓగంగానదులారా! యీతీర్థమునందు సన్నిధి సేయుఁడు. నాపాపములు తొలఁగుటకై యీతీర్థములచే భగవంతుని స్నానము చేయించుచున్నాను.

శ్రీమదనంత...స్వామినే నమః స్నానం సమర్పయామి.

శ్రీధరాయ నమస్తుభ్యం విష్ణవే పరమాత్మనే,
పీతామ్బరం ప్రదాస్యామి అనంతాయ మహాత్మనే.

తా. లక్ష్మిని ఱొమ్మునందుఁ దాల్చిన పరమాత్మ స్వరూపుఁడవైనయోభగవంతుఁడ వగు అనంతా! పట్టుపీతాంబరము నొసఁగెదను.

---

* పంచామృతము, స్నానము మొదలగువానికి మంత్రములను వినాయకవ్రతము చూడుఁడు.

శ్రీమదనన్త...స్వామినే వస్త్రయుగ్మం సమర్పయామి.
నారాయణ నమస్తేస్తు త్రాహి మాం భవసాగరాత్,
బ్రహ్మసూత్రం చోత్తరీయం గృహాణ పురుషోత్తమ.

తా. ఓనారాయణా! నన్ను సంసారసముద్రమునుండి లేవఁదీసి రక్షింపుము. ఓపురుషోత్తమా! యజ్ఞోపవీతమును, ఉత్తరీయమును స్వీకరింపుము.

శ్రీమదనన్తమినే ఉపవీతం సమర్పయామి.

శ్రీగన్ధం చన్దనోన్మిశ్రం కుఙ్కుమాదిభిరన్వితం,
విలేపనం సురశ్రేష్ఠ ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్.

తా. కుంకుమపువ్వు మొదలగు సుగంధద్రవ్యములు గలిపిన గంధము నొసంగెదను. ప్రీతితోఁ గైకొనుము.

శ్రీమదనన్తమినే గంధం సమర్పయామి.

శాలీయాంస్తణ్డులాన్ రమ్యాన్ మయాదత్తాన్ శుభావహాన్,
అక్షయానన్త గోవిన్ద అక్షతాన్ స్వీకురు ప్రభో.

తా. ఓగోవిందా! తెల్లనిబియ్యముతోఁ జేయఁబడి, నాచే నియ్యఁబడిన సొగసైన యక్షతలను అలంకారమునకై ధరింపుము.

శ్రీమదనన్తమినే అక్షతాన్ సమర్పయామి.

కరవీరైర్జాతికుసుమైశ్చమ్పకైర్వకుళైః శుభైః,
శతపత్రైశ్చ కల్హారైరర్చయేత్పురుషోత్తమమ్.

తా. గన్నేరు, సంపంగి, పొన్న, కమలములు, కలువలు మొదలగు పువ్వులచేఁ బురుషోత్తముని బూజించెదను.

## అథ అంగపూజా

"పూజయామి" అని ప్రతినామము
కడపటఁ జేర్పవలయును.

అనన్తాయ నమః పాదౌ
శేషాయ నమః గుల్ఫౌ
కాలాత్మనే నమః జఙ్ఘే
విశ్వరూపాయ నమః జానునీ
జగన్నాథాయ నమః గుహ్యం
పద్మనాభాయ నమః నాభిం
సర్వాత్మనే నమః కుక్షిం
శ్రీవత్సవక్షసే నమః వక్షఃస్థలం
చక్రహస్తాయ నమః హస్తాన్
ఆజానుబాహవే నమః బాహూ
శ్రీకణ్ఠాయ నమః కణ్ఠం [న్
చన్ద్రముఖాయ నమః ముఖం
వాచస్పతయే నమః వక్త్రం
కేశవాయ నమః నాసికాం
నారాయణాయ నమః నేత్రే
గోవిన్దాయ నమః శ్రోత్రే
అనన్తపద్మనాభాయ నమః శిరః
విష్ణవే నమః సర్వాణ్యఙ్గాని

## అష్టోత్తరశతనామపూజా.

"నమః" అని ప్రతినామము కడపటఁ జేర్పవలయును.

శ్రీకృష్ణాయ
కమలానాథాయ
వాసుదేవాయ
సనాతనాయ
వసుదేవాత్మజాయ
పుణ్యాయ
లీలామానుషవిగ్రహాయ
శ్రీవత్సకౌస్తుభధరాయ
యశోదావత్సలాయ
హరయే
చతుర్భుజాత్తచక్రాసిగదా
శంఖాద్యాయుధాయ
దేవకీనన్దనాయ
శ్రీశాయ
నన్దగోపప్రియాత్మజాయ
యమునావేగసంహారిణే
బలభద్రప్రియానుజాయ
పూతనాజీవితహరాయ

శకటాసురభఞ్జనాయ
నన్దవ్రజజనానన్దినే
సచ్చిదానందవిగ్రహాయ 20
నవనీతవిలిప్తాఙ్గాయ
నవనీతనటాయ
అనఘాయ
నవనీతనవాహారాయ
ముచికున్దప్రసాదకాయ
షోడశస్త్రీసహస్రేశాయ
త్రిభంగినే
మధురాకృతయే
శుకవాగమృతాబ్ధీన్దవే
గోవిన్దాయ 30
యోగినాంపతయే
వత్సవాటచరాయ
అనన్తాయ
ధేనుకాసురభఞ్జనాయ
తృణీకృతతృణావర్తాయ
యమళార్జునభఞ్జనాయ
ఉత్తాలతాలభేత్రే
తమాలశ్యామలాకృతయే
గోపగోపీశ్వరాయ
యోగినే 40
కోటిసూర్యసమప్రభాయ
ఇళాపతయే
పరంజ్యోతిషే
యాదవేన్ద్రాయ
యదూద్వహాయ
వనమాలినే
పీతవాససే
పారిజాతాపహారకాయ
గోవర్ధనాచలోద్ధర్త్రే
గోపాలాయ 50
సర్వపాలకాయ
అజాయ
నిరఞ్జనాయ
కామజనకాయ
కఞ్జలోచనాయ
మధుఘ్నే
మధురానాథాయ
ద్వారకానాయకాయ
బలినే
బృన్దావనాన్తసఞ్చారిణే 60
తులసీదామభూషణాయ
శమన్తకమణేర్హర్త్రే
నరనారాయణాత్మకాయ
కుబ్జాకృష్టాంబరధరాయ
మాయినే

పరమపూరుషాయ
ముష్టికాసురచాణూరమల్లయుద్ధవిశారదాయ
సంసారవైరిణే
కంసారయే
మురారయే 70
నరకాన్తకాయ
అనాదిబ్రహ్మచారిణే
కృష్ణావ్యసనకర్శకాయ
శిశుపాలశిరశ్ఛేత్త్రే
దుర్యోధనకులాన్తకాయ
విదురాక్రూరవరదాయ
విశ్వరూపప్రదర్శకాయ
సత్యవాచే
సత్యసంకల్పాయ
సత్యభామారతాయ 80
జయినే
సుభద్రాపూర్వజాయ
జిష్ణవే
భీష్మముక్తిప్రదాయకాయ
జగద్గురవే
జగన్నాథాయ
వేణునాదవిశారదాయ
వృషభాసురధ్వంసినే

బాణాసురకరాన్తకాయ
యుధిష్ఠిరప్రతిష్ఠాత్రే 90
బర్హిబర్హావతంసకాయ
పార్థసారథయే
అవ్యక్తాయ
గీతామృతమహోదధయే
కాళీయఫణిమాణిక్యరంజిత
శ్రీపదామ్బుజాయ
దామోదరాయ
యజ్ఞభోక్త్రే
దానవేన్ద్రవినాశకాయ
నారాయణాయ
పరబ్రహ్మణే 100
పన్నగాశనవాహనాయ
జలక్రీడాసమాసక్తగోపీవస్త్రాపహారకాయ
పుణ్యశ్లోకాయ
తీర్థపాదాయ
వేదవేద్యాయ
దయానిధయే
సర్వదేవాత్మకాయ
సర్వగ్రహరూపిణే
పరాత్పరాయ
శ్రీమదనన్తపద్మనాభస్వామినే

ఇతి అష్టోత్తరశతనామపూజాం సమర్పయామి.

## దోరగ్రంథిపూజా

కృష్ణాయ నమః ప్రథమగ్రంథిం పూజయామి.
విష్ణవే నమః ద్వితీయ ,, ,,
జిష్ణవే నమః తృతీయ ,, ,,
కాలాయ నమః చతుర్థ ,, ,,
బ్రహ్మణే నమః పఞ్చమ ,, ,,
భాస్కరాయ నమః షష్ఠ ,, ,,
శేషాయ నమః సప్తమ ,, ,,
సోమాయ నమః అష్టమ ,, ,,
ఈశ్వరాయ నమః నవమ ,, ,,
విశ్వాత్మనే నమః దశమ ,, ,,
మహాకాలాయ నమః ఏకాదశ ,,
సృష్టిస్థిత్యన్తకారిణే నమః ద్వాదశ ,,
అచ్యుతాయ నమః త్రయోదశ ,,
అనన్తపద్మనాభాయ నమః చతుర్దశ ,,

శ్లో. (వనస్పతి...గృహ్యతామ్ ధూరసి...ర్వామః)
శ్రీమదనన్తపద్మనాభస్వామినే నమః ధూపమాఘ్రాపయామి.

శ్లో. సాజ్యం...త్రైలోక్యతిమిరాపహామ్ (ఉద్దీప్యస్వ...పాతయ
శ్రీమదనన్తపద్మనాభస్వామినే నమః దీపం దర్శయామి.

శ్లో. అన్నం చతుర్విధం భక్ష్యైః రసైః షడ్భిః సమన్వితం,
మయా నివేదితం తుభ్యం స్వీకురుష్వ జనార్దన.
నైవేద్యం గృహ్య దేవేశ భక్తిం మే హ్యచలాం కురు,
ఈప్సితం మే వరం దేహి పరత్రచ పరాం గతిమ్.

(ఓంభూర్భువః... బ్రహ్మణే స్వాహా.) శ్రీమదనన్తపద్మనాభ స్వామినే నమః నైవేద్యం సమర్పయామి.

తా. నాలుగు విధంబులయిన యన్నములతోఁగూడి, షడ్రసోపేతమయి భక్ష్యభోజ్యాదులతోఁగూడిన యన్నమును నీకు నివేదనము చేయుచున్నాను. ఓజనార్దనా! నైవేద్యము నారగించి, నాకు నీయెడ స్థిరమైన భక్తిని గలిగించి, ఇహలోకంబున కోరినవరంబులను, పరలోకంబున మోక్షసౌఖ్యము నొసఁగుము.

శ్లో. పూగీఫలసమాయుక్తం...గృహ్యతాం,

శ్రీమదనన్తపద్మనాభస్వామినే నమః తాంబూలం సమర్పయామి. సువర్ణపుష్పం సమర్పయామి.

శ్లో. నమః సర్వహితార్థాయ జగదాధారమూర్తయే,
సృష్టిస్థిత్యంతరూపాయ హ్యనన్తాయ నమోనమః.

తా. జనులకెల్ల మేలుచేయువాఁడవు, లోకములకెల్ల నాధారస్వరూపుఁడవు, లోకములకు సృష్టిస్థితివిలయంబులఁ జేయువాఁడవు, నాశము లేనివాఁడవు నైన యో స్వామీ! నీకుఁ బలుమాఱు నమస్కారములు (సోమో వా...భవతి) శ్రీమదనన్త...నే నమః. నీరాజనం దర్శయామి.

(ధాతాపురస్తాదితి) (సహస్రశీర్షమితి) మంత్రైః వా న్యైః కైశ్చిత్ శ్లోకైః వా మంత్రపుష్పం కుర్యాత్.

తా. ధాతా పురస్తాత్' 'సహస్రశీర్షం' ఈ మొదలగు మంత్రములచేతఁగాని కొన్ని శ్లోకములచేతఁగాని మంత్ర పుష్పము సమర్పించవలెను.

శ్రీమదనన్త...మినే మంత్రపుష్పం సమర్పయామి.

శ్లో. యాని కాని చ...పదే. పాపోఽహం పాపకర్మాహం...
వత్సల. అన్యథా...జనార్దన. నమస్తే దేవదేవేశ నమస్తే
ధరణీధర, నమస్తే సర్వనాగేన్ద్ర ీ నమస్తే పురుషోత్తమ.

శ్రీమదనంతపద్మ...స్వామినే నమః ఆత్మప్రదక్షిణనమస్కా-
రాన్ సమర్పయామి.

శ్లో దారిద్ర్యనాశనార్థాయ పుత్రపౌత్రప్రవృద్ధయే,
అనన్తాఖ్యమిదం సూత్రం ధారయామ్యహముత్తమమ్.

తా. దారిద్ర్యము తొలఁగిపోవుటకును, సంతతి గలుగుట
కును, అనంతుఁ డనునీసూత్రమును గైకొనుచున్నాను.

ఈశ్లోకము చెప్పి తోరమును చేతఁదీసికొనవలసినది.

శ్లో. అనన్తసంసార మహాసముద్ర మగ్నం సమభ్యుద్ధర వాసు
దేవ, అనన్తరూపిణ్ వినియోజయస్వ హ్యనన్తసూత్రాయ
నమో నమస్తే.

తా. తుదిలేనిరూపంబుగల యోవాసుదేవుఁడా! అనంత
సూత్రుఁడ వగు నీకు మ్రొక్కెదను. తుదిలేని సంసార మను
సముద్రమందు మునిఁగిన నన్ను లేవనెత్తుము.

ఈశ్లోకముచెప్పి దోరనమస్కారము చేయవలసినది.

శ్లో. సంసారగహ్వరగుహాసు సుఖం విహర్తుం వాఞ్ఛన్తి యే
కురుకులోద్వహశుద్ధసత్త్వాః, సంపూజ్య చ త్రిభువనేశ
మనన్తరూపం బధ్నన్తి దక్షిణకరే వరదోరకం తే.

తా. ఓ కురువంశోద్ధారకా! శుద్ధస్వభావముగల యెవరు
(విరక్తులు) సంసారమనెడి చొఁరరాని గుహలందు సుఖంబుగా
విహరింపఁగోరుచున్నారో, వారు ముల్లోకంబులకు ఱేఁడగు

అనంతరూపుండయిన పద్మనాభస్వామిని బూజించి కుడిచేతి యందు శ్రేష్ఠమగు దోరమును గట్టుకొందురు.

ఈశ్లోకముచెప్పి దోరమును చేతఁ గట్టుకొనవలయును.

శ్లో. అనన్తాన న్తదేవేశ అన న్తఫలదాయక,
సూత్రగ్రన్థిషు సంస్థాయ విశ్వరూపాయ తే నమః.

తా. ఓయనంతా! దేవదేవా! ఎక్కువ ఫలము నొసఁగువాఁడా! దోరపు ముళ్లయందుఁ వసించు ప్రపంచాత్మకుఁడవైన నీకొఱకు నమస్కారము.

ఈశ్లోకము చెప్పి ప్రాఁతతోరమును తీసివేయవలయును.

శ్లో. అన న్తః ప్రతిగృహ్ణాతి అనన్తో వై దదాతి చ,
అన న్తస్తారకోభాభ్యామనన్తాయ నమోనమః.

ఈశ్లోకము చెప్పి వాయనము నియ్యవలసినది.

శ్లో. యస్య స్మృత్యా చ నామోక్త్యా తపః...హీనం జనార్దన,
యత్పూజితం...తదస్తు తే, అనయా కల్పోక్తప్రకారేణ
కృతయా పూజయా భగవాన్ సర్వదేవాత్మకః శ్రీమదన న్త
పద్మనాభస్వామీ సుప్రీతః సుప్రసన్నో వరదో భవతు.

పూజావిధానం సమాప్తమ్.

---

## కథా ప్రారంభము

శ్లో. అరణ్యే వ ర్తమానాస్తే పాణ్డవా దుఃఖకర్శితాః,
కృష్ణం దృష్ట్వా మహాత్మానం ప్రణిపత్య యథాక్రమమ్. 1
యుధిష్ఠిరః— అహం దుఃఖేన స న్తప్తో భ్రాతృభిః పరివారితః,
కథం ము క్తిర్భవేదాస్మాకమనన్తాద్దుఃఖసాగరాత్. 2

శ్రీకృష్ణః — అనన్తవ్రతమిత్యస్తి సర్వపాపప్రణాశనం, సర్వసిద్ధిప్రదం నృణాం స్త్రీణాం చైవ యుధిష్ఠిర. 3. అనన్తకీర్తిదం నృణామనన్తశ్రీకరం శుభం, అనంతపుత్రసుఖదమనన్తాభీష్టదాయకమ్. 4. శుక్లపక్షే చతుర్దశ్యాం మాసి భాద్రపదే శుభే, తస్యానుష్ఠానమాత్రేణ సర్వపాపైః ప్రముచ్యతే. 5.

యుధిష్ఠిరః — కృష్ణ కోఽయం త్వయాఽఽఖ్యాతః కో నంత ఇతి విశ్రుతః, కిం శేషో నాగరూపో వా అనంతస్తక్షకోఽపి వా. 6. పరమాత్మాథవాఽనంత ఉత బ్రహ్మ స ఉచ్యతే, కోఽయం దేవోఽనంతసంజ్ఞస్తథ్యం మే బ్రూహి కేశవ. 7.

శ్రీకృష్ణః — అనంత ఇత్యహంపార్థవిశ్వరూపం నిబోధ మే, ఆదిత్యగ్రహచారేణ యః కాల ఉపపద్యతే. 8. కలాకాష్ఠాముహూర్తాది దినరాత్రశరీరవాన్, పక్షర్తుమాసవర్షాదియుగకల్పవ్యవస్థయా. 9. యోఽయం కాలో మయాఽఽఖ్యాతః సోఽనంత ఇతి సంజ్ఞికః, సోఽహం కాలోఽవతీర్ణోఽత్ర భువో భారాపనుత్తయే. 10. దానవానాం వినాశాయ వసుదేవకులేఽభవం, మాం విద్ధ్యనంతం తం పార్థ కృష్ణం జిష్ణుం హరం శివమ్. 11. బ్రహ్మాణం భాస్కరం శేషం సర్వవ్యాపినమీశ్వరమ్. 12. విశ్వరూపం మహాత్మానం సృష్టిస్థిత్యంతకారణం, అనంతపద్మనాభం చ నారసింహం చ వామనమ్. 13. ప్రత్యయార్థం మయా పార్థ మమ రూపం ప్రదర్శితం, పూర్వమేవ పరబ్రహ్మ యోగిధ్యేయమనుత్తమమ్. 14. విశ్వరూపమనంతం చ యస్మిన్నింద్రాశ్చతుర్దశ, వసవో ద్వాదశాదిత్యా రుద్రా ఏకాదశాపిచ. 15. సప్తర్షయః సముద్రాశ్చ పర్వతాః సరితో ద్రుమాః,

నక్షత్రాణి దిశో భూమిః పాతాళం భూర్భువాదికమ్. 16. మా కురుష్వాత్ర సన్దేహమహమేవ యుధిష్ఠిర.

యుధిష్ఠిరః—కిం పుణ్యం కిం ఫలం తస్య కిం దానం కస్య పూజనమ్. 17. కేన చాపి పురా చీర్ణం మర్త్యలోకే ప్రకాశితం, ఏతత్సమస్తం విస్తార్య తథ్యం మే బ్రూహి కేశవ. 18.

శ్రీకృష్ణః—ఆసీత్పురా కృతయుగే సుమంతో నామ వై ద్విజః, వసిష్ఠగోత్రే చోత్పన్నః సురూపాం చ భృగోః సుతామ్, 19. దీక్షాం నామోపయేమే తాం వేదోక్తవిధినా తతః, తస్యాః కాలేన సంజాతా దుహితానన్తలక్షణా, శీలా నామ సుశీలా చ వర్ధతే మాతృవేశ్మని. 21. మాతా తస్యాస్తు కాలేన జ్వరదాహేన పీడితా. వినినాశ నదీతీరే మృతా స్వర్గపురం యయా. 22. సుమన్తోఽపి తతోఽన్యాం వై ధర్మలోపభయాత్పునః, ఉపయేమే విధానేన కర్కశాం నామ నామతః. 23. దుశ్శీలాం కర్కశాం చణ్డీం నిత్యం కలహకారిణీం, సాపి శీలా పితృగృహే గృహార్చనరతా బభౌ. 24. కుడ్యస్తమ్భకుసూలేషు దేహళీతోరణాదిషు, చాతుర్వర్ణ్యకరంగైశ్చ రక్తపీతైః సితాసితైః. 25. స్వస్తికైః పద్మసంఘైశ్చ సార్చయన్తీ ముహుర్ముహుః, పితా దృష్ట్వా సుమన్తోఽపి స్త్రీచిహ్నం యౌవనే స్థితామ్. 26. కస్మై దేయా మయా బాలేత్యచిన్తయదతీవ సః, మునిః కౌండిన్యనామా వై వివాహేచ్ఛురథాగతః. 27. తస్మై ప్రదేయా కన్యేతి సుమన్తేనాపి నిశ్చితం, తతో దత్వా మునీన్ద్రాయ కౌండిన్యాయ శుభే దినే. 28. స్వగృహోక్తవిధానేన వివాహమకరోత్తతః, నిర్వర్త్యౌద్వాహికం సర్వం ప్రోక్తవాన్ కర్కశాం ద్విజః. 29. కించిద్వైవాహికం దేయం జా

మాతుః పారితోషికం, తచ్ఛ్రుత్వా కర్కశా క్రుద్ధా ప్రవిశ్య గృహమణ్టపమ్. 30. కవాటం సుస్థిరం బద్ధ్వా బభాషే గమ్యతామితి, భోజ్యావశిష్టచూర్ణేన పాథేయం చ చచార సః. 31. కౌణ్డిన్యోఽపి వివాహ్యైనాం పథి గచ్ఛన్ శనైఃశనైః, శీలాం సుశీలామాదాయ నవోఢాం గోరథేన చ. 32. గచ్ఛన్ మధ్యాహ్నవేళాయాం సముత్తీర్య సరిత్తటే, కర్తుం మాధ్యాహ్నికం స్నానం జలాశయముపాగమత్. 33. దదర్శ శీలా సా స్త్రీణాం సమూహం రక్తవాససాం, చతుర్దశ్యామర్చయన్తం భక్త్యా దేవం పృథక్పృథక్. 34. ఉపగమ్య శనైః శీలా పప్రచ్ఛ స్త్రీకదమ్బకం, నార్యః కిమస్తి నో బ్రూత కిం నామ వ్రతమీదృశమ్. 35. తా ఊచుర్యోషితః సర్వా అనన్తవ్రతమిత్యథ, సాబ్రవీదహమప్యేతత్కరిష్యే వ్రతముత్తమమ్. 36. విధానం కీదృశం తత్ర కో దేవః కస్య పూజనం, బ్రూత సర్వాఙ్గనాః సర్వా ఏతద్విస్తార్య తత్త్వతః. 37.

స్త్రియ ఊచుః—శుక్లపక్షే నభస్యేతు చతుర్దశ్యాం ప్రపూజయేత్, అనన్తం సరితస్తీరే శ్రుత్వా చైవ హరేః కథామ్. 38. స్నాత్వానద్యాం నమస్కృత్య ధౌతవస్త్రధరః శుచిః, శుచౌ దేశే సమాలిప్య గోమయేన విచక్షణః. 39. మండలం కారయేత్తత్ర సర్వతోభద్రసంజ్ఞకం, పద్మమష్టదళోపేతం మధ్యే కర్ణికయాన్వితమ్. 40. విధినా పరితః కుర్యాత్తత్ర శోభోపశోభితం, శ్వేతం తండులచూర్ణేన పఞ్చవర్ణేన కారయేత్. 41. తస్య దక్షిణపార్శ్వే తు కుంభం సంస్థాపయేద్బుధః, తన్మధ్యే చార్చయేద్దేవమనన్తం సర్వతోముఖమ్. 42. కృత్వా దర్భమయం దేవం శ్వేతద్వీపే స్థితం హరిం, సమన్వితం సప్తఫణైః

పింగాక్షం చ చతుర్భుజమ్. 43. దక్షిణాగ్రకరే పద్మం శఙ్ఖం తస్యాప్యధఃకరే, చక్రమూర్ధ్వకరే వామే గదాం తస్యాప్యధః కరే. 44. ఏవం ధ్యానమనన్తస్య కథితం బ్రహ్మవిత్తమైః, కుంభే చ మండలే చైవ బింబే చైవ సమర్పయేత్. 45. అర్చయేద్దేవదేవేశం మండలే ధూపదీపకైః, దివ్యపుష్పైశ్చ నైవేద్యైః ప్రత్యేకం చ చతుర్దశ. 46. తస్యాగ్రతో దృఢం సూత్రం కుంకుమాక్తం సుదోరకం, చతుర్దశ గ్రన్థిసంయుక్తముపకల్ప్య ప్రయోజయేత్. 47. షట్ప్రస్థప్రమాణేన గోధూమానాం ప్రయత్నతః, అష్టావింశతిసంఖ్యాని గుడమిశ్రాణి కారయేత్. 48. అర్ధం విప్రాయ దాతవ్యమర్ధం భోక్తవ్యమాత్మనా, పూజాద్రవ్యాణి సర్వాణి స్యుశ్చతుర్దశసంఖ్యయా. 49. బ్రాహ్మణాన్భోజయేత్పశ్చాద్భుఞ్జీయాత్స్వస్థమానసః, ధ్యాత్వా నారాయణం దేవమనన్తం విశ్వరూపిణమ్. 50. వర్షే వర్షే నవం సూత్రం యత్నేనైవ తు ధారయేత్, తతశ్చతుర్దశే వర్షే కుర్యాదుద్యాపనం బుధః. 51. భుక్త్వా తతో వ్రజేద్దేహమిదం ప్రోక్తం వ్రతంతవ, ఇత్యుక్తా తాభిరార్యాభిస్తతోన్యేనహ ధీమతీ. 52. సా శీలా తద్వ్రతం చక్రే కరే బద్ధ్వా సుదోరకం, పాథేయశేషం విప్రాయ దత్వా భుక్త్వా తతో యయౌ. 53. తస్మిన్క్షణేఽప్యనన్తస్య ప్రసాదాద్భార్తిరుత్తమా, అష్టైశ్వర్యం వ్రతేనైవ సంజాతం లోకసమ్మతమ్. 54 తస్యాశ్రమః శ్రియాయుక్తో ధనధాన్యసమన్వితః, ఆగతాతిథిసత్కారశోభితః శాన్తసత్త్వవాన్. 55. తం దృష్ట్వా బాన్ధవాః సర్వే పరం హర్షముపాగతాః, అనన్తవ్రత మాహాత్మ్యం ఖ్యాతం సర్వత్ర భూరిశః.

56. సాపిమాణిక్యకాంచీభిర్నూపురైశ్చవిభూషితా, దివ్యస్రగ్వస్త్రసమ్పన్నా సావిత్రీప్రతిమా బభౌ. 57. కదాచిదుపవిష్టేన కౌణ్డిన్యేన దురాత్మనా, శీలాయా హస్తమూలే తు దృష్టం బద్ధం సుదోరకమ్. 58.

కౌణ్డిన్యః—కిమిదం దోరకం శీలే కస్య వశ్యాయ తే ధృతం, మమ వాన్యస్య వా బాలే కిమర్థం బ్రూహి తత్త్వతః. 59. సత్యం ప్రోవాచ సా శీలా హ్యనన్తోఽయం మయా ధృతః, తస్య ప్రసాదాత్సంతానధనధాన్యాదిసమ్పదః. 60. లభన్తే సమ్పదః సర్వే తదిదం హి మయా ధృతం, తస్యాస్తద్వచనం శ్రుత్వా సాక్షేపం త్రుటితం రుషా. 61. కోఽనన్త ఇతి దేవోఽయం బ్రువతా తేన పాండవ, క్షిప్తం జ్వాలాకులే వహ్నౌ హాహా కృత్వా ప్రధావతీ. 62. శీలా గృహీత్వా తత్సూత్రం క్షీరమధ్యే వినిక్షిపత్, తేన కర్మవిపాకేన తస్య సా శ్రీః క్షయం గతా. 63. గోధనం తస్కరైర్నీతం గృహం దగ్ధం ధనం గతం, యత్ర యత్ర స్థితం గేహే తత్ర తత్ర వినాశితమ్. 64. స్వజనైః కలహో నిత్యో వర్జితం భాషితం జనైః, అనంతాక్షేపదోషేణ దారిద్ర్యం చాగతం గృహే. 65. న కైశ్చిద్భాషితం లోకే తేన సార్ధం యుధిష్ఠిర, తతో జగామ కౌండిన్యో నిర్వేదాద్వన గ్వహారమ్. 66. అనన్తం మనసా ధ్యాయన్ కదా ద్రక్ష్యామి కేశవం, ఏవం నిరశనం గుహ్యాం బ్రహ్మచర్యవ్రతం చరన్. 67. ప్రయయౌ విహ్వలః పార్థ అరణ్యం జనవర్జితం, తత్రాపశ్యన్మహాచూతం ఫలితం పుష్పితం తథా. 68. వర్జితం పక్షిసంఘైశ్చ కీటకైశ్చ వివర్జితం, తం పప్రచ్ఛ త్వయాఽనంతః కచ్చిద్దృష్టో మహాద్రుమ. 69. త్వం బ్రూహి సోఽప్యవాచైవం

నానంతం వేద్మ్యహం ద్విజ, ఏవం నిరాకృతస్తేన గాం దదర్శ సవత్సకామ్. 70. తృణమధ్యే ప్రధావన్తీమితశ్చేతశ్చ పాండవ, తామప్యువాచ కౌండిన్యః కిమనన్తస్త్వయేక్షితః. 71. గౌరప్యువాచ కౌండిన్యం నానంతం వేద్మ్యహం ద్విజ, తతో వ్రజన్ దదర్శాగ్రే గోవృషం శాద్వలే స్థితమ్. 72. దృష్ట్వా పప్రచ్ఛ గోస్వామిన్ననంతో వీక్షితస్త్వయా, గోవృషస్తమువాచైనం నానంతం వేద్మ్యహం ద్విజ. 73. తతో వ్రజన్ దదర్శాగ్రే రమ్యం పుష్కరిణీద్వయం, అన్యోన్యం జలకల్లోలైర్వీచీపర్యన్తసఙ్గమమ్. 74. ఛన్నం కుముదకహ్లారైః కుముదోత్పలమండితం, సేవితం భ్రమరైర్హంసైశ్చక్రకారండవైర్బకైః. 75. తేహ్యపృచ్ఛద్ద్విజోఽనంతో యువాభ్యాముపలక్షితః, ఊచతుః పుష్కరిణ్యౌ తు నావాభ్యాముపలక్షితః. 76. తథా వ్రజన్ దదర్శాగ్రే గార్దభం కుఞ్జరం తథా, తావప్యువాచ కౌండిన్యో యువాభ్యాముపలక్షితః. 77. నావాభ్యాం వీక్షితోఽనన్తస్తచ్ఛ్రుత్వా విషసాద హ, తస్మిన్ క్షణే తు నిర్విణ్ణః కౌండిన్యో బ్రాహ్మణోత్తమః. 78. కృపయానన్తదేవోఽపి ప్రత్యక్షస్తత్క్షణాదభూత్, వృద్ధబ్రాహ్మణరూపేణ ఏహ్యేహీత్యుక్తవాన్ ద్విజమ్ 79. ప్రవేశయిత్వా స్వగృహం గృహీత్వా దక్షిణంకరం, స్వాం పురీం దర్శయామాస దివ్యనారీగణైర్యుతామ్. 80. తస్మిన్నివిష్టమాత్మానం వరసింహాసనే శుభే, పార్శ్వస్థం శఙ్ఖచక్రాఢ్యం సదా గరుడసేవితమ్. 81. దర్శయామాస విప్రాయ పూర్వోక్తం విశ్వరూపిణం, విభూతిభిరిహాష్టాభిరనన్తం విశ్వతో ముఖమ్. 82. తం దృష్ట్వా స ద్విజోఽనన్తమువాచ పరయా ముదా, నమో నమస్తే వైకుంఠ శ్రీవత్సపదలాఞ్ఛన. 83.

త్వన్నామస్మరణాత్పాపమశేషం నః ప్రణశ్యతు, నమోనమ స్తే గోవిన్ద నారాయణ జనార్దన. 84. త్వన్నామస్మరణా త్పాపమశేషం నః ప్రణశ్యతు, వరేణ్య యజ్ఞపురుష ప్రజాపాలనతత్పర. 85. ప్రళయాగ్నిసహస్రస్య మోహాద్వీప శతస్య చ, సంసారవార్ధేర్నౌకాయ నమస్తుభ్యం జనా ర్దన. 86. ప్రమాణేన దిశశ్చైవ పాతాళం భూర్భువాదికం, సృజతే బ్రహ్మరూపేణ త్రాయతే విష్ణురూపధృత్. 87. సం హర్త్రే రుద్రరూపేణ నమస్తుభ్యం త్రిమూర్తయే, పాపోఽ హం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః. 88. త్రాహి మాం పుణ్డరీకాక్ష శరణాగతవత్సల, అద్య మే సఫలం జన్మ జీవితం చ సుజీవితమ్. 89. యత్తవాంఘ్రియుగామ్భోజే మన్మనో భ్రమరాయతే, తతస్తుష్టో హ్యనన్తోఽపి దదౌ తస్మై వరత్ర యమ్. 90. దారిద్ర్య నాశనం ధర్మం విష్ణులోకం చ శాశ్వతం, లబ్ధ్వా వరత్రయం విప్రోఽప్యువాచ సురసత్తమమ్. 91. కశ్చూతః కా చ గౌః కోఽపి వృషః కిం తత్సరోద్వయం, కః ఖరః కుఞ్జరః కో వా కో ద్విజో బ్రూహి కేశవ. 92. చూతం విద్ధి మహాన్ విద్వాన్ విద్యాగర్వసమన్వితః, శిష్యేభ్యో న దదౌ విద్యాం తస్మాద్వృక్షోఽభవద్ద్విజః. 93. సా గౌర్ధనాఢ్యో విప్రేభ్యో న దదాతి సుసత్కృతం, అన్నం తస్మాత్తృణంభూమౌ నాస్తి తత్కారణాత్తతః. 94. వృషోఽపి గర్వయుక్తస్సన్ ఉ పరక్షేత్రదో నృపః, ధర్మాధర్మౌ సరోయుగ్మం స ఖరః పరనిం దకః. 95. కుంజరోఽసౌ ద్విజశ్రేష్ఠ ధర్మవిక్రయకో నరః, ఇ త్యుక్తం చ మయా సర్వమనన్తో విప్రరూపధృత్. 96. చ రానంతవ్రతం త్వం చ నవవర్షాణి షట్చ చ, తతస్తుష్టః ప్రదా

స్యామి నక్షత్రస్థానముత్తమమ్. 97. ఇహలోకే తు విపులాన్ సర్వాన్ కామానవాప్నుహి, ఇతి దత్వా వరం దేవస్తత్రైవాంతరధీయత. 98. కౌండిన్యోఽప్యాగతో గేహం చచార వ్రతముత్తమం, శీలయా సహ ధర్మాత్మా భుక్త్వా భోగాన్ యథేప్సితాన్. 99. పుత్రపౌత్రైః పరివృతస్తతో నక్షత్రతాం గతః, కల్పస్థాయీ చ సమ్భూతో దృశ్యతేఽద్యాపి స ద్విజః. 100. కుంభజేన పురా చీర్ణం మర్త్యలోకే ప్రకాశితం, సగరేణ దిలీపేన భరతేన మహాత్మనా. 101. హరిశ్చన్ద్రేణ భూపేన జనకేనాపి పాండవ, ఏతే చాన్యే చ బహవః రాజ్యం భుక్త్వా దివం గతాః, ఏతత్తే కథితం పార్థ వ్రతానాముత్తమం వ్రతమ్. 102. యత్కృత్వా సర్వపాపేభ్యో విముక్తః సుఖమశ్నుతే, యే వై శృణ్వన్తి సతతం పఠ్యమానం నృపోత్తమ, అష్టైశ్వర్యాది భోగాంశ్చ భుక్త్వేఽత్ర స్వజనైః సహ. 103. సర్వపాపైర్వినిర్ముక్తాస్తే యాన్తి పరమాం గతిమ్.

భవిష్యోత్తరపురాణేఽనంతవ్రతకల్పః సమాప్తః.

## అనంతవ్రతకథ

పాండవు లరణ్యవాసముచేయుచు మిక్కిలి కష్టపడుచుండఁగా, వారిని విచారించుటకై శ్రీకృష్ణుఁడు వచ్చెను. పాండవు లందఱు అతనికి వరుసగా నమస్కరించి యాతనికి నుచితాసనమిచ్చి తాము నుగూర్చుండిరి. అప్పుడు ధర్మరాజు శ్రీకృష్ణునిఁ జూచి, ఓజనార్దనా! నేను తమ్ములతోను భార్యతోనుగూడి మిక్కిలి

కష్టపడుచున్నాను. తుదిలేని యట్టి యీ దుఃఖసముద్రమునుండి విడుదలచెందు నుపాయమొక్కటి చెప్పవలయునని ప్రార్థింపఁగా శ్రీకృష్ణుఁడు ధర్మరాజుతో నిట్లనియె.

"ఓధర్మనందనా! అనంతవ్రత మనువ్రత మొకటిగలదు. అయ్యది సకలపాపంబులను బోఁగొట్టి స్త్రీపురుషులకుఁ గోర్కెల నన్నిటి నొసఁగునది. శాశ్వతకీర్తిని, శాశ్వతసంపదను, పెక్కండ్రు పుత్రపౌత్త్రులను అన్నియపేక్షలను నొసంగునట్టిది. ఆవ్రత మును భాద్రపదమాసంబున శుక్లపక్షచతుర్దశినాఁ డాచరింప వలయును. ఆవ్రతము నాచరించుటచే మానవులకు సకలపాపం బులు తొలఁగును."

అని శ్రీకృష్ణుఁడు చెప్పఁగా, ధర్మరాజు కృష్ణుని జూచి, "ఓకేశవా! నీవు అనంతుఁడని చెప్పితివికదా, ఆయనంతుఁ డెవ్వఁడు? ఆదిశేషుఁడా! తక్షకుఁడా! పరమాత్మయా! లేక బ్రహ్మదేవుఁడా! ఈయనంతుఁ డనువాఁ డెవ్వఁడు; నాకు వాస్త వము నెఱిఁగింపుము" అని యడుగఁగా, శ్రీకృష్ణుఁడు వెండియు నతనితో నిట్లనియె.

ఓకుంతీపుత్త్రుఁడా! నేనే యాయనంతుఁడను. నేనే విశ్వ రూపుఁడ నని నీకుఁ దెలియునుగదా. సూర్యునిసంచారముచే కళ, కాష్ఠ, ముహూర్తము, పగలు, రాత్రి, పక్షము, నెల, ఋతువు, అయనము, సంవత్సరము అనుభేదములు గల యేకా లము ఏర్పడుచున్నదో అది నేనే. అట్టియనంతుఁడ నైన నేను సకలరాక్షసులను సంహరించి భూభారము తగ్గించుటకై భూలోకంబున వసుదేవునికులంబునఁ బుట్టితిని. నేనే అనంతుఁ

డను; కృష్ణుఁడను; ఇంద్రుఁడను; విష్ణువను, శివుఁడను, బ్రహ్మను; సూర్యుఁడను; ఆదిశేషుఁడను; సర్వవ్యాపినైయుండు ఈశ్వరుఁడను. సకలప్రపంచము నారూపమే, నేను గొప్పరూపంబుగలవాఁడను. సృష్టిస్థితిలయంబులకుఁ గారణభూతుఁడను. అనంత పద్మనాభుఁడను; నరసింహవామనావతారముల నెత్తినవాఁడను నేనే. ముందే నమ్మకము కలుగుటకుఁగానే నేను అర్జునునికి నావిశ్వరూపంబు చూపితిని. నేనే పరబ్రహ్మస్వరూపుండను. నన్నే యోగులు ధ్యానింతురు. ఈ ప్రపంచమెల్ల నాస్వరూపమే. నాకు అంతములేదు. నాయందే పదునలుగురు మనువులును, అష్టవసువులును, పన్నిద్దరు సూర్యులును, పదునొకండుగురు రుద్రులును, సప్తఋషులును, సముద్రములును, పర్వతములును, నదులును, వృక్షములును. నక్షత్రములు, దిక్కులు, భూమి, పాతాళము, భూర్భువరాదిలోకములును నున్నవి. ఓయుధిష్ఠిరా! యీవిషయమున నీకు సంశయమే వలదు. అన్నియు నేనే" అని చెప్పెను.

ఆపలుకులు విని, ధర్మరాజు "ఆవ్రతము నాచరించిన నేమి పుణ్యము? ఏమిఫలము? దాని కేమి యివ్వవలయును? ఏ దేవతను బూజింపవలయును. ఎవఁడీవ్రతమును ముం దాచరించెను? ఎట్లు మనుష్యలోకంబున వెల్లడియయ్యెను? ఈసంగతియెల్ల విస్తరించి చెప్పుము" అని యడుగఁగా, శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకు ని ట్లనెను.

పూర్వము కృతయుగంబున సుమంతుఁడనియొక బ్రాహ్మణుఁ డుండెను. ఆతఁడు వసిష్ఠగోత్రమునఁ బుట్టినవాఁడు. ఆవిప్రుఁడు చక్కనిరూపంబుగల భృగువంశంబునఁ బుట్టిన దీక్ష యనుకన్యక నొకదానిని విధిప్రకారముగాఁ బెండ్లియాడెను. కొంతకాలము

నను చక్కని లక్షణములుగల శీల యనుపేరుగల కన్యక పుట్టెను. ఆచిన్నబిడ్డ చక్కనినడతగలదై తల్లియింట దినదిన ప్రవర్ధమానయై యుండెను. ఆచిన్నబిడ్డకు తల్లియగు దీక్ష జ్వరముచేఁ గష్టపడి, నానాటికిఁ జిక్కి నదీతీరంబున మృతినొంది స్వర్గలోకంబునకుఁ బోయెను. తర్వాత సుమంతుఁడును అగ్ని హోత్రాదికార్యములు లేకపోవునను భీతిచేత చెడుస్వభావంబు గలదియు, క్రూరురాలును, ఎల్లప్పుడు జగడములాడునదియునైన కర్కశయను పేరుగల కన్యను బెండ్లిచేసికొనెను. ఆశీలయన్నను తనతల్లి చనిపోవుటచేత నింటిపనులు చూచుటయందు శ్రద్ధ గలదై, గోడలకు, స్తంభములకు, చిన్నిగోడలకు, కడపలకు, మొత్తలకుఁ బంచవన్నె ముగ్గులను బెట్టుచుఁ గమలములను స్వస్తికములను వేయుచు దేవపూజలు చేయుచుండెను. తండ్రి యగు సుమంతుఁడును తనకూఁతునకు యౌవనవుచిన్నెలు వచ్చుటను చూచి ఈకన్య నెవనికిత్తునని యాలోచనచేయుచుం డెను. అప్పుడు కౌండిన్యుఁడను ఒకమహాముని సకలవిద్యలను జదివి గురునాజ్ఞను బొంది పెండ్లిచేసికొనుటకై వచ్చుచుండెను. సుమంతుఁడును తనకూఁతు నాయన కియ్యవలసినదని నిశ్చయిం చెను. అట్లు నిశ్చయించి, కౌండిన్యమహామునికిఁ దనకూఁతు నిచ్చి తనశాఖప్రకారము పెండ్లిచేసి, పెండ్లియయినతర్వాత, తనభార్యయగు కర్కశను బిలిచి "అల్లునికి బహుమతిగా సారె పెట్టి పంపవలయును, "ఏమియున్నది" యనియడుగఁగా, ఆకర్కశ యాబ్రాహ్మణుని మాట విని మిక్కిలి చిరాకుతో లోపలికి వచ్చి తలుపు టంగున బిగించి, "పోపో" యని పలికెను. అంత నా సుమంతుఁడు మిగిలినసత్తుపిండి నిచ్చి తనయల్లుని, కుమార్తెను సాగనంపెను.

కౌండిన్యమునియు ఈశీలను బెండ్లియాడి యాక్రొత్త పెండ్లికూఁతు రగుశీలను బిలిచికొని, యెద్దులబండినెక్కి మెల్ల మెల్లఁగాఁ బోవుచు, మధ్యాహ్న వేళకు ఒక కొలనికడఁ జేరి, మాధ్యాహ్నిక క్రియలుచేయుటకై కొలనికిఁ బోయెను. శీలయు నదీతీరమున నెఱ్ఱని పట్టువస్త్రంబులను గట్టుకొన్న వారలై చతుర్దశి నాఁడు వేఱువేఱుగా భగవంతుని పూజసేయుచుండు స్త్రీలను జూచెను. మెల్లఁగా వారికడకు వచ్చి "యి దేని వ్రతము? దీని పేరేమి? చెప్పుఁడు" అని స్త్రీల నడిగెను. వారును ఇదియనంత వ్రతమని చెప్పఁగా, శీల "నేనును జేసెదను. ఈ వ్రతముచేయు విధాన మెట్లు ఎచ్చట ఏ దేవునిఁ బూజింపవలయును? ఓపుణ్య కాంతలారా! నా కీవృత్తాంతమంతయు నెఱిఁగింపుఁడు" అని యాస్త్రీలను మఱల నడిగెను. వారును "ఓశీలా! ఈ వ్రతము భాద్రపద శుద్ధచతుర్దశినాఁ డాచరింపవలయును. ఆ దినంబున అనంతపద్మనాభస్వామిని నదీతీరంబునఁ బూజించి, ఆతనికథను వినవలెను. పూజావిధానం బెట్లనిన, నదియందు స్నానముచేసి యిష్టదేవతలకు నమస్కరించి, పరిశుద్ధములైన బట్టలను గట్టికొని, యొకపరిశుద్ధ ప్రదేశమున గోమయముతో నలికించి, సర్వతో భద్రమనుపేరుగల మండలముచేయించి, దానినడుమ దిమ్మెలతోఁ గూడిన యెనిమిదిఱేకులుగలపద్మమును నిర్మించి, దానిచుట్టును తెల్లబియ్యపుపిండితోను, పంచవర్ణముగ్గులతోను, ముగ్గులు పెట్టించి, యామండలమునకుఁ గుడివైపునఁగలశము నుంచి దాని నడుమ సర్వవ్యాపకుఁడయినట్టి యనంతపద్మనాభస్వామిని యివ్విధ ముగా ధ్యానింపవలయును. శ్వేతద్వీపమునం దున్నట్టి యనం తుని దర్భతోఁజేసి యేడుపడగలు పెట్టి, పచ్చనికన్నులనుంచి, నాలుగు చేతులుంచి, నాలుగు చేతులలో కుడివైపునందలిపై చేతి

యందు పద్మమును, క్రిందిచేతియందు శంఖమును, ఎడమవైపు నందలి పై చేతియందు చక్రమును, క్రిందిచేతియందు గదను నున్నట్లుగా భావించి కుంభమునందును, మండలమునందును, ప్రతిమయందును బూజింపవలయునని బ్రహ్మవేత్త లగువారు పలుకుదురు. అట్లు అనంతపద్మనాభస్వామిని కుంభమండప ప్రతిమలం దావాహనముచేసి దివ్యపుష్పములచేతను, ధూపదీప ములచేతను వేలువేలుగా పదునాలుగువిధములైన నైవేద్య ములు చేసి, యాయనంతపద్మనాభస్వామికలశమునకు ముందట పదునాలుగుముళ్లువేసిన గట్టిక్రొత్తతోరమును కుంకుమమందు తడిపియుంచి, దానిని పూజించవలెను. అట్లు పూజించినతర్వాత నైదుపళ్లగోధుమపిండితో బెల్లముగలిపిన యిరువదియెనిమిది యతిరసములను జేసి, చేసినవానిలో సగము బ్రాహ్మణునికి వాయన మిచ్చి దక్కినసగమును దాను దనయిష్టబంధువులతోడ భుజింప వలసినది. ఈవ్రతమునందు పూజాసామగ్రులన్నియుం బదు నాలుగేసి యుండవలెను. ఇట్లు పూజసేసి, యనంతపద్మనాభ స్వామిని జక్కఁగా ప్రార్థించి, పిదప బ్రాహ్మణులకు భోజనంబిడి, పిదప తానును సంతోషముతో భుజించి వ్రతముచేయవలెను. ప్రతిసంవత్సరమునను ఈవ్రతమును బ్రయత్నముతోచేసి ప్రతి యేట క్రొత్తతోరమును కట్టుకొనవలసినది. పదునాలుగవసంవత్స రమున ఉద్యాపన చేయవలసినది" అని యాపుణ్యకాంతలు చెప్పఁగా, బుద్ధిమంతురాలగుశీల వారిసాహాయ్యముచేత నా వ్రతమునుచేసి, క్రొత్తతోరమును కట్టుకొని తాను దారిబత్తె మునకై తెచ్చిన సత్తుపిండిని బ్రాహ్మణునికి వాయనమిచ్చి, తానును భర్తతోడ భుజించి పయనమై తనయాశ్రమంబునకుఁ

బోయెను. ఆక్షణముననె ఆయనంతుని ప్రసాదమున నష్టైశ్వర్య సంపదయుఁ గలిగెను. ఆమహర్షి యాశ్రమము కలిమిగలదై కాంతితోఁగూడి, యతిథిసత్కారములచే శోభిల్లుచు శాంత మృగంబులతోఁ గూడుకొని ప్రకాశించుచుండెను. ఆశీలయు సకలభూషణములను ధరించినదై మేలిమివస్త్రమును గట్టినదై సావిత్రితో సమానురాలై యుండెను. ఆమెకలిమిని జూచి, బంధువులందఱు "అనంతపద్మనాభస్వామి యనుగ్రహముచే నీమె కింతటి కలిమి వచ్చినది" యని సంతోషముతోఁ జెప్పుకొను చుండిరి. ఆవిధముగానీవ్రతంబుభూలోకంబున ప్రసిద్ధిఁగాంచెను.

తర్వాత నొక్కనాఁడు దుష్టబుద్ధి యగు కౌండిన్యుఁడు శీల చేతఁగట్టుకొనియున్న తోరమును జూచి, "ఓసీ! శీలా! యిదియేమిత్రాడు? ఎవరిని వశపఱచుకొనుటకై కట్టుకొన్నావు? నన్నా? లేక మఱియెవనినైననా? వాస్తవము చెప్పుము" అని శీల నడుగఁగా, "అనంతపద్మనాభస్వామిని ధరించితిని. ఆయనంత పద్మనాభుని దయవలననే మనకు ధనధాన్యములు మొదలగు సకలసంపదలు గలిగెను. ఈతోరమును కట్టుకొన్నవారికి సకల సంపదలు గలుగును గనుక నేనును గట్టుకొంటి నని చెప్పఁగా, ఆ కౌండిన్యుఁ డామాటవిని అనంతుఁడని యొక్కఁడు గలఁడా, యని యాశీలను కోపముతో ధిక్కరించి, యాతోరమును త్రెంపి ధగధగమండుచున్న నిప్పులోఁబడవైచెను. శీల హాహాకారము చేయుచుఁ బరుగెత్తి యాతోరమును ఎత్తి పాలలో వేసెను. ఆకౌండిన్యుని దుష్టకర్మఫలముచేత నాతనిసంపదయెల్ల నానాఁటికి నశించెను. ఆతనిపశులను దొంగలు తోలుకొనిపోయిరి. ఇల్లు కాలిపోయెను. అతఁ డెచ్చటెచ్చటఁబెట్టినవస్తు వచ్చటచ్చటనే

మాయమైపోయెను. బంధువులు నిత్యము కలహింపఁ దొడఁగిరి. ఇరుగుపొరుగువారు మాటలాడుట విడిచి పెట్టిరి. ఇంట దారిద్ర్యము తట్టుముట్టాడఁ దొడఁగెను. ఒకరైనను లక్ష్యపెట్టి యతనితో మాటాడుట మానిరి. అంతట కౌండిన్యుఁడు మిక్కిలి విచారము నొంది, యడవికిఁ బోయి, అనంతునే మనసునందు చింతించుచు, "ఆయనంతుని నే నెప్పుడు చూతును? అతనినిఁ జూచువఱకు నాకేమియు నక్కఱలేదు." అని ప్రతిజ్ఞచేసి, యాహారమును నిద్రను విడిచి కఠినమైన బ్రహ్మచర్యవ్రతంబు పూని, విచారముతోఁ గూడి నిర్మానుష్యమైన యడవిలోఁ బ్రయాణమై పోవుచుండెను. అట్లు పోవునప్పుడు ఒకమామిడి చెట్టును జూచెను. ఆచెట్టు పూవులు పూచి పండ్లు కాయలు గలదై యున్నను, ఒకపక్షిగాని, ఒకపురుగుగాని వాలకయుండెను. అట్టిచెట్టునుజూచి, "ఓవృక్షములలో గొప్పదానా! నీవనంతుని జూచితివా" అని యడుగఁగా, అది "నే నతఁడెవ్వఁడో యెఱుఁగ"నని చెప్పెను. తర్వాత బ్రాహ్మణుండు మఱికొంత దూరముపోయి, యచ్చట మోఁకాలియంత యెత్తుగడ్డిలో నిలిచియున్నను ఆగడ్డి నిదినక యీతట్టునకాతట్టునకు తిరుగుచున్న ఆవును, దానిదూడను జూచి, "మీ రనంతునిఁ జూచితిరా" యనియడుగఁగా, అది మాకుఁ దెలియదనెను. మఱి కొంత దవ్వేఁగి, పచ్చికగలబీడులో నిలఁబడియున్న యెక్కఱెద్దును, పిదప తామరపువ్వులు కలువలును, తుమ్మెదలను, హంసలను, చక్రవాకపక్షులను, నీరుకోళ్లను, కొంగలునుగలిగి శోభాయమానములై యొక్కదానినుండి మఱొక్కదానికిఁ బోఱలుచున్న నీటితోఁగూడిన రెండుకొలకులును, వానికివెనుక నొకగాడిదెను ఒకఏనుఁగును జూచి, చూచినవారినెల్ల "మీరనం

తునిఁ జూచితిరా ! మీరనంతునిఁజూచితిరా" యని యడుగుచు బోయెనుకాని, అవియన్నియు "మేము చూడలేదు. మేము చూడలే" దనియే ప్రత్యుత్తరమిచ్చుచుఁ బోయినవి. అంతట బ్రాహ్మణుఁడు మిక్కిలి యలసి, యుస్సురని నిట్టూర్పువిడిచి యొక చోటఁ గూర్చుండెను. అప్పు డనంతపద్మనాభుఁ డాభూదేవుని యందు మిక్కిలి జాలిగొని యొకముసలిబ్రాహ్మణునిరూపముతో వచ్చి నిలఁబడి, "యో బ్రాహ్మణోత్తమా! ఇటురమ్ము. నేను నీకనంతునిఁ జూపెదను." అనిచెప్పి యాతనికుడిచేయిపట్టుకొనిపోయి, యప్సరస్త్రీలతోఁగూడిన తనపురంబును జూపించి, యందు శంఖ చక్రములను ధరించి, గరుడునినెక్కి కూర్చుండియున్నను, ఎని మిదివిధంబులైన యైశ్వర్యములచే వెలయుచు సర్వాంతర్యామియునై యున్న యనంతపద్మనాభస్వామి రూపుండైన తన్నుఁ జూపెను. ఆకౌండిన్యుఁ డాయనంతునిఁ జూచి యెక్కువ యానందమునొంది యివ్విధంబున స్తోత్రముచేసెను. "ఓవైకుంఠవాసా! శ్రీవత్సలాంఛనా ! నీకుఁ బలుమారు మ్రొక్కెదను. ఓ గోవిందా! ఓజనార్దనా! ఓనారాయణా! ఓయజ్ఞపురుషా! సుజన సంరక్షకా! తమ నామస్మరణమువలన నాపాపములన్నియు నశించునుగాక. ప్రళయములనెడు బడబాగ్నులుగలిగి, మోహములనెడి పెక్కు దీవులుగలిగియున్న సంసారసముద్రమునకు తెప్పవై భక్తులను దరిచేర్చునట్టివాఁడవును, భూమిని, దిశలను, పైక్రింది లోకములను వానిప్రమాణానుసారముగా బ్రహ్మరూపమెత్తి సృజింపుచు, విష్ణురూపమునెత్తి తాను సృజించినభూతములను గాపాడుచు, రుద్రరూపమెత్తి వానినెల్ల లయింపఁజేయుచు నివ్విధంబునఁద్రిమూర్తిస్వరూపుఁడవై యున్న నీకు నమస్కారము.

నేనుపాపుఁడను. పాపపుఁబనులుచేయువాఁడను. పాపపు బుట్టుక గలవాఁడను. శరణుచొచ్చినవారిని గాపాడునట్టి యోపుండరీ కాక్షా! నన్ను రక్షింపుము. ఈదినమున నాజన్మము సార్థక మయ్యెను. కావుననే నామనస్సు నీపాదములందు కమలమందు తుమ్మెదచేరియున్నట్లు చేరియున్నది. ఓదేవా! నేనిఁక మిమ్మెన్నటి కిని మరువను." అని యివ్విధంబున భగవంతుని స్తోత్రము చేయఁగా, భగవంతుఁడు సంతుష్టుఁడై యాబ్రాహ్మణునికి ఇహ లోకమున సంపదను, ధర్మబుద్ధిని, పరమున శాశ్వతమైనమోక్ష మును అను ఈమూఁడువరంబుల నొసఁగెను. ఆ బ్రాహ్మణుఁడు తానావరంబులను బొంది, "యోమహాత్మా! నేను దారిలో చూచిన మామిడిచెట్టేమిటిది? యాఆవుఏది?ఆయెద్దేది? ఆకొలఁకు లేవి? ఆగాడిదఏది? ఆయేనుఁగేది? ఆముసలిబ్రాహ్మణుఁ డెవ్వఁడు? ఓకేశవా! వానిసంగతియేమి చెప్పుఁ"డని యడిగెను.

"ఓ బ్రాహ్మణా! పూర్వజన్మమున ఒకబ్రాహ్మణుఁడు గొప్ప విద్వాంసుఁడయ్యు శిష్యులకు విద్యచెప్పక గర్వించియుండెను. గనుక, అతఁడడవిలో నెవరికి నుపయోగపడని యట్టి మామిడి చెట్టుగాఁ బుట్టినాఁడు. జన్మాంతరమున నొకధనికుఁడు విప్రులకు ఎన్నఁడుమర్యాదసేసియన్నముపెట్టినవాఁడుగాఁడుగనుక, గడ్డిలో నిలుచున్నను ఆగడ్డిని తినుటకు నోరాడని యొక ఆవుగాఁ బుట్టి నాఁడు. తొల్లి చవిటిచేనిని బ్రాహ్మణులకు దానముచేసినయొకరాజు వృషభమైపుట్టి తిరుగుచున్నాఁడు. ఆకొలఁకులు రెండును ధర్మా ధర్మములు. పరనిందచేసినవాఁ డాగాడిద. పెద్దలుంచినధర్మపు సొత్తును అమ్మినవాఁ డాయేనుగు. నీకుఁ బడుగుగాఁ గనబడిన బ్రాహ్మణుఁడు అనంతపద్మనాభస్వామినైననేనే. ఓద్విజోత్తమా! నీప్రశ్నలకెల్ల నుత్తరమిచ్చితిని. నీవును ఈవ్రతంబును పదునాలు

గేంద్లు చేయుము. అటుపిమ్మట నేను నక్షత్రస్థానము నొసఁగెదను. నీవీలోకంబున సకలసుఖంబుల ననుభవింతువుగాక" అని యనంతుఁడు వరంబొసంగి, యచ్చటనే యంతర్ధానమొందెను. తర్వాత కౌండిన్యుఁ డింటికివచ్చి, యుత్తమమైనయనంతవ్రత మాచరించి, యిహలోకంబున సకలసుఖంబుల ననుభవించి, పరంబున నక్షత్రస్థానమును సకుటుంబముగాఁ బొంది, కల్పాంతరస్థాయియై యిప్పటికిని నక్షత్రమండలమునందుఁ గనఁబడుచున్నాఁడు. ఓధర్మనందనా! తొల్లి యగస్త్యుఁ డీవ్రతంబునాచరించి మనుష్యలోకంబున వ్యాపింపఁజేసెను. సగరుఁడు, భరతుఁడు, దిలీపుఁడు, హరిశ్చంద్రమహారాజు, జనకమహారాజును, మఱియు ననేకులు రాజులు ఈవ్రతంబాచరించి రాజ్యంబుననుభవించి, స్వర్గలోకంబు నొందిరి. ఓధర్మనందనా! సకలజనులను కష్టములనుండి తొలఁగించి కాపాడునట్టి యుత్తమవ్రతంబును నీకెఱిఁగించితిని. నీవును ఈవ్రతంబు నాచరించితివేని, నీకష్టములు తొలఁగును. ఎవరీ కథను చదువుచున్నారో, ఎవరు వినుచున్నారో, వారీలోకంబున నష్టైశ్వర్యసంపద ననుభవించి సకలపాపములఁ బాసినవారలై పరంబున నుత్తమగతిని బొందుదురు.

శ్రీభవిష్యోత్తరపురాణంబున అనంతవ్రతకథ సంపూర్ణము.

# గరుడపంచమీ వ్రతము



'శుక్లాంబరధరమిత్యాదిధ్యానమ్ గణాధిపతయే నమః, ఇత్యుక్త్వా ప్రాణానాయమ్య. ఓంభూః...వరోమ్.మమ ఉపాత్త సమస్తదురితక్షయద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభనే ముహూర్తే...,నామవత్సరే దక్షిణాయనే వర్షర్తౌ శ్రావణమాసే శుక్లపక్షే పఞ్చమ్యాం...వాసర నక్షత్రయుక్తాయామస్యాం శుభతిథౌ అస్మాకం సహకుటుంబానాం క్షేమస్థైర్యవిజయాయు రారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం దీర్ఘసుమఙ్గలీత్వసిద్ధ్యర్థం సమస్త మఙ్గలావాప్త్యర్థం వర్షే వర్షే పూజ్యమానాం ఫణిగౌరీదేవతా ముద్దిశ్య ఫణిగౌరీదేవతా ప్రీత్యర్థం యావచ్ఛక్తిషోడశోపచార పూజాం కరిష్యే. (కలశపూజ, గణాధిపతిపూజ, ఫణిగౌరీ ప్రాణప్రతిష్ఠ ఇవి యొకటివెంబడి నొకటి చేయవలయును. వీనివిధానము వినాయక వ్రతమునందుఁ జూడుఁడు.)

## ఫ ణి గౌ రీ పూ జా

ఆగచ్ఛ దేవదేవేశి శంకరార్ధశరీరిణి,
ఆవాహయామి భక్త్యా త్వాం ఫణిగౌరి నమోఽస్తు తే.

ఫణిగౌరీదేవతాయై ఆవాహనం సమర్పయామి.

మాణిక్యవజ్రవైడూర్యనీలరత్నాదిశోభితం,
రత్నసింహాసనం దివ్యం గృహాణ పరమేశ్వరి.

ఫణిగౌరీ...ఆసనం సమర్పయామి.

గఙ్గాగోదావరీతోయం కృష్ణవేణీసముద్భవం,
అర్ఘ్యం దాస్యామి తే దేవి ఫణిగౌరి నమోఽస్తు తే.
ఫణిగౌరీ...అర్ఘ్యం సమర్పయామి. మధుపర్కంచ సమర్పయామి.

పయోదధిసమాయుక్తం ఘృతశర్కరసంయుతం,
పఞ్చామృతైః స్నానమిదం గృహాణాసురమర్దని
ఆపోహిష్ఠామయో భువః...చనః.

ఫణిగౌరీ...న్యై శుద్ధోదకస్నానం సమర్పయామి.

రక్తపీతమయం వస్త్రం దుకూలం చ మనోహరం,
మయా దత్తమిదం వస్త్రం ధార్యతే భండమర్దని.
ఫణి...న్యై వస్త్రయుగ్మం సమర్పయామి.

బ్రహ్మసూత్రం శుభ్రమిదం త్రిగుణం త్రిగుణైర్యుతం,
బ్రహ్మగ్రన్థియుతం దేవి ఫణిగౌరి నమోఽస్తు తే.
ఫణిగౌరీ...యజ్ఞోపవీతం సమర్పయామి.

మంత్రము— గౌరీమిమాయసలిలానితక్షత్యేకపదీద్విపదీసా చతుష్పదష్టాపదీ నవపదీ బభూవుషి సహస్రాక్షరాపరమే వ్యోమన్.

ఫణి...న్యై కుఙ్కుమాదిపరిమళద్రవ్యాణి సమర్పయామి.

ముక్తామాణిక్యవైడూర్యరత్నహేమాదినిర్మితం,
దివ్యమాభరణం దేవి గిరిజాయై నమోఽస్తు తే.
ఫణిగౌ...న్యై ఆభరణాని సమర్పయామి.

శ్రీగన్ధం చన్దనోన్మిశ్రం కస్తూర్యాదిసమన్వితం,

గన్ధం గృహాణ దేవేశి మయా దత్తమిదం శుభే.
ఫణిగౌ...య్యై గంధాన్ ధారయామి.
అక్షతాన్ ధవళాకారాన్ శాలీతణ్డులమిశ్రితాన్,
హరిద్రాచూర్ణసంయుక్తాన్ ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్.
ఫణి...య్యై అక్షతాన్ సమర్పయామి.
చామన్తికావకుళచమ్పకపాటలాబ్జైః
పున్నాగజాజికరవీరరసాలపుష్పైః,
బిల్వప్రవాళతులసీదళమల్లికాద్యైః
త్వాం పూజయామి జగదీశ్వరి తే పదాబ్జే.
ఫణి...య్యై పుష్పాణి పూజయామి.

## అథ అఙ్గపూజా

| | | | |
|---|---|---|---|
| శివాయై | నమః | పాదౌ | పూజయామి. |
| భవాన్యై | ,, | గుల్ఫౌ | ,, |
| రుద్రాణ్యై | ,, | ఊరూ | ,, |
| శర్వాణ్యై | ,, | జఙ్ఘే | ,, |
| సర్వమఙ్గళాయై | ,, | కటిం | ,, |
| అపర్ణాయై | ,, | స్తనౌ | ,, |
| మృడాన్యై | ,, | కణ్ఠం | ,, |
| చణ్డికాయై | ,, | బాహూ | ,, |
| ఆర్యాయై | ,, | ముఖం | ,, |
| సత్యై | ,, | నాసికాం | ,, |
| సునేత్రాయై | ,, | నేత్రే | ,, |
| సుకర్ణాయై | ,, | కర్ణే | ,, |

మేనకాత్మజాయై నమః లలాటం పూజయామి.
ఫణిగౌర్యై ,, శిరః ,,
మహాగౌర్యై ,, సర్వాణ్యఙ్గాని ,,

అథ అష్టోత్తరశత (108) నామావళిః.

"నమః" అని ప్రతినామముకడఁ జేర్పవలయును.

ఓమ్ మహాగౌర్యై నమః
మహాదేవ్యై
జగన్మాత్రే
సరస్వత్యై
చణ్డికాయై
లోకజనన్యై
సర్వదేవాదిదేవతాయై
పార్వత్యై
పరమాయై
ఈశాయై 10
నగేన్ద్రతనయాయై
సత్యై
బ్రహ్మచారిణ్యై
శర్వాణ్యై
దేవమాత్రే
త్రిలోచన్యై
బ్రహ్మాణ్యై
వైష్ణవ్యై
రౌద్ర్యై
కాలరాత్ర్యై 20
తపస్విన్యై
శివదూత్యై
విశాలాక్ష్యై
చాముణ్డాయై
విష్ణుసోదర్యై
చిత్కళాయై
చిన్మయాకారాయై
మహిషాసురమర్దిన్యై
కాత్యాయన్యై
కాలరూపాయై 30
గిరిజాయై
మేనకాత్మజాయై
భవాన్యై
మాతృకాయై
గౌర్యై
రమాయై

కామాయై
శుచిస్మితాయై
బ్రహ్మస్వరూపిణ్యై
రాజ్యలక్ష్మ్యై
శివప్రియాయై
నారాయణ్యై
మహాశక్త్యై
నవోఢాయై
భాగ్యదాయిన్యై
అన్నపూర్ణాయై
సదానన్దాయై
యౌవనాయై
మోహిన్యై
జ్ఞానశుద్ధ్యై
జ్ఞానగమ్యాయై
నిత్యానిత్యస్వరూపిణ్యై
కమలాయై
కమలాకారాయై
రక్తవర్ణాయై
కళానిధయే
మధుప్రియాయై
కల్యాణ్యై
కరుణాయై
జనస్థానాయై
వీరపత్న్యై
విరూపాక్ష్యై
విరాజితాయై
40 హేమాభాయై
సృష్టిరూపాయై
సృష్టిసంహారకారిణ్యై
రఞ్జనాయై
యౌవనాకారాయై
పరమేశ్వరప్రియాయై
పరాయై 70
పుష్పిణ్యై
పురుషాకారాయై
మహారూపాయై
మహారౌద్ర్యై
50 మహాపాతకనాశిన్యై
కామాక్ష్యై
వామదేవ్యై
వరదాయై
భయనాశిన్యై
వాగ్దేవ్యై
వచస్యై
వారాహ్యై
విశ్వమోహిన్యై
పర్ణనిలయాయై
60 విశాలాక్ష్యై
కులసమ్పత్ప్రదాయిన్యై

ఆర్తదుఃఖచ్ఛేదదక్షాయై
అమ్బాయై
నిఖిలయోగిన్యై
సదాపురస్థాయిన్యై ౯౦
తరోర్మూలతలంగతాయై
హరవాహసమాయుక్తాయై
మునిమోక్షప్రదాయై
ధరాధరభవాయై
ముక్తాయై
పురమన్త్రాయై
వరప్రదాయై
కార్యై
వాగ్భవ్యై
దేవ్యై 100
క్లీంకార్యై
సంవిదే
ఈశ్వర్యై
హ్రీంకారాక్షరబీజాయై
శాంభవ్యై
ప్రణవాత్మికాయై
శ్రీమహాగౌర్యై

ఫణిగౌరి...యై అష్టోత్తరశతనామపూజాం సమర్పయామి.

వనస్పత్యుద్భవైర్దివ్యైః...ప్రతిగృహ్యతామ్.

ఫణిగౌర్యై ధూపమాఘ్రాపయామి.

భక్త్యా దత్తం మయా దీపం త్రివర్తిఘృతసంయుతం,
అన్ధకారనివృత్త్యర్థం గృహాణాజ్ఞాననాశిని.

ఫణి...యై దీపం దర్శయామి.

భక్ష్యైర్భోజ్యైః సచోష్యైశ్చ పరమాన్నం సశర్కరం,
నైవేద్యం గృహ్యతాం దేవి శమ్భుపత్ని నమోఽస్తుతే.

ఫణిగౌరీ...యై నైవేద్యం సమర్పయామి.

పూగీ......గృహ్యతామ్.

ఫణి...తామ్బూలసువర్ణపుష్పదక్షిణాః సమర్పయామి.

మంత్రము. మానో హింసీర్జాతవేదో గామశ్వం పురుషం జగత్, అబిభ్రదగ్న ఆగహి శ్రియా మా పరిపాతయ.

ఫణి...య్యై నీరాజనం దర్శయామి.

జాతవేదసే, సునవామ సోమమరాతీయతో నిదహాతి వేద, సనఃపరుషదతిదుర్గాణి విశ్వా నావేవ సిన్ధుందురితాత్యగ్నిః.

ఫణి...య్యై మన్త్రపుష్పం సమర్పయామి.

యానికాని—పదేపదే, ఫణి...య్యై ఆత్మప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి.

ఫణిగౌరి నమస్తేఽస్తు కైలాసనిలయే! స్థితే,
లోకమాతర్నమస్తుభ్యం సౌభాగ్యం దేహి మే సదా.

**ఫణిగౌరీదేవతా ప్రార్థనా.**

దశగ్రన్థిసమాయుక్తం కుఙ్కుమాక్తం సుదోరకం,
కరే బధ్నామి వరదే తవ ప్రీతికరం శుభమ్.

తా. దోరమును పదిముళ్లువేసి పూజచేసి కట్టుకొనవలయును.

ఫణిగౌరీ చ గృహ్ణాతు ఫణిగౌరీ దదాతి చ,
తారకా ఫణిగౌరీ చ ఫణిగౌరి నమోఽస్తు తే.

తా. ఈశ్లోకముచెప్పి బ్రాహ్మణునికి వాయనము నియ్యవలయును. తర్వాత ఫణిగౌరికి పునఃపూజచేయవలయును.

యస్య స్మృత్వాచ...భక్తిహీనం మహేశ్వరి,
యత్పూజితం మయా దేవి పరిపూర్ణం తదస్తు తే.

అనేక కల్పోక్తప్రకారేణ కృతేన పూజావిధానేన ఫణిగౌరి దేవతా సుప్రసన్నా వరదా భవతు.

ఫణిగౌరీపూజావిధానం సమాప్తమ్.

## కథా ప్రారంభము

సూత ఉవాచ. శ్లో. శృణుధ్వం మునయః సర్వే వ్రతానా ముత్తమం వ్రతం, యస్యానుష్ఠానమాత్రేణ నారీ మఙ్గలతో భవేత్. 1. భ్రాతృమత్యా చ కర్తవ్యం పఞ్చమీ వ్రతముత్తమం, శుక్లే శ్రావణికే మాసే పంచమ్యాం చ శుభే దినే. 2. సువాసినీవ్రతమిదం కుర్యాద్దశసు వత్సరాన్. శౌనకఉవాచ. సూత సూత మహాప్రాజ్ఞ యాదృశం వ్రతముత్తమం, శ్రద్ధధానాయ మహ్యం త్వం బ్రూహి తద్వదతాంవర. 3. సూతఉవాచ. యయా కయా సువాసిన్యా భ్రాతృమత్యా విశేషతః. 4. శ్రావణే మాసి సంప్రాప్తే పంచమ్యాం ప్రాతరుత్థితా, నారీ సుమంగళద్రవ్యై ర్హారిద్రాచూర్ణసంయుతైః. 5. కృత్వా తు మఙ్గలస్నానం ధౌత వస్త్రాణి ధారయేత్. 6. తతః ఫలసుమాద్యైశ్చ మణ్డపం చ ప్రకల్పయేత్, తతో మణ్డపమధ్యే తు రఙ్గవల్లీం చ కారయేత్. 7. తన్మధ్యే చాసనం దివ్యం సంస్థాప్య చ యథాక్రమం, తస్మింస్తు తణ్డులం న్యస్య కుసుమాక్షతసంయుతమ్. 8. స్వర్ణేన రాజతేనాపి తామ్రేణాపి కృతః ఫణీ, అథవా మృణ్మయేనాపి విత్త శాఠ్యం న కారయేత్. 9. ఫణేర్మధ్యే చ గౌరీం తాం ధ్యానే నావాహనాదిభిః, పఞ్చామృతైః పఞ్చగవ్యైర్వస్త్రైరాభరణైః శుభైః. 10. గన్ధాక్షతైః పుష్పమాల్యైర్ధూపదీపైః ప్రపూజ యేత్, నైవేద్యం షడ్రసోపేతైర్భక్ష్యైర్భోజ్యైశ్చ లేహ్యకైః. 11. తామ్బూలస్వర్ణపుష్పాది మన్త్రపుష్పైః ప్రపూజయేత్, తతః ప్రదక్షిణం కుర్యాన్నమస్కారాదిపూర్వకమ్. 12. దశగ్రంథియుతం దివ్యం దోరకం చ ప్రపూజయేత్, తద్దోరకం కరే ధృత్వా

వాయనం చ ద్విజాతయే. 13. సదక్షిణం సతాంబూలం గౌరీభక్తి సమన్వితా, బ్రాహ్మణాయ సమర్ప్యాథస్వయంభుఞ్జీతభక్తితః. 14. ఏవం వ్రతం తు యానారీ దశాబ్దం చ సమాచరేత్, తస్యాం ఫలన్తి సర్వేఽర్థాః పతిలోకం చ గచ్ఛతి, ఇహ భుక్త్వా సువిపులాన్ సర్వాన్ భోగాన్ యథేప్సితాన్. 15. అనుభూయ సుఖేనైవ చాన్తే కైవల్యమాప్నుయాత్, శౌనకాదయ ఊచుః. సూత సూత మహాభాగ గరుడస్య మహాత్మనః. 16. జన్మ కర్మ చ వీర్యాణి శ్రోతుమిచ్ఛామహే వయమ్, సూతః కశ్యపో నామ బ్రహ్మర్షిర్బ్రహ్మపుత్రోఽభవత్పురా. 17. తస్య భార్యా సుపర్ణీచ తస్యాం పుత్రమజీజనత్, గరుత్మానితి విఖ్యాతో మహాబలపరాక్రమః. 18. దాసీకర్మచ సంప్రాప్తాం మాతరం వీక్ష్య సాదరః, సపత్నీనిలయే మాతః కిమర్థం దాస్యమర్హసి. 19. అమృతానయనేనైవ దాస్యమద్య నివర్తతే, ఇతి తద్వచనం శ్రుత్వా శీఘ్రం గత్వా సురాలయమ్. 20. అమృతాహరణార్థాయ గరుత్మాన్ యత్ర తిష్ఠతి, ఇన్ద్రాదయస్తు తం దృష్ట్వా సర్వే శస్త్రాస్త్రపాణయః. 21. గరుడం ఛాదయామాసుః పరిఘాయసపట్టసైః, పక్షాభ్యాం వారయామాస క్షణమాత్రేణ పశ్యతామ్. 22. ఆనీతమమృతం శీఘ్రం తార్క్ష్యపుత్రేణ ధీమతా, సపత్నీమాతరం దృష్ట్వా అమృతం తే మయార్పితమ్. 23. తథేతి కద్రూః సంగృహ్య సుపర్ణీమిదమబ్రవీత్, దాస్యం త్వయా నివృత్తం మే గృహం గచ్ఛ యథాసుఖమ్. 24. ఇన్ద్రాదయః సమాగత్య గృహీత్వామృతమాయయుః, ఏవంవిధాని కర్మాణి బహూన్యాచరితానిచ. 25. తస్య జన్మ చ మాహాత్మ్యం విస్తార్య కథితం మయా,

షష్ఠ్యామ్యాం జాయమానత్వాత్పష్ఠమీ తార్క్ష్యపంచమీ. 26.
యే చరన్తి వ్రతమిదం యే పఠన్తి ద్విజాతయః, తే తు పాప
వినిర్ముక్తా యాస్యన్తి పరమాం గతిమ్. 27.

ఇతి గరుడపఞ్చమీవ్రతకథా సమాప్తా.

---

## గరుడపంచమీవ్రతకథ

సూతుఁడు శౌనకాది మహామునుల నందఱిని జూచి, "మునీంద్రులారా! అనుష్ఠించినమాత్రముననే స్త్రీలకు సకల సంపదల నొసఁగునట్టి వ్రతములలోనెల్ల నుత్తమం బగువ్రతం బొక్కటి గలదు. ఈపంచమీవ్రతంబును తోఁడబుట్టువులుగల సుమంగలి శ్రావణశుద్ధపంచమీదినంబునఁ జేయవలెను" అని చెప్పఁగా శౌనకమహాముని సూతపౌరాణికునిఁ జూచి, "ఓమహాపండితుఁడా! వ్రతంబులలో నెయ్యది యుత్తమవ్రతమో, ఆ వ్రతంబు నా కానతిండు. నేను వినఁగోరుచున్నాను. అట్టి వ్రతంబు నా కెఱిఁగింపవలయు" నని వేఁడఁగా సూతపౌరాణికుఁడు శౌనకాదిమహామునులతో నిట్లనియె.

"ఓమునీంద్రులారా! యీవ్రతంబు నేసుమంగలియైనను జేయవచ్చును. అయినను ముఖ్యముగా నన్నదమ్ములుగల యాఁడుది తప్పక యీవ్రతంబు నాచరింపవలయును. అట్టికాంత శ్రావణశుద్ధ పంచమిరాఁగానే యుదయమునలేచి, పసుపు సువాసనగల నలుఁగుఁబిండి మొదలగు సువాసనగలపాళ్లను దేహమునకు రుద్దికొని మంగళస్నానముచేసి, యుదికినమడిబట్టలను గట్టుకొని, మండపము పండ్లు ఆకులు మొదలగువానితో నలం

కరించి ఆమంటపమున ముగ్గులుపెట్టి యామంటపమునడుమ దివ్యమైన యాసనంబు నమర్చి దానిమీఁద బియ్యముపోసి, పూవు లక్షతలుచల్లి, శక్తివంచనలేకుండ బంగారుతోఁగాని, వెండితోఁగాని, రాగితోఁగాని తుదకు మంటితోఁగాని ఆదిశేషుని ప్రతిమ నొకదానిని జేయించి దానిమీఁదఁ బెట్టి యాప్రతిమ యందు గౌరీదేవి నావాహనముచేసి, ఆసనార్ఘ్యపాద్యాచమ నీయస్నాన వస్త్ర యజ్ఞోపవీత గంధపుష్పాక్షతాభరణాలంకార ధూపదీపనైవేద్యతాంబూల నీరాజన మంత్రపుష్పాదు లగు సకలపూజలను గావించి, ప్రదక్షిణ నమస్కారములు సల్పి, దోరపూజసేసి దోరము గట్టుకొని వృద్ధబ్రాహ్మణునికి వాయనం బొసఁగి సకల బ్రాహ్మణులకు సంతర్పణంబు గావించి, తాను తన యిష్టబంధుజన సమేతముగా భుజియించి, వ్రతమును పూర్తి చేయవలెను. ఏసుదతి యీవ్రతంబును బదిసంవత్సరములు విడువక చేయుచున్నదో ఆసుమంగలి యిహలోకంబున సకల సౌఖ్యంబుల ననుభవించి, యంతమున మోక్షసామ్రాజ్యము నొందఁగలదు"అని సూతమహాముని చెప్పఁగా, శౌనకాదిమునీం ద్రులు వెండియు నమ్మునీంద్రునిఁ జూచి, "ఓమునీంద్రా! మేము గరుత్మంతుని జననము, కార్యములు, వీర్యమునుగూర్చి వినఁ గోరుచున్నాము. సెల విమ్మ"ని యడుగఁగా, సూతపౌరాణి కుఁడు ఆగరుడుని జననాదులనుగూర్చి వారి కిట్లెఱిఁగిన నెఱిఁ గించె. "ఓమునులారా! తొల్లి బ్రహ్మపుత్త్రుఁడయిన కాశ్యపుఁ డనెడిపేరుగల యొకమహర్షి యుండెను. ఆయనకు సుపర్ణియను భార్య యొక్కతె యుండెను. ఆయన కాసుపర్ణియందు గరు త్మంతుఁ డనెడియొకకొమరుఁడు పుట్టెను. ఆతఁడు మితిమీఱిన

బలపరాక్రమంబులు గలవాఁడు. అతఁడు తల్లిదగ్గఱఁ బెరుగుచు నుండునప్పు డొక్కదినంబునఁ దల్లినిఁజూచి, "ఓతల్లీ! నీవేల సవతి యింటఁ బనికత్తెవై యున్నావు?" అని యడిగెను. ఆమాటకు సుపర్ణి తనకొడుకుతో "ఓకినాయనా! నీవిప్పుడు స్వర్గలోకము నుండి యమృతంబుతెత్తువేని నాదాస్యము తొలఁగిపోవు" నని చెప్పెను. అంత గరుడుఁ డమృతంబు తెచ్చుటకై స్వర్గలోకం బునకుఁబోయెను. ఇంద్రుఁడు మొదలగు వేల్పులందఱు శస్త్రాస్త్ర ములను గైకొని యమృతంబు గొనిపోవచ్చిన యాగరుత్మతుని నడ్డగించిరి. ఆగరుడుఁడు వారిబాణములను వారిని తనఱెక్క దెబ్బలతో నడంచి, వారందఱు చూచుచునప్పుడే క్షణములోపల నమృతంబు గైకొనిపోయి తనసవతితల్లిముందట నుంచెను. అది చూచి యాసవతి తల్లి యగు కద్రువు దానిని గైకొని "నీ దాస్యము తొలఁగెను. సుఖముగా పొమ్ము" అని వినతకు దాస్య విమోచనము నొసఁగెను. ఇంద్రాదులు వచ్చి యాయమృత కలశమును గైకొనిపోయిరి. ఇట్టికార్యముల నాగరుడుఁ డెన్ని యో యాచరించియున్నాఁడు. అతనిజననమును సామర్థ్యమును గూర్చి మీకు విస్తరించి వేఱొకచోటఁ జెప్పెతిని. ఇతఁడు ఈ పంచమినాఁడు పుట్టుటచే నీదినమునకు గరుడపంచమి యని నామంబు వచ్చెను. (ఎవ రీగరుడపంచమీవ్రతంబు నాచరించి, యీకథను వినుచున్నారో, లేక, చదువుచున్నారో వారు సకలపాపవినిర్ముక్తులై యుత్తమగతిని బొందుచున్నారు.)

ఇది గరుడపంచమీవ్రతకథ సంపూర్ణము.



# కేదారేశ్వరవ్రతము

ఆచమ్య=ఆచమనముచేసి.

శుక్లాంబరధరం విష్ణుం...గణాధిపతయే నమః ఓం దైవీ గాయత్రీ ఛన్దః ప్రాణాయామే వినియోగః ఓంభూః...రోమ్. మమ ఉపాత్త...ప్రీత్యర్థం శుభే...మధ్యే...నామసంవత్సరే దక్షిణాయనే, శరదృతౌ...ఆశ్వయుజమాసే కృష్ణపక్షే అమాయాం శుభతిథౌ...యుక్తాయాం వస్యాం శుభతిథౌ అస్మాకం సహకుటుంబానాం క్షేమస్థైర్యవిజయాయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం, ధర్మా...సిద్ధ్యర్థం, పుత్ర...వృద్ధ్యర్థం, ఇష్ట...ద్ధ్యర్థం, మనో......ద్ధ్యర్థం, సమ...ప్త్యర్థం, సత్సం...ర్థం వర్షేవర్షే ప్రయుక్తాం కేదారేశ్వర దేవతాముద్దిశ్య కేదారేశ్వర దేవతాప్రీత్యర్థం భవిష్యోత్తరపురాణోక్తకల్పోక్త ప్రకారేణ యావచ్ఛక్తిధ్యానావాహనాదిషోడశోపచారపూజాం కరిష్యే (అని కలశమును దాఁకి కలశపూజ, గణాధిపతిపూజ, కేదారేశ్వర ప్రాణప్రతిష్ఠలను వరుసగా చేయవలయును; వీని విధానము వినాయకవ్రతకల్పమునందుఁ దెలియవలెను.)

## కేదారేశ్వరపూజా

అథ ధ్యానం శ్లో. శూలం డమరుకం చైవదధానంహస్తయుగ్మకే,
కేదారదేవమీశానం ధ్యాయేత్త్రిపురఘాతినమ్.
కేదారేశ్వరం ధ్యాయామి.

శూలమును, డమరుకమును రెండు చేతులతోఁ బట్టు కొనియున్న కేదారేశ్వరుఁ డయిన త్రిపురసంహారియగు ఈశ్వ రుని ధ్యానింపవలెను.

కైలాసశిఖరే రమ్యే పార్వత్యా సహిత ప్రభో,
ఆగచ్ఛ దేవదేవేశ మద్భక్త్యా చన్ద్రశేఖర.
కేదారేశ్వరమావాహయామి.

కైలాసపర్వతంబునఁ బార్వతితోడ వసించు ఓ దేవ దేవా! చంద్రమౌళీ! నాభక్తికి మెచ్చి నాకడకు రమ్ము.

సురాసురశిరోరత్న ప్రదీపితపదామ్బుజ,
కేదారదేవ మద్దత్తమాసనం ప్రతిగృహ్యతామ్.
కేదారేశ్వరాయ ఆసనం సమర్పయామి.

దేవతలు, రాక్షసులును మ్రొక్కునప్పుడు వారిశిరో రత్నముల మెఱుఁగులు సోఁకుటచే వెలిఁగెడికమలంబులంబోలు పాదములుగల యో కేదారేశా! నే నొసఁగునట్టి యాసనంబు గైకొనుము.

గంగాధర నమస్తేఽస్తు త్రిలోచన వృషధ్వజ,
మౌక్తికాసనసంస్థాయ కేదారాయ నమోనమః.
కేదారేశ్వరాయ పాద్యం సమర్పయామి.

గంగను ధరించినవాఁడవు, ముక్కంటివి, ఎద్దు నెక్కు వాఁడవునైన యోకేదారేశ్వరా! ముత్యాలతో నలంకరించిన యాసనంబునఁ గూరుచున్న నీకుఁ బలుమాఱు మ్రొక్కెదను.

అర్ఘ్యం గృహాణ భగవన్ భక్త్యా దత్తం మహేశ్వర,
ప్రయచ్ఛ మే మనస్తుష్టిం భక్తానామిష్టదాయక.
కేదారేశ్వరాయ అర్ఘ్యం సమర్పయామి.

ఓయీశ్వరా! నేను భక్తితో నొసఁగునట్టి యర్ఘ్య
మును గైకొనుము. భక్తులకోర్కెల నొసఁగువాఁడా! నామన
స్సునకు సంతసంబు గావింపుము.

మునిభిర్నారదప్రఖ్యైర్నిత్యమాఖ్యాతవైభవ,
కేదారదేవ భగవన్ గృహాణాచమనం విభో.

కేదారేశ్వరాయ ఆచమనీయం సమర్పయామి.

నారదుఁడు మున్నగుమునులచే నెల్లప్పుడు కొనియాడఁ
బడు మహిమగల యోభగవంతుఁడ వగుకేదారనాథా! నే
నొసఁగు ఆచమనీయఃముము గృపసేసి కైకొనుము.

కేదారదేవ భగవన్ సర్వలోకేశ్వర ప్రభో
మధుపర్కం ప్రదాస్యామి గృహాణ త్వం శుభంకర.

అన్నిలోకముల కీశుఁడవగు ఓ పూజ్యుఁడవయిన యో
కేదారనాథా! మధుపర్కము నొసఁగెదను. శుభప్రదుఁడవగు
ఓదేవా! ప్రీతితో స్వీకరింపుము.

స్నానం పఞ్చామృతైర్దేవ శ్రితం శుద్ధోదకైరపి,
గృహాణ గౌరీరమణ త్వద్భక్తేన మయార్పితమ్.

కేదారేశ్వరాయ పంచామృతస్నానం సమర్పయామి.

పార్వతీప్రియా! నీదాసుఁడనైన నే నొసఁగెడి పంచా
మృతముతో స్నానముచేయుము.

నదీజలం సమాయుక్తం మయా దత్తమనుత్తమం,
స్నానం స్వీకురు దేవేశ సదాశివ నమోఽస్తు తే.

కేదారేశ్వరాయ స్నానం సమర్పయామి

ఎల్లప్పుడు శుభప్రదుఁడ వైన యో దేవదేవా! నీకు మ్రొక్కెద. అన్నిసుగంధద్రవ్యములుచేర్చి నేను భక్తితో నిచ్చెడి యీనదీజలముచే స్నానమాచరింపుము.

వస్త్రయుగ్మం సదా శుభ్రం మనోహరమిదం శుభం,
దదామి దేవదేవేశ భక్త్యేదం ప్రతిగృహ్యతామ్.
కేదారేశ్వరాయ వస్త్రయుగ్మం సమర్పయామి.

ఓదేవదేవా! యెల్లప్పుడు తెల్లనై మిగుల మనోహరమై యున్న మేల్మివస్త్రములజతను భక్తితో నొసంగెదను. దీనిని గైకొనుఁడు.

స్వర్ణయజ్ఞోపవీతం చ కాఞ్చనం చోత్తరీయకం,
రుద్రాక్షమాలయా యుక్తం దదామి స్వీకురు ప్రభో.
కేదారేశాయ యజ్ఞోపవీతోత్తరీయే సమర్పయామి.

రుద్రాక్షతావళము దాల్చిన యోప్రభువా! బంగారు మయంబైన జందెమును, మీఁదిబట్టను నొసఁగెదను. అనుగ్రహింపుము.

సమస్తగన్ధద్రవ్యాణాం దేవ త్వమసి జన్మభూః,
భక్త్యా సమర్పితం ప్రీత్యా మయా గన్ధాపి గృహ్యతామ్.
కేదారేశ్వరాయ గంధాన్ ధారయామి.

ఓదేవా! నీవు సకల సుగంధవస్తువులకుఁ బుట్టుచోటై యున్నావు. నేను భక్తితో నొసఁగెడి గంధము మొదలగు వానినిఁ బ్రేమతో స్వీకరింపుము.

అక్షతోఽసి స్వభావేన భక్తానామక్షతం పదం,
దదాసి నాథ మద్దత్తైరక్షతైః ప్రీయతాం భవాన్.
కేదారేశాయ అక్షతాన్ సమర్పయామి.

ఓరక్షకుఁడా! నీవు స్వాభావికముగా నాశరహితుఁడవు. భక్తులకు శాశ్వతమోక్షపదంబు నొసఁగువాఁడవు. నీవు నేను సమర్పించునక్షతలతోఁ బ్రీతినొందుము.

కల్పవృక్షప్రసూనైస్త్వం పూరై ర్వరభ్యర్చితః సురైః,
కుఙ్కుమైః పార్థివై రేభిరిదానీమర్చ్యతే మయా.

కేదారేశ్వరాయ నమః పుష్పాణి పూజయామి.

ఓదేవా! తొల్లి వేల్పులు నిన్నుఁ గల్పవృక్షపుఁ బూవులతోఁ బూజించిరి. నే నిప్పుడు పుడమియందలి కుంకుమతో నర్చించెదను.

తతః ఇంద్రాదిలోకపాలపూజాం కుర్యాత్,
శివస్య దక్షిణేభాగే (కుడివైపున) బ్రహ్మణే నమః.

ఉత్తరభాగే (=ఎడమవైపున) విష్ణవే నమః. మధ్యే (నడుమ) కేదారేశ్వరాయ నమః.

---

## అథ అంగపూజా

| | | | |
|---|---|---|---|
| మహేశ్వరాయ | నమః | పాదౌ | పూజయామి. |
| ఈశ్వరాయ | ,, | జంఘే | ,, |
| కామరూపాయ | ,, | జానునీ | ,, |
| హరాయ | ,, | ఊరూ | ,, |
| త్రిపురాన్తకాయ | ,, | గుహ్యం | ,, |
| భవాయ | ,, | కటిం | ,, |
| గఙ్గాధరాయ | ,, | నాభిం | ,, |
| మహాదేవాయ | ,, | ఉదరం | ,, |
| పశుపతయే | ,, | హృదయం | ,, |

| | | | |
|---|---|---|---|
| పినాకినే | నమః | హస్తౌ | పూజయామి. |
| శివాయ | ,, | భుజౌ | ,, |
| శితికంఠాయ | ,, | కణ్ఠం | ,, |
| విరూపాక్షాయ | ,, | ముఖం | ,, |
| త్రినేత్రాయ | ,, | నేత్రాణి | ,, |
| రుద్రాయ | ,, | లలాటం | ,, |
| శర్వాయ | ,, | శిరః | ,, |
| చన్ద్రమౌళయే | ,, | మౌళిం | ,, |
| పశుపతయే | ,, | సర్వాణ్యఙ్గాని | ,, |

అథ అష్టోత్తరశతనామావళిః.

“నమః” అని ప్రతినామము కడపటఁ జేర్చవలయును.

ఓం శివాయ నమః
మహేశ్వరాయ
శమ్భవే
పినాకినే
శశిశేఖరాయ
వామదేవాయ
విరూపాక్షాయ
కపర్దినే
నీలలోహితాయ
శఙ్కరాయ 10
శూలపాణయే
ఖట్వాఙ్గినే
విష్ణువల్లభాయ
శిపివిష్టాయ
అమ్బికానాథాయ
శ్రీకణ్ఠాయ
భక్తవత్సలాయ
భవాయ
శర్వాయ
త్రిలోకేశాయ 20
శితికంఠాయ
శివాప్రియాయ
ఉగ్రాయ
కపర్దినే
కామారయే
అన్ధకాసురసూదనాయ

గఙ్గాధరాయ
లలాటాక్షాయ
కాలకాలాయ
కృపానిధయే 30
భీమాయ
పరశుహస్తాయ
మృగపాణయే
జటాధరాయ
కైలాసవాసినే
కవచినే
కఠోరాయ
త్రిపురాంతకాయ
వృషాఙ్కాయ
వృషభారూఢాయ 40
భస్మోద్ధూళితవిగ్రహాయ
సామప్రియాయ
స్వరమయాయ
త్రయీమూర్తయే
అనీశ్వరాయ
సర్వజ్ఞాయ
పరమాత్మనే
సోమసూర్యాగ్నిలోచనాయ
హవిషే
యజ్ఞమయాయ 50
పఞ్చవక్త్రాయ
సదాశివాయ
విశ్వేశ్వరాయ
వీరభద్రాయ
గణనాథాయ
ప్రజాపతయే
హిరణ్యరేతసే
దుర్ధర్షాయ
గిరీశాయ
సేనఘ్నాయ 60
భుజఙ్గభూషాయ
భర్గాయ
గిరిధన్వనే
గిరిప్రియాయ
కృత్తివాసనే
పురారాతయే
భగవతే
ప్రమథాధిపాయ
మృత్యుంజయాయ
సూక్ష్మతనవే 70
జగద్వ్యాపినే
జగద్గురవే
వ్యోమకేశాయ
మహాసేనజనకాయ
చారువిక్రమాయ
రుద్రాయ

భూతపతయే
స్థాణవే
అహిర్బుధ్న్యాయ
దిగమ్బరాయ 80
అష్టమూర్తయే
అనేకాత్మనే
స్వాతిగాయ
శుద్ధవిగ్రహాయ
శాశ్వతాయ
ఖణ్డపరశవే
అజాయ
పాశవిమోచనాయ
సామ్బాయ
మృడాయ 90
పశుపతయే
దేవాయ
మహాదేవాయ
అవ్యయాయ
హరయే
పూషదంతభిదే
అవ్యగ్రాయ
దక్షాధ్వరహరాయ
హరాయ
భగనేత్రభిదే 100
అవ్యక్తాయ
సహస్రాక్షాయ
సహస్రపాదాయ
త్రివర్గప్రదాయ
అనన్తాయ
తారకాయ
పరమేశ్వరాయ
శ్రీకేదారేశ్వరాయ నమః.

నానావిధపరిమళపుష్పాణి సమర్పయామి.

---

## అథ దోరగ్రన్థిపూజా

శివాయ నమః ప్రథమగ్రన్థిం పూజయామి. వాహాయ నమః ద్వితీయగ్రన్థిం పూజయామి. మహాదేవాయ నమః తృతీయగ్రన్థిం పూజయామి. వృషభధ్వజాయ నమః చతుర్థగ్రన్థిం పూజయామి. గౌరీశాయ నమః పఞ్చమగ్రన్థిం పూజయామి.

రుద్రాయ నమః షష్ఠగ్రన్థిం పూజయామి. పశుపతయే నమః సప్తమగ్రన్థిం పూజయామి. భీమాయ నమః అష్టమగ్రన్థిం పూజయామి. త్ర్యమ్బకాయ నమః నవమగ్రన్థిం పూజయామి. నీలలోహితాయ నమః దశమగ్రన్థిం పూజయామి. హరాయ నమః ఏకాదశగ్రన్థిం పూజయామి. స్మరహరాయనమః ద్వాదశగ్రన్థిం పూజయామి. భవాయనమః త్రయోదశగ్రన్థిం పూజయామి. శంభవే నమః చతుర్దశగ్రన్థిం పూజయామి. శర్వాయ నమః పఞ్చదశగ్రన్థిం పూజయామి. సదాశివాయ నమః షోడశగ్రన్థిం పూజయామి. ఈశ్వరాయ నమః సప్తదశగ్రన్థిం పూజయామి. ఉగ్రాయనమః అష్టాదశగ్రన్థిం పూజయామి. శ్రీకణ్ఠాయనమః ఏకోనవింశతిగ్రన్థిం పూజయామి. నీలకణ్ఠాయ నమః వింశతిగ్రన్థిం పూజయామి. కేదారేశ్వరాయ నమః ఏకవింశతితమగ్రన్థిం పూజయామి.

కేదారేశాయ నమః నానావిధపరిమళపుష్పాణి సమర్పయామి.

దశాఙ్గధూపముఖ్యైశ్చ హ్యఙ్గారవినివేశితః,
ధూపః సుగన్ధైరుత్పన్నః త్వాం ప్రీణయతు శఙ్కర.

కేదారేశాయ నమః ధూపమాఘ్రాపయామి.

ఓశంకరా! దశాంగధూపము మొదలగు సుగంధద్రవ్యములతో వేసినధూపము నీకు సంతోషమును గలిగించునుగాక.

యోగినాం హృదయేష్వేవ జ్ఞానదీపాఙ్కురో హ్యసి,
బాహ్యదీపో మయా దత్తః గృహ్యతాం భక్తగౌరవాత్.

కేదారేశ్వరాయ నమః దీపం దర్శయామి.

ఓ కేదారేశ్వరా! యోగులహృదయములందే జ్ఞానదీపపుఁజిన్న మొలకవుగ వెలుఁగుచున్నావు. అట్టి నీకు బాహ్యదీపమును జూపుచున్నాను. దీనిని తాము భక్తులయందలి ప్రేమతో స్వీకరింతురు గాక.

త్రైలోక్యమపి నైవేద్యం న తే తృప్తిస్తథా బహిః,
నైవేద్యం భక్తవాత్సల్యాద్గృహ్యతాం త్ర్యమ్బక త్వయా.
కేదారేశ్వరాయ మహానైవేద్యం సమర్పయామి.

ఓకేదారా! మూఁడులోకంబులను నివేదించినను నీకుఁ దనివిగలుగనేరదు; అయినను వెలుపట నామనస్తృప్తికై నేను పెట్టునట్టి నివేదనమును భక్తునందలి ప్రేమతో మీరు గైకొందురు గాక.

నిత్యానందస్వరూపస్త్వం యోగిహృత్కమలే స్థితః,
గౌరీశ భక్త్యా మద్దత్తం తామ్బూలం ప్రతిగృహ్యతామ్.
కేదారేశ్వరాయ నమః తాంబూలం సమర్పయామి.

ఓ పార్వతీనాథా! నీవు సచ్చిదానందస్వరూపుఁడవు. యోగులమానసికమునందు వసించువాఁడవు. నేను భక్తితో నొసఁగునట్టి తాంబూలమును గైకొందువుగాక.

అర్ఘ్యం గృహాణ భగవన్ భక్త్యా దత్తం మహేశ్వర,
ప్రయచ్ఛ మే మనస్తుష్టిం భక్తానామిష్టదాయక.
కేదారేశ్వరాయ నమః అర్ఘ్యం సమర్పయామి.

సకలలోకములచేఁ గొనియాడఁబడువాఁడవు, భక్తుల కోర్కులనొసఁగువాఁడవునైన యోపరమేశ్వరా! నేను భక్తితో నిచ్చు నర్ఘ్యమును గైకొని నామనస్సునకు సంతోషము నొసఁగుము.

దేవేశ చన్ద్రసఙ్కాశం జ్యోతిః సూర్యమివోదితం,
భక్త్యా దాస్యామి కర్పూరనీరాజనమిదం శివ.
కేదారేశ్వరాయ నమః కర్పూరనీరాజనం దర్శయామి.

దేవదేవుఁడవగు ఓశివా! ఉదయించిన సూర్యునివలెను, చంద్రునివలెను, వెలుఁగుకర్పూరముతో నీరాజనంబును భక్తి పూర్వకముగా నొసఁగుచున్నాను.

భూతేశ భువనాధీశ సర్వదేవాదిపూజిత,
ప్రదక్షిణం కరోమి త్వాం వ్రతం మే సఫలం కురు.
కేదారేశ్వరాయ ప్రదక్షిణం సమర్పయామి.

అన్నిభూతంబుల యేలికా! అన్నిలోకముల యేలికా! దేవతలందరిచేఁ గొనియాడఁబడు ఓ కేదారేశ్వరా! నీకుఁ బ్రదక్షిణము చేయుచున్నాను. నావ్రతంబును సంపూర్ణము చేయుము.

హర శమ్భో మహాదేవ విశ్వేశామరవల్లభ,
శివ శఙ్కర సర్వాత్మన్ నీలకణ్ఠ నమోఽస్తు తే.
కేదారేశ్వరాయ నమస్కారాన్ సమర్పయామి.

ఓపార్వతీశా! సర్వాంతర్యామీ! దేవదేవా! నీకు దండములు పెట్టెదను.

అభీష్టసిద్ధిం కురు మే శివావ్యయ మహేశ్వర,
భక్తానామిష్టదానార్థం మూర్తీకృతకళేబర.

భక్తులయొక్క కోర్కుల నొసఁగుటకై శరీరమును ధరించినవాఁడవు, నాశములేనివాఁడవు, మోక్షమునొసఁగువాఁడవునైన యోకేదారేశ్వరా! నా కోరికలనొసంగుము. అని కేదారేశ్వరుని ప్రార్థనచేయవలయును.

కేదార దేవదేవేశ భగవన్నమ్బికాపతే,
ఏకవింశద్దినే తస్మిన్ సూత్రం గృహ్ణామ్యహం ప్రభో.

దేవతలకుఁ బెద్దవు, పార్వతీశుఁడవునైన ఓభగవంతుఁడా! నేఁటి కిరువదియొకటవదినమున సూత్రమును గ్రహించుచున్నాను. అని చెప్పి సూత్రమును (దారమును) గ్రహింపవలయును.

ఆయుశ్చ విద్యాం చ తథా సుఖం చ
సౌభాగ్యమృద్ధిం కురు దేవదేవ,
సంసారఘోరామ్బునిధౌ నిమగ్నం
మాం రక్ష కేదార నమో నమస్తే.

ఓ దేవదేవా! ఆయుస్సును, విద్యను, సుఖంబును, అదృష్టమును, సంపదను నొసఁగి, సంసారమనెడి భయంకరమైన గొప్ప సముద్రమున మునిఁగిన నన్ను లేవనెత్తి కాపాడుము. కేదారేశ్వరా! నీకు నమస్కారము. నమస్కారము. ఈశ్లోకమును జెప్పి తోరమును చేతఁ గట్టుకొనవలయును.

కేదారః ప్రతిగృహ్ణాతు కేదారో వై దదాతి చ,
కేదారస్తారకోభాభ్యాం కేదారాయ నమోనమః.

ఈశ్లోకము చెప్పి కేదారేశ్వరరూపుఁడైన బ్రాహ్మణునకు వాయనము నియ్యవలయును.

కేదార ప్రతిమా యస్మాద్రాజ్యసౌభాగ్యవర్ధినీ,
తస్మాదస్యాః ప్రదానేన మమాస్తు శ్రీరచఞ్చలా.

కేదారేశ్వరుని ప్రతిమ సకలసంపదల నిచ్చునది కావున నిట్టి ప్రతిమనొసఁగుటచే నాకును శాశ్వతసంపద గలుగుసుగాక. ఈశ్లోకము చెప్పి కేదారేశ్వరుని ప్రతిమను దక్షిణాతాంబూలములతోఁగూడ నొసఁగవలెను.

యస్య స్మృత్యా చ...పరిపూర్ణం తదస్తు తే, కల్పోక్త విధానేన కృతయా అనయా పూజయా శ్రీకేదారేశ్వరః సుప్రీతః సుప్రసన్నో వరదో భవతు. మమ ఇష్టకామ్యార్థసిద్ధిరస్తు.

పూజావిధానము సంపూర్ణము.

## కథా ప్రారంభము

సూత ఉవాచ. శ్లో. యస్య ప్రసాదాద్భువనం క్రియతే సచరాచరం, తం ప్రణమ్య మహాదేవం భగవన్తముమాపతిమ్. 1. కేదారవ్రతమాహాత్మ్యం సర్వకల్యాణకారణం, ప్రవక్ష్యామి జగద్భూత్యై మునిభిశ్చ పురాకృతమ్. 2. ప్రాప్తం శఙ్కరదేహార్ధం దేవ్యా యద్వ్రతచర్యయా, యద్వ్రతం చరతాం లోకే సమ్భవన్తి విభూతయః. 3. ఆరోగ్యమాయుఃకీర్తిశ్చ వర్ధన్తే శృణ్వతామిదం, ఏకవింశతివారాన్ యశ్చరతే తద్వ్రతోత్తమమ్. 4. ఇహాముత్ర చ కల్యాణం విన్దతి ధ్రువముత్తమం, వ్రతం సమాచరన్ మర్త్యః సౌభాగ్యం కాన్తిమేవ చ. 5. ఆయుః శ్రియం చ లభతే శివలోకే మహీయతే, తస్మాద్విప్రో వా రాజా వా వైశ్యో వా శూద్ర ఏవవా. 6. యే చాప్యన్యే నరాః కుర్యుః సంయతా వ్రతముత్తమం, అస్తి పూర్వోత్తరేభాగే పృథివ్యాం ధరణీధరః. 7. కైలాస ఇతి విఖ్యాతః శ్రీమాన్ లోకనమస్కృతః, రాజతైర్విమలైః శృఙ్గైః నవరత్నవిచిత్రితైః. 8. తటిద్గణసమాకీర్ణైః శారదాభ్రైరివ స్థితైః, నానాద్రుమలతాకీర్ణైర్నానా పుష్పఫలైర్యుతైః. 9. నానావిహఙ్గసంస్పృష్టైర్నానాజర్జరసఙ్కులైః, సాలైస్తమాలైస్తిలకైర్హిన్తాలైర్వకులైరపి. 10. అశోకైః కరకైర్నింబైశ్చన్దనైర్దేవదారుభిః, నారికేళామ్రపనస

పూగపున్నాగచమ్పకైః. 11. ఏతైశ్చాన్యైశ్చ తరుభిః శోభితం
పుణ్యకాననం, ఏతస్య శిఖరే రమ్యే యోగిబృన్దనిషేవితే. 12.
యక్షకిన్నరగన్ధర్వసిద్ధవిద్యాధరైర్వృతే, సమావసతి విశ్వాత్మా
పినాకీ ప్రమథైర్వృతః. 13. అంబికాసహితః శ్రీమాన్ సర్వ
దేవనమస్కృతః, ఏకదా తస్య శిఖరే రుద్రాణీసహితః శివః. 14.
తథాఽపి కుర్వన్ వసతిం సురాణాం దర్శనం దదౌ, అగ్నిర్వా
యుస్తథాదిత్యశ్చన్ద్రమాః సహతారకాః. 15. బ్రహ్మాదయో
వసిష్ఠాద్యాస్తే సర్వే తం సిషేవిరే, రమ్భా తిలోత్తమా చైవ
సహజన్యా చ మేనకా. 16. యాశ్చాన్యా దేవవనితాః పరితస్తు
పినాకినం, మాతరశ్చండికాద్యాశ్చ కార్తికేయో గజాననః.
17. నన్ద్యాదయో దేవగణాః సారూప్యసహితాః స్థితాః, ఏవం
ప్రవర్తమానాయాం సభాయాం రుద్రసన్నిధౌ. 18. నారద
ప్రముఖాస్తత్ర జగుస్తేన ప్రచోదితాః, తేషాం ప్రవృత్తే మధురే
గీతే సర్వమనోహరే. 19. వాదిత్రలయసంయుక్తా ననృతుశ్చా
ప్సరోగణాః, తాసామప్సరసాం మధ్యే రమ్భా సర్వాఙ్గసున్దరీ. 20.
మధురం లాస్యమకరోత్సర్వగీర్వాణసమ్మతం, తత్ర భృఙ్గిరిటిర్నా
మసమయే శివసమ్మతమ్. 21. అద్భుతం వికటం నృత్తమకరోద్ధర
సన్నిధౌ, తత్ర ప్రవర్తతే హాసః సురాణాం శివయోః పురః. 22.
మహాన్ కలకలశ్చాసీద్గిరికన్దరపూరణః, ఏవం ప్రహాసనాన్తేతు
శ్రీమాన్ సర్వేశ్వరోఽబ్రవీత్. 23. సాధుభృఙ్గిరిటే సమ్యక్కృ
తం ప్రహసనం త్వయా, ఇత్యుక్త్వా భగవాంస్తస్మై ప్రసాద
మకరోద్విభుః. 24. హరప్రసాదాత్సుప్రీతః సురైశ్చ సుబహూ
కృతః, హరం ప్రదక్షిణీకుర్వన్, వినా దేవీం సమాహితః. 25.
ప్రణామమకరోత్తస్మై వినయేన సమన్వితః. తతో దేవ్యబ్రవీ

ద్వాక్యం దేవముద్వీక్ష్య సస్మితా. 26. మద్భాగం పరిహృత్యాసౌ కృతవాంస్త్వత్ప్రదక్షిణం, ప్రణామస్య కిమేతస్య కారణం పర మేశ్వర. 27. బ్రూహి మే తత్త్వతః సర్వం శ్రోతుం కౌతూ హలం హి మే, తయైవముక్తో భగవాన్ బభాషే శశిశేఖరః. 28. యోగినో న నమన్తి త్వాం పరమార్థవిదః ప్రియే, యే భజన్తి ప్రియే త్వాం తు తేషాం నాస్తి ప్రయోజనమ్. 29. ఇత్యుక్త్వా సా మహేశేన తత్యాజ ప్రియమీశ్వరీ, శక్త్యా వినాకృతః సోఽథ త్వగస్థివిషమాజభృత్. 30. అమ్బా త్వగస్థిశేషా సా నిస్సారా వికటాభవత్, తతస్తు దేవీ కుపితా దేవతాభిః ప్రసాదితా. 31. జగామ ముక్త్వా కైలాసం పరమం గౌతమాశ్రమం, సింహైర్నా గైశ్చ శార్దూలైర్వారిణైశ్చ నిషేవితమ్. 32. పన్నగైర్గరుడైశ్చాపి విముక్తానోన్యమత్సరైః, నానాద్రుమలతాకీర్ణం సేవితం పరమ ర్షిభిః. 33. సర్వలోకప్రియకరం సర్వకామఫలప్రదం, గౌత మోఽపి మహాతేజాః సమిత్కుశఫలాని చ. 34. వన్యాని హోమ యోగ్యాని వనాదాహృత్య నిర్గతః, మునిస్తు స్వాశ్రమాభ్యాశే శోభాముద్వీక్ష్య విస్మితః. 35. కిమిదం తాపసారణ్యమిదానీం శోభతే భృశం, ఇతి చిన్తాసమావిష్టో వివేశ స్వాశ్రమం మునిః. 36. ప్రవిశ్య పద్మపత్రాక్షీం భవానీం వీక్ష్యభూషితాం, సోఽ పృచ్ఛదభిపూజ్యైనాం తత్రాగమనకారణమ్. 37. పృష్టా సాము నినా దేవీ స్వవిషాదస్య కారణం, ఉక్త్వాచ సుఖమాసీనం ప్రణమ్య పునరబ్రవీత్. 38. భగవన్ హరదేహార్ధం యాదృశే నాప్యతే మయా, తాదృశం మే వ్రతం బ్రూహి యద్వసేద్యోగి సంమతమ్. 39. తచ్ఛ్రుత్వాతు మహాతేజా భవాన్యావాక్యమీరి తం, సమీక్ష్య సర్వశాస్త్రాణి పురాణాని చ సర్వశః. 40. అభీష్ట వరదం చైవ శ్రీమత్కేదారనామకం, ఆచచక్షే మునివరో భవా

న్యైస్య సువ్రతం మహత్. 41. అపర్ణా చాబ్రవీద్వాక్యం వ్రతస్యా స్య విధిక్రమః, కథం కథయ తం దేవ తథా శాస్త్రప్రచోదితమ్. 42. ఏవం బ్రువాణాం తాం దేవీముమాచ మునిపుఙ్గవః, మాసి భాద్రపదేఽష్టమ్యాం శుక్లపక్షే సమాహితః. 43. క్షౌమైః కార్పాసకైర్వాపి యథారుచి సుశోభనైః, హస్తే బద్ధ్వా ప్రతిసరం హ్యేకవింశతితన్తుభిః. 44. ఉపోష్య రజనీం తాంతు కృత్వా బ్రాహ్మణభోజనం, తదారభ్య ప్రకర్తవ్యమమావాస్యావధి వ్రతమ్. 45. నిత్యం ప్రాతః సముత్థాయ కృత్వా పూజాం ప్రయత్నతః, కేదారదేవపూజాం తు కుర్యాదపి విశేషతః. 46. వివిక్తే శుచి దేశే తు ధాన్యరాశిం నిధాయ చ, తస్యోపరి నిధాయాథ పూర్ణ కుంభం సుశోభనమ్ 47. సంవేష్ట్య సూత్రజాలైశ్చ హ్యేకవింశతి సంఖ్యకైః క్షౌమేన వా దుకూలేన కార్పాసేనాపి వేష్టయేత్. 48. నవరత్నాని వా తస్మిన్ సువర్ణం వా తథా ఫలం, నిధాయ గన్ధపుష్పాద్యైరర్చయిత్వా యథావిధి. 49. త్రిస్సప్తసంఖ్యకాన్ దేవి బ్రాహ్మణాన్ వేదపారగాన్, సమాహూయ ప్రతిష్ఠాప్య పాదశౌచం విధాయ చ. 50. పూజయేదథ తాన్ సర్వాన్ పురోహితపురస్సరాన్, తతః కేదారదేవస్య కుర్యాదావాహనం పునః. 51. ఆవాహ్య దేవం తత్రైవ ప్రతిష్ఠాప్య యథావిధి, చన్ద నాగరుకర్పూరకస్తూరీకుఙ్కుమాన్వితాన్. 52. గన్ధాంశ్చ వివి ధాన్ దేవి పుష్పాణి వివిధాని చ, తామ్బూలాని విచిత్రాణి వాసాంసి చ నివేదయేత్. 53. పుష్పైరభ్యర్చ్య విధివద్ధూప దీపాదిభిః శివం, గోధూమపిష్టసంక్లప్తానేకవింశతిసంఖ్యకాన్. 54. అపూపాన్సృష్టమన్నం చ పాయసం గుడసంయుతం, దధ్యాజ్యమధుసంయుక్తమనేకైర్వ్యఞ్జనైర్యుతమ్. 55. ఫలై రనేకైః సమ్పూర్ణం కదళీపనసామ్రకైః, సర్వాన్ నివేద్య దేవాయ

కృత్వా చాచమనీయకమ్. 56. తాంబూలంచనివేద్యాథస్తోత్రం
కుర్యాద్యథేప్సితం, కృత్వా దేవస్య పూజాం చ దేవి కేదార
నాయకమ్. 57. యథాశక్తి సువర్ణాది బ్రాహ్మణేభ్యః ప్రదాయచ,
వ్రతం సమాప్య విధివత్ప్రీణయస్వ త్రిలోచనమ్.58. తతః ప్రీతో
మహాదేవః సర్వదేవగణైః సహ, ఆగత్య స్వశరీరార్ధం భవత్యై
దాస్యతి స్వయమ్. 59. ఇత్యాచచక్షే మునిరప్యథార్యా
తద్వ్రతేహితా, ఏతద్భవానీ సుప్రీతా శ్రుత్వా గౌతమభాషితమ్.
60. యథానిర్దిష్టమృషిణా తథా సర్వం సమాచరత్, తతః ప్రీత
మనా భూత్వా భగవాన్ వృషభధ్వజః. 61. గత్వా దేవగణైః
సార్ధం స్వదేహార్ధం దదౌ హరః, తతో భవానీ సుప్రీతా శంక
రార్ధం సమేత్యచ. 62. దేవం ప్రసాదయామాస లోకానాం
హితకామ్యయా, దేవప్రసాదాత్త్రైలోక్యే చరన్త్వేతద్వ్రతం
జనాః. 63. యోయం ప్రార్థయతే బుద్ధ్యా తత్సర్వం సమవా
ప్నుయాత్, ఇతి ప్రసాదితో దేవ్యా భగవానమ్బికాసఖః. 64.
తథేత్యుక్త్వా సురగణైస్తత్రైవాన్తరధీయత, తతశ్చిత్రాఙ్గదో
నామ గన్ధర్వః శివభక్తిమాన్. 65. వ్రతచర్యాక్రమం లేభే
నన్దికేశ్వరపార్శ్వతః, మనుష్యవిషయం ప్రాప్య వ్రతమేతద్విశా
మ్యహమ్. 66. ఏవంసతు వినిశ్చిత్య జగామోజ్జయినీం పురీం,
వజ్రదన్తాయ విధివద్దదౌ రాజ్ఞే వ్రతం సుధీః. 67, వ్రతమేతన్మ
నుష్ఠాయ స మహానభవత్ప్రభుః, అథాభూతాం వైశ్యసుతే
తస్యాం చ పురి కన్యకే. 67. ఏకాం పుణ్యవతీం ప్రాహురన్యాం
భాగ్యవతీం విదుః, తే కన్యే పితరం ప్రాప్య బభాషాతే ప్రియం
వచః. 69. మహాత్కేదారనాథస్య వ్రతం కర్తుం ప్రతీచ్ఛనౌ,
తాభ్యామేవం నిగదితే పితైవం వాక్యమబ్రవీత్. 70. వత్సే
బ్రూత దరిద్రోఽహం కథమాసాద్యతే మయా, సామగ్రీ

చాస్య నాస్త్యేవ యువాభ్యాం తద్విముచ్యతామ్. 71. ఇతి పిత్రా సమాదిష్టే కన్యే పునరవోచతాం, అనుజ్ఞాతే త్వయా తాతకర్తుమిచ్ఛావ సువ్రతమ్.72. త్వదనుజ్ఞావినియతమావయోః పరమం ధనం, ఇత్యుక్త్వా తేన వైశ్యేన కృతానుజ్ఞే చ కన్యకే. 73. కస్మింశ్చిద్రుచిరే దేశే వటవృక్షసమాశ్రితే, బద్ధ్వా ప్రతిసరం తత్ర చక్రాతేఽర్చాం యథావిధి. 74. ఏతయోర్భక్తిశీలేన తత్సామగ్రీం దదౌ హరః, వ్రతచర్యాం సమాసాద్య ప్రీత్యా వై చక్రతుర్వ్రతమ్.75.తతః ప్రీతో మహాదేవః సాంబఃసన్నిహితోఽభవత్, సతయోః కన్యయోః ప్రీతో రూపమప్సరసాం దదౌ. 76. అనన్తమాయురైశ్వర్యం దత్త్వా సోఽన్తర్హితోఽభవత్, అథ పుణ్యవతీం వవ్రే రాజా హ్యుజ్జయినీపతిః. 77. అపరాం చోళభూపాలో నామ్నా భాగ్యవతీం తథా, దత్త్వాఽత్మజే తదా వైశ్యో సమృద్ధో న్యవసత్సుఖీ. 78. సామ్రాజ్యం సంపదం ప్రాప్య పుత్రాన్ లబ్ధ్వా మహారాజసః, తే సుతే పితరం హృష్టం చక్రాతే మాతరం తథా. 79. అథ భాగ్యవతీ కామమైశ్వర్యమదమోహితా, కాలే గతే బహుతిథే వ్రతమేతన్ముమోచ సా. 80. సౌభాగ్యహీనా పుత్రేణ సహ భర్త్రా వివాసితా, వనసంచారఖిన్నా హి జగామ శబరాలయమ్. 81. తతః పుత్రం సమాహూయ వాక్యమేతదువాచ హ, ఉపయేమే స్వసారం మే జ్యేష్ఠాముజ్జయినీపతిః. 82. తాం దృష్ట్వా ధనమాదాయ శీఘ్రమాగచ్ఛ పుత్రక, ఇతి మాతుర్వచః శ్రుత్వా జగామోజ్జయినీం పురీమ్. 83. గత్వా నివేదయామాస పుణ్యవత్యై సపుత్రకః, మాతుర్వివాసనం రాజ్యాద్వనవాసం చ దుస్సహమ్. 84. తతః పుణ్యవతీ శ్రుత్వా దదౌ తస్మై మహద్ధనం, ధనమాదాయ సప్రీతః ప్రయయౌ మాతరం

ప్రతి. 85. గచ్ఛన్మార్గే హృతః సోఽభూద్దేవేనాదృశ్యరూపిణా, పునర్గత్వా ధనం గృహ్య గచ్ఛత స్తస్య తద్ధనమ్. 86. జహారేశో జగాదైనం నితరాం దీపమానసం, గచ్ఛభాగవతీపుత్ర మా విషాదం వృథా కృథాః. 87. అయోగ్యం భవతో హ్యేతద్వ్రతం మేచరతాంధనం, ఇతి శ్రుత్వా వచ స్తస్య కిమేతదితివిస్మితః. 88. పుణ్యవత్యై జగాదైతత్పునర్గత్వా సుతస్తదా, సా తద్విజ్ఞాయ నిపుణా కారయామాస తద్వ్రతమ్. 89. భగిన్యా తు యథా పూర్వం క్రియతామిత్యువాచ హ, వ్రతాన్తే ధనమాహృత్య గచ్ఛన్ పూర్వహృతం ధనమ్. 90. సంప్రాప్య తత్తదేకాన్తే ప్రీతః స్థిత్వా మహాధనం, ఆదాయ మహతీం సేనాం గజాశ్వరథసంకులామ్. 91. జగామ కాంచీం నగరీం పిత్రా ప్రత్యుద్గతో బలీ, మాత్రాపిత్రా చ సహితశ్చిరకాలమవర్తత. 92. తదాప్రభృతి మాతా చ చకార వ్రతమాదరాత్, స చ చోళనృపః ప్రీత స్తదాప్రభృతి తద్వ్రతమ్. 93. యథోక్తేన విధానేన యఃకరో దీప్సితం లభేత్, ఇతివ్రతస్య మాహాత్మ్యం యే శృణ్వన్తి పఠన్తి వా. 94. తేషామపి మహాదేవః ప్రీతో భవతి సర్వదా, ఆయుష్కరం పుష్టికరం శ్రీకరంచ యశస్కరమ్. 95. వ్రతమేతన్మయా దిష్టం గౌతమేన మహాత్మనా, ఆత్మనో హితమాకాంక్షన్వ్రతమే తత్సమాచరేత్. 96. మహతీం సంపదం ప్రాప్య శివసాయుజ్య మశ్నుతే. 97. ఇతి శ్రీస్కాందపురాణోక్త కేదారేశ్వర వ్రత కల్పః కథాసహితః సమాప్తః.

## కేదారేశ్వర వ్రతకథ

సూతపౌరాణికుఁడు శౌనకాదిమహామునులను చూచి యిట్లనియె. ఓమునులారా! ప్రపంచమంతయు నెవ్వనియందు

గ్రహాముచేత సృజింపఁబడినదో, అట్టిభగవంతుని బార్వతీశ్వరుని నమస్కరించి, సకలసంపదలును నొసఁగునట్టిదియు, తొల్లి యనేకమునులచే నాచరింపఁబడినదియు నైన కేదారవ్రతము యొక్క మహిమను లోకముల క్షేమాభివృద్ధిఁ గోరి చెప్పుచున్నాను వినుఁడు. తొల్లి పార్వతీదేవి యీవ్రతము నాచరించి, సకలసంపదలను బొందెను. ఈవ్రతంబు నాచరించువారికిని, ఈ వ్రతమహిమ విన్నవారికిని ఆయురారోగ్యసంపత్కీర్తులు గలుగుచున్నవి. ఈయుత్తమవ్రతంబు నేమానవుఁ డిరువదియొక్క పర్యాయములు చేయుచున్నాఁడో, వాఁడు ఇహంబున గొప్ప యదృష్టమును, కాంతిని, ఆయుస్సును కలవాఁడై యుండి, పరలోకంబున శివసాయుజ్యము నొందుచున్నాఁడు. కావున నాలుగువర్ణంబులవారును నియమముతోఁ గూడినవారై ఈ వ్రతంబు నాచరింపవలయును.

వ్రతకథాక్రమం బెట్లనిన :

భూలోకంబున ఈశాన్యమూలయందు కైలాసం బనెడి పర్వతం బొక్కటి కలదు. ఆపర్వతంబున మెఱుపులతోఁగూడిన శరత్కాలమేఘంబులో యనఁదగి సకలరత్నములతోఁగూడిన తెల్లని వెండిశిఖరములు వెలుఁగుచుండును. సాలతమాలహింతాల వకుళాశోక కరకనింబచందన దేవదారుపనసామ్ర పూగపున్నాగ చంపక ప్రముఖ నానావిధపుష్పఫలభరితవృక్షములతోఁగూడి, పలు తెఱంగులగు పులుఁగులకూఁతలును, పలువిధంబులగు సెలయేళ్లును గలిగియుండును. యోగులెల్లరు నాపర్వతశిఖరమున నుందురు. అచ్చటనే యక్షకిన్నరగంధర్వసిద్ధచారణవిద్యాధరులు వాసము చేయుచుందురు. ఆరమ్యమైన పర్వతశ్రేష్ఠమున సర్వవ్యాపి

యగుపరమశివుఁడు ప్రమథగణంబులు చుట్టు గొల్వుగొల్చు చుండఁగాఁ బార్వతీసమేతుఁడై, దేవతల కందఱకు దర్శనం బొసఁగెను. అప్పుడు అగ్ని వాయు సూర్యచంద్రాదు లగుసకల దేవతలును, వసిష్ఠుఁడు మొదలగు సకలఋషులును, బ్రాహ్మి మొదలగు అష్టసిద్ధులును, రంభ, తిలోత్తమ, మేనక మొదలగు దేవకాంతలును, చండిక మొదలగు సప్తమాతలును, వినాయకుఁడును, కుమారస్వామియు, నందుఁడు మొదలగు ప్రమథగణంబులును సారూప్యము నొందియుండిరి. అప్పు డాసభయందుఁ బరమేశ్వరుని ప్రేరణంబున నారదుఁడు మొదలగు ఋషులు గానంబు చేసిరి. ఆఋషులు సకలశ్రావ్యముగా గానంబుచేయు చుండఁగా, వారిగానములకుఁ దగినట్లు వాద్యముల వాయించుచు, తాళములు వేయుచు, రంభాదులగు అప్సరసలు నాట్యంబు సల్పిరి.

వారందఱిలోపలఁ గడుచక్కనిదైనరంభ మిక్కిలి వినోదముగా నాట్యము సల్పి యీశ్వరునికిఁ బరమసంతోషమును గలిగించెను. అప్పుడు భృంగిరిటి యను ప్రమథుఁడు శివుని యనుమతి వడసి, యప్పరమశివునికిని, సకలదేవతలకును నవ్వుపుట్టునట్లు పార్వతీపరమశివుల ముందట హాస్యము చేసెను. ఆహాస్యమును చూచి దేవతలందఱు పర్వతగుహలు మాఱుమ్రోగునట్లు కడుపు లుబ్బునట్లు నవ్విరి. ఆ ప్రహాసనము ముగిసినతర్వాత పరమశివుఁడు తన భక్తునిఁ జూచి, ఓభృంగిరిటీ! బాగుగా హాస్యము చేసితివి. నీప్రహాసనమునకు మిక్కిలి యానందించితినని యాభృంగిరిటిపై మిక్కిలి ప్రేమగలవాఁ డయ్యెను. అంతట నాభృంగిరిటి శివుని యొక్కయుఁ, దేవతలయొక్కయు మన్ననలను బడిసి, పార్వతీ

దేవిని విడిచి, పరమశివునికి మాత్రము ప్రదక్షిణము గావించి నమస్కరించెను. అప్పుడు పార్వతి తననాథునిఁజూచి "యీభృంగి రిటి నన్నువదలిపెట్టి నీకుమాత్రము ప్రదక్షిణంబు గావించినాఁ డందుకేమి కారణం" బని యడుగఁగా శశిశేఖరుఁడును "ఓ ప్రియా! బ్రహ్మము నెఱిఁగిన యోగులు నిన్ను మ్రొక్కరు. వారికి నీవలనఁ బనిలేదు. అని పార్వతికిఁ జెప్పెను.

ఇట్లు పరమశివుఁడు చెప్పఁగాఁ బార్వతి తనప్రియుని మీఁది కోపముచే నతనిని బాసి తనశక్తి నాకర్షింపఁగా, పరమేశ్వరుఁడును ప్రియావియోగముచే జిక్కిపోయెను. అంబికయు ప్రియవియోగముచే మిక్కిలి చిక్కి, దేవతలు వేఁడు కొనుచున్నను, శాంతినొందక కైలాసము విడిచి, యొండొంటి మీఁద పగలేని సింహవ్యాఘ్రమృగంబులతోఁ గూడినదియు, మహర్షుల కునికిపట్టును, జనులకంచటకుఁ బ్రీతికరమై యన్ని కోర్కుల నొసఁగునదియు నైన గౌతమవనంబునకుఁ బోయి సేరెను. ఎక్కువ బ్రహ్మతేజస్సుగల గౌతమమహాముని వనంబునఁ బెరుగు హోమయోగ్యము లగుసమిధలను, దర్భలను బండ్లను గైకొనివచ్చుటకై వనాంతరములకుఁ బోయియుండెను. తర్వాత నమ్మహర్షి కావలసిన వస్తువులను గైకొని మరలి, తన యాశ్రమము చేరువకు వచ్చి, "ఏమి యీవింత? ఈతపస్సుల యాశ్రమంబు అకాలమున మిక్కిలి శోభిల్లుచున్నది. కారణ మేమైయుండవచ్చును" అని యాలోచించుచు, తపోవనంబులోపలఁ బ్రవేశించి, కమలంబులంబోలు కన్నులుగల పార్వతిం జూచి యతిథిపూజనేసి యాగమనకారణం బేమని

పార్వతీదేవి నడిగెను. ఆపార్వతి తన విచారంబునకుఁ గారణం బెఱింగించి యాతనినిఁ గూర్చుండఁజేసి "ఓభగవంతుఁడా! సకలయోగులు పూజించెడి యీశ్వరుని యర్ధాంగము నాకెట్లు సిద్ధించునో, యట్టివ్రత మొక్కటి యానతీ"మ్మని యడిగెను. అంతట గౌతమమహాముని సకలశాస్త్రములను పురాణములను బరికించి, "కోరిన కోర్కెల నొసఁగు కేదారేశ్వరవ్రతంబు నాచరింపుము. నీకోరిక సిద్ధించు"నని చెప్పెను. ఆపార్వతి ముని పలుకులు విని, "ఓమహాత్మా! ఆవ్రతంబు సేయుట యెట్లు? శాస్త్రవిధానంబు నెఱింగింపుము." అని యడుగఁగా, నాగౌతమ మునీంద్రుఁ డాపార్వతీదేవి కిట్లనెను. ఆశ్వయుజశుద్ధ అష్టమి నాఁడు మానవుఁడు పరిశుద్ధుఁడై తెల్లపట్టువికాని లేక నూలు పోఁగువికాని యిరువదియొక్క పేటలనూలిని జేతికి కంకణము కట్టుకొనవలయును. ఆరాత్రి యుపవాసముండి బ్రాహ్మణభోజ నంబు చేయింపవలెను. అదిమొదలమావాస్యవఱకుఁ బ్రతిదిన మును కేదారనాథుని బూజచేయవలయును.

ఆవ్రతంబు సేయువిధం బెట్లనిన; ప్రతిదిన ముదయమున లేచి పరిశుద్ధమై విజనమైయుండు స్థలంబున ధాన్యమును రాశి పోసి దానిమీఁద నొకపూర్ణకుంభము నునిచి, దాని నిరు వదియొక నూలిపోగులతోఁ జుట్టి దానిమీఁద తెల్లని బట్టు బట్టగాని, లేక మఱేవస్త్రమునుగాని చుట్టి, నవరత్నములను గాని, బంగారమునుగాని, వెండినిగాని దానియందుంచి, గంధ పుష్పాక్షతాదులతో నాకలశంబును పూజించి, యానల నిరువది యొక్కమంది బ్రాహ్మణులను బిలిచి, కాళ్లు కడిగి పీఁటలమీఁదఁ గూర్చుండఁబెట్టి, పురోహితునికి ముందుగాఁ బూజసేసి, పిమ్మట

నాయిరువదియొక్కమంది బ్రాహ్మణులను బూజింపవలెను. తర్వాత కలశమునందు కేదారదేవుని నావాహనము చేసి, చందనాగరు కర్పూర కస్తూరి కుంకుమాదులతోను, గంధపుష్ప అక్షతలతోను, నానావిధవస్త్రములతోను బూజించి, ధూపదీపంబులొసఁగి, గోధుమపిండితోఁజేసి నేతిలోఁ గాల్చిన యిరువదియొక్క యతిరసములను, పాయసమును, పాలు, పెరుఁగు, నెయ్యి, తేనె మొదలగువానితో నిండిన సకలవిధశాకంబులను, పలుతెఱఁగులైన యరఁటి మామిడి కిచ్చిలి మొదలగు పండ్లను నివేదనసేసి, తాంబూలనీరాజనమంత్రపుష్పములొసఁగి, కేదారనాథుని బలువిధంబుల స్తోత్రములు సల్పి పూజయైనపిదప బ్రాహ్మణుల కందఱికి భూరిదక్షిణాతాంబూలము లొసఁగి వ్రతంబు పూర్తిసేసి యాకేదారేశ్వరుని సంతోషపెట్టుము. అంతటఁబరమేశుఁడు వేల్పులందరితోఁగూడ వచ్చి నీకు స్వదేహములో నర్ధాంశము నొసఁగునని చెప్పెను.

అంతటఁ బార్వతి మునీంద్రుఁడు చెప్పినచొప్పున బహుభక్తితో నాకేదారేశ్వరవ్రతంబు నాచరించెను. తర్వాత భగవంతుఁడగు వృషధ్వజుఁడు వేల్పుగుములతోడఁ బ్రత్యక్షమై పార్వతికిఁ దనదేహములో సగముభాగము నొసఁగెను. తర్వాత పార్వతి మిక్కిలి సంతోషపడి, యీశ్వరుని యర్ధశరీరమును బొంది, లోకులమేలుగోరి యీశ్వరుని సంతోషపరచి కేదారేశ్వరుని యనుగ్రహంబువలనఁ గోరినకోర్కెలెల్ల భక్తుల కొసఁగునట్లు వరంబుగోరెను. పరమేశ్వరుఁడును అట్లే కలుగునుగాక యని యనుగ్రహించి, వేల్పులందరితోఁగూడి యంతర్ధానము నొందెను. అప్పు డచ్చటనుండిన శివభక్తుఁడయిన చిత్రాంగదుఁ

డను గంధర్వుఁడు నందికేశ్వరుని యనుగ్రహము బడసినవాఁడై తాను భూలోకంబున నీవ్రతంబును బ్రచారంబు చేయనెంచిన వాఁడై యుజ్జయినీపట్టణమునకు వచ్చి "ఓనాథా! కేదారనాథ వ్రతంబు సల్పితివేని, నీకు సకలసంపదలు గలుగు" నని వజ్రదంతుఁడను యుజ్జయినీదేశపురాజున కెఱింగించెను. ఆవజ్రదంతుఁ డీ వ్రతంబు నాచరించి దేశములకెల్లఁ బ్రభువాయెను. ఆపట్టణమున నిద్దఱు వైశ్యకన్యక లుండిరి. వారు తమతండ్రికడకు వచ్చి నాయనా! మేము కేదారేశ్వరవ్రతంబు సేయ నెంచియున్నాము. మా కానతిమ్మని యడిగిరి. దానికి, తండ్రి, "పిల్లలారా! నేను దరిద్రుఁడను. మీ రాతలంపు మానుకొండు" అని చెప్పెను. అంత నాకన్యకలు "నాయనా! నీవేమి యియ్యనక్కరలేదు. నీవుత్తరు విచ్చినయెడలఁ జాలును" యని యడిగిరి. ఆప్రకారమే తండ్రి యుత్తరవిచ్చెను. తర్వాత వారి భక్తికి మెచ్చి, ఈశ్వరుఁడు తానే వారికిఁగావలసిన వస్తువులు దొరకునట్లు ప్రసాదించెను. అంత వారలిద్దఱు నొకమఱ్ఱిచెట్టు క్రిందికిఁ బోయి మొదట కంకణము కట్టుకొని యీ వ్రతంబును యథావిధిగా నాచరించిరి. అంతట మహాదేవుఁడు కడుసుప్రసన్నుఁడై, వారికి సురూపంబును, దీర్ఘజీవితంబును, తరుగనికలిమిని నొసఁగి యంతర్ధానము నొందెను. ఆయిద్దఱక్కసెల్లెండ్రలోఁ బెద్దదగుపుణ్యవతి నుజ్జయినీరాజు పెండ్లాడెను. మఱొక్కతె యగుభాగ్యవతిని చోళదేశపురాజు పెండ్లాడెను. ఆవైశ్యుఁడును తనకొమార్తెలను రాజుల కిచ్చుటచే మిక్కిలి కలిమినొంది సుఖంబుండెను. ఆయిద్దఱు వైశ్యపుత్రికలును సామ్రాజ్యమును సంపదను మహాబలులగు కొడుకులను బడసి సుఖంబుండిరి. తర్వాతఁ గొంతకాలమునకు భాగ్యవతి

రైశ్వర్యమదముచే మై మఱచినదై, యాకేదారేశ్వర వ్రతంబు నుల్లంఘనము చేసెను. అది కారణంబుగా నాభాగ్యవతిని కొడుకుతోఁగూడ దానిభర్త యొక్క కారణంబుచే రాజ్యమునుండి తఱిమెను.

అంతట నాభాగ్యవతి తనపిల్లవానితోడ నడవులెల్లఁదిరిగి మిగులడస్సి, కడపట నొకబోయవానియిల్లుజేరి, తనకొడుకును బిలిచి, "నాయనా? యీయుజ్జయినీరాజుభార్య నాకక్కగావలెను. కావునఁ బెత్తల్లికడకుఁ బోయి, మనసంగతి యెఱిఁగించి, ధనముఁ గొనిరమ్మని చెప్పిపంపెను. ఆబాలుఁడును ఉజ్జయినికేగి తనపెత్తల్లి యగుపుణ్యవతికిఁ దనతల్లి రాజ్యమునుండి తఱుమ గొట్టఁబడి యడవులం బడుమలుపడుచుండుట చెప్పి యామె యిచ్చిన విస్తారధనంబును గైకొని వచ్చుచుండెను. దారిలోఁ గేదారేశ్వరుఁడు దొంగవలె వచ్చి యాధనము నపహరించుకొని పోయెను. మఱల నబ్బాలుఁడు వెనుకకుఁ బోయి, తాపడిన తంటాలు చెప్పి, మఱలసొమ్ముగొనివచ్చుచుండఁగా కేదారేశ్వరుఁడు ముందటివలె నతనికిఁ గనఁబడకవచ్చి సొమ్ముదోఁచుకొని, దీనుఁడైన యాబాలునిఁ జూచి 'ఓభాగ్యవతీపుత్రుఁడా! వ్యసనంబు నొందకుము. నావ్రతంబు నుల్లంఘించినవారి కీధనంబు దగదు' అనిచెప్పెను. అంత నా బాలుఁడు, బుణ్యవతి కీవృత్తాంతంబును జెప్పెను. అంతటఁ బుణ్యవతి యాబాలునిచే నావ్రతంబు చేయించి, అబ్బాయీ! తల్లిచేత నీనోము నోమించుమని చెప్పి వానికిఁ గావలసిన ధనం బొసఁగి పంపెను.

అంతట నాబాలుఁడాధనంబును గైకొనివచ్చుచుండఁగా, ముందు దానుబోఁగొట్టినధనమంతయు దారిలోఁ బడియుండెను

ఆబాలుఁ డాధనంబునుగూడ దీసికొని, తల్లికడకువచ్చి, జరిగిన సంగతియెల్ల నామెతోఁ జెప్పెను. ఆభాగ్యవతియుఁ దానుల్లంఘనముచేసియుండిన కేదారవ్రతంబును మఱల భక్తితోఁజేసి, తనతప్పిదమును క్షమింపఁ గేదారనాథుని వేఁడెను. తర్వాత నాబాలుఁడు కేదారనాథుని యనుగ్రహామువలనఁ జతురంగ బలముతోఁ గూడినవాఁడై కాంచీపురంబునకు రాఁగా, చోళ రాజగు తనతండ్రి యెదురేఁగి వారిని బిల్చుకవచ్చి, బహు కాలము పెంపొందుచుండెను.

అదిమొదలు భాగ్యవతియు, చోళరాజును ఆవ్రతంబును జేయుచు సకలసంపదలతో నిండి రాజ్యపరిపాలనము చేయుచుండిరి. ఈవ్రతంబు గౌతమమునీంద్రుఁడు పార్వతి కుపదేశించినది గనుక నిహపరసుఖముఁ గోరుమానవుఁ డీవ్రతంబును జేసెనేని యిహమున సకలాభీష్టములను బొంది,యనంతరమునఁబరమశివుని సాయుజ్యమును బొందును. ఈవ్రతమహిమ విన్నవారికిని చదివినవారికిని మహాదేవుఁడు సర్వసంపదల ననుగ్రహించును.

ఇది స్కాందపురాణోక్త కేదారవ్రతకథ

సంపూర్ణము.

# శ్రీ ఇష్టకామేశ్వరీలక్ష్మీ వ్రతము



*ఆచమ్య. శుక్లాంబరధరం విష్ణుమిత్యాది...భూర్భువః సువరోమ్. మమ ఉపాత్తసమస్తదురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే...అస్మాకం సహకుటుంబానాం క్షేమస్థైర్యవిజయాయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం ధర్మార్థకామమోక్ష చతుర్విధఫలపురుషార్థచతుష్టయ సిద్ధ్యర్థం సర్వ శ్రేయోమంగళావాప్త్యర్థం శ్రీ ఇష్టకామేశ్వరీ మహాలక్ష్మీదేవతా ముద్దిశ్య శ్రీఇష్టకామేశ్వరీప్రీత్యర్థం కల్పోక్తేన విధానేన యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచారపూజాం కరిష్యే. తదంగత్వేన కలశపూజాం కరిష్యే (కలశపూజచేసి) ఆదౌ గణాధిపతి పూజాం కరిష్యే. (మొదట గణాధిపతిపూజ చేసి) శ్రీఇష్టకామేశ్వరీమహాలక్ష్మీప్రాణప్రతిష్ఠాపనం కరిష్యే.

(శ్రీఇష్టకామేశ్వరీప్రాణప్రతిష్ఠాపనము చేసి) పూజామారభేత (పూజనారంభింపవలెను.)

## ఇష్టకామేశ్వరీపూజాప్రారంభము

కామేశ్వరీం భక్తవరప్రదాయినీం
గృహే గృహే పూజితపాదపద్మాం,
సర్వంసహాం సర్వనమస్కృతాం శివాం
భజేహ మంబాం జగదీశ్వరీం తామ్.

ఇష్టకామేశ్వరీమహాలక్ష్మీం ధ్యాయామి.

---

*కలశపూజ, గణాధిపతిపూజ, ప్రాణప్రతిష్ఠాపనవిధులు వినాయకవ్రతమునందువలెనే చేయవలెను.

భక్తులకోరికల నీడేర్చునట్టియు, నింటింట నెల్లరచే పూజింపఁ బడునట్టి సకలలోకధారిణియు జగత్తుల నేలు మంగళకరురాలైన ఇష్టకామేశ్వరీదేవీమతల్లిని నెల్లవేళల పూజించెదను. అని ధ్యానము చేయవలెను.

మం. తాం మ ఆవహ...పురుషానహమ్.

ఆవాహయేజ్జగద్ధాత్రీం జగత్స్థిత్యంతకారిణీమ్.
బ్రహ్మాదిపూజితాం మంబాం భక్తాభీష్టప్రదాయినీమ్.
శ్రీఇష్టకామేశ్వరీ మహాలక్ష్మీం ఆవాహయామి.

జగత్తుల ధరించునదియు స్థిత్యంతములఁ జేయునదియు బ్రహ్మాది దేవతలచే నర్చింపఁబడునదియు, భక్తులకోరికల నిచ్చునదియునగు కామేశ్వరీదేవి నిందు నిల్పెదను.

సర్వేశాయై సర్వమాత్రే సర్వలోకాదిపూజితే,
సర్వమంగళదాయిన్యై శివాయై చ నమోనమః.
ఇష్టకామేశ్వరీ మహాలక్ష్మ్యై రత్నసింహాసనం సమర్పయామి

లోకములఁ బ్రోచు మంగళరూప యగు ఇష్టకామేశ్వరీదేవిని నమస్కరించెదను.

మం. అశ్వపూర్వాం...జుషతామ్.

సురనారీభిరారాధ్యే సురాసురనమస్కృతే,
సర్వాభీష్టవిధాయిన్యై త్రిలోకేశి నమోస్తు తే.
శ్రీఇష్ట...లక్ష్మ్యై అర్ఘ్యం సమర్పయామి.

దేవదానవులయర్చన లందినట్టియు దేవప్రమదలచే నెల్లవేళల నర్చింపఁబడు కోరికల నిచ్చు దేవిని నమస్కరించెదను. (అక్షతలు పుష్పముతోఁ జేర్చి ఉదకముతో అర్ఘ్యపాత్రలో వదలవలెను.)

మం. కాంసోస్మితాం...శ్రియం.

ఆచమ్య తాం మహాదేవి సర్వదేవైశ్చ పూజితే,
మయా దత్తేన తోయేన సర్వేషాం ప్రతిబోధిని.

శ్రీఇష్ట...లక్ష్మ్యై ఆచమనీయం సమర్పయామి.

దేవతలచే పూజింపఁబడు ఓతల్లీ! నేనొసగు ఈజలమును ఆచమనముగా స్వీకరింపుము.

మం. చంద్రాం ప్రభా...శ్రియం.

మధుపర్కం మయా దత్తం స్వీకురుష్వ శివప్రియే,
సంసారసాగరాదస్మాత్త్రస్తం బ్రహ్మాదిపూజితే.

శ్రీఇష్ట...లక్ష్మ్యై మధుపర్కం సమర్పయామి.

సంసార మనెడు సముద్రమును దాటుటకుగా బ్రహ్మాదులచే పూజింపబడు ఓదేవీ! మధుపర్కమును సమర్పించుచున్నాను. స్వీకరింపుము.

మం. ఆదిత్యవర్ణే...అలక్ష్మీః.

స్నానార్థం తే మయాఽఽనీతం గౌతమీసలిలం శుభం,
అనేన సలిలేనాద్య స్నానం కురు మహామతే.

శ్రీఇష్ట...లక్ష్మ్యై స్నానం సమర్పయామి.

ఓదేవీ నీకొరకు గౌతమీనదినుండి ఉదకమును దెచ్చితిని. దానస్నానము చేయుము.

మం. ఉపైతు మాం...దదాతు మే.

దుకూలం స్వీకురుష్వేదం స్వర్ణబిందుసమాయుతమ్,
ఉత్తరీయం కంచుకం చ తథావిధమతంద్రితే.

శ్రీఇష్ట...లక్ష్మ్యై కంచుకసహితవస్త్రం సమర్పయామి.

బంగారుబుటలుకల పట్టుచీరెను రవికను ఉత్తరీయమును సమర్పించుచున్నాను ఓదేవీ! స్వీకరింపుము.

కేయూరకంకణే దివ్యే హారనూపురమేఖలాః,
విభూషణాన్యమూల్యాని గృహాణ ఋషిపూజితే.
శ్రీఇష్ట...లక్ష్మ్యై ఆభరణాని సమర్పయామి.

మునులెల్లరిచే పూజింపఁబడిన ఓవెలలేని మురుగులను హారములను దండకడియములను మొలత్రాడును మొదలగు నాభరణములను సమర్పించుచున్నాను.

మం. గంధద్వారాం—

శ్రీగంధం చందనోన్మిశ్రం కుంకుమాగరుసంయుతం,
కర్పూరేణచ సంయుక్తం విలేపయ సురేశ్వరి.
శ్రీఇష్ట...లక్ష్మ్యై గంధం సమర్పయామి.

చందనముతో కలుపఁబడినదియు కుంకుమ, పరిమళద్రవ్యములచే సంస్కరింపఁబడినదియు కర్పూరముతో కూర్పఁబడినదియు నయిన రక్తచందనమును సమర్పించుచున్నాను.

మం. మనసః...యశః.

అక్షతాన్ రక్తవర్ణాంశ్చ కస్తూర్యాదిసుసంయుతాన్,
శోభనాంశ్చ మయా దత్తాన్ స్వీకురుష్వ దయానిధే.
శ్రీఇష్ట...లక్ష్మ్యై అక్షతాన్ సమర్పయామి.

ఎఱ్ఱటిరంగుఁగలవై కస్తూరిమొదలగు పరిమళద్రవ్యములచే మెదపబడిన అక్షతలను సమర్పించుచున్నాను.

మం. కర్దమేన...మాలినీమ్.

మల్లికాశతపత్రైశ్చ జాజీపున్నాగకేతకైః,
వకులైశ్చమ్పకాద్యైశ్చ పూజయామి సురేశ్వరి.
ప్రతినామమునకు చివర "పూజయామి" అని చేర్చవలెను.

జాజి సురపొన్న మొగలి పొగడ పద్మములాదిగాగల యనేక పుష్పములచే శ్రీఇష్టకామేశ్వరీలక్ష్మిని పూజించెదను.

---

అథాంగపూజా

ప్రతినామము చివర "పూజయామి" అని చేర్చవలెను.

| | |
|---|---|
| శ్రీఇష్టకామేశ్వరీ మహాలక్ష్మ్యై నమః | పాదౌ |
| లోకమాత్రే నమః | జానునీ |
| మహోద్యుతయే నమః | గుల్ఫౌ |
| క్షీరాబ్ధి సముద్భవాదిపూజితాయై నమః | ఊరూ |
| సర్వఋషిపత్నీభిః పూజితాయై నమః | కటిం |
| గంగాసైకతజఘనాయై నమః | జఘనం |
| గుహ్యవరదాయై నమః | గుహ్యం |
| గగనమధ్యలలితాయై నమః | మధ్యం |
| సర్వకుక్షిధరాయై నమః | కుక్షిం |
| వల్మీకనాభిగత్యాయై నమః | నాభిం |
| మహోదరాయై నమః | ఉదరం |
| సర్వోదార్యగుణాయై నమః | వక్షస్థలం |
| గిరికుచాయై నమః | కుచౌ |
| సర్వవ్యాపికంబుకంఠాయై నమః | కంఠం |
| పూర్ణేందునిభాననాయై నమః | ముఖం |
| తమోఘ్ననేత్రకమలాయై నమః | నేత్రే |
| విశ్వశ్రోత్రాయై నమః | శ్రోత్రే |
| కమలహస్తాయై నమః | హస్తౌ |
| సర్వాభీష్టదాయిన్యై నమః | శిరః |

నీలమేఘద్యుతికబరాయై నమః కబరీభారం
సర్వమంత్ర సంవాసినీ మంగళదాయినీ శివాయైనమః
సర్వాణ్యంగాని పూజయామి.

## అ ష్టో త్త ర శ త నా మ పూ జా

"నమః" అని ప్రతినామముకడపట చేర్పవలెను

ప్రకృత్యైనమః
వికృత్యై
విద్యాయై
సర్వభూతహితప్రదాయై
శ్రద్ధాయై
విభూత్యై
సురభ్యై
పరమాత్మికాయై
వాచే
పద్మాలయాయై 10
పద్మాయై
శుచయే
స్వాహాయై
స్వధాయై
సుధాయై
ధన్యాయై
హిరణ్మయ్యై
లక్ష్మ్యై
నిత్యపుష్టాయై
విభావర్యై నమః 20
అదిత్యై
దిత్యై
దీప్తాయై
వసుధాయై
వసుధారిణ్యై
కమలాయై
కాంతాయై
కామాక్ష్యై
క్రోధసంభవాయై
అనుగ్రహపదాయై 30
బుద్ధయే
అనఘాయై
హరివల్లభాయై
అశోకాయై
అమృతాయై
దీప్తాయై
లోకశోకవినాశిన్యై
ధర్మనిలయాయై

కరుణాయై నమః
లోకమాత్రే 40
పద్మప్రియాయై
పద్మహస్తాయై
పద్మాక్ష్యై
పద్మసుందర్యై
పద్మోద్భవాయై
పద్మముఖ్యై
పద్మనాభప్రియాయై
రమాయై
పద్మమాలాధరాయై
దేవ్యై 50
పద్మిన్యై
పద్మగంధిన్యై
పుణ్యగంధాయై
సుప్రసన్నాయై
ప్రసాదాభిముఖ్యై
ప్రభాయై
చంద్రవదనాయై
చంద్రాయై
చంద్రసహోదర్యై
చతుర్భుజాయై 60
చంద్రరూపాయై
ఇందిరాయై

ఇందుశీతలాయై నమః
ఆహ్లాదజనన్యై
పుష్ట్యై
శివాయై
శివకర్యై
సత్యై
విమలాయై
విశ్వజనన్యై 70
తుష్టయే
దారిద్ర్యనాశిన్యై
ప్రీతిపుష్కరిణ్యై
శాంతాయై
శుక్లమాల్యాంబరాయై
శ్రియై
భాస్కర్యై
బిల్వనిలయాయై
వరారోహాయై
యశస్విన్యై 80
వసుంధరాయై
ఉదారాంగాయై
హరిణ్యై
హేమమాలిన్యై
ధనధాన్యకర్యై
సిద్ధయే

స్త్రైణసౌమ్యాయై నమః
శుభప్రదాయై
నృపవేశ్మగతానందాయై
వరలక్ష్మ్యై ౯౦
వసుప్రదాయై
శుభాయై
హిరణ్యప్రాకారాయై
సముద్రతనయాయై
జయాయై
మంగళా దేవ్యై
విష్ణువక్షస్థలస్థితాయై
విష్ణుపత్న్యై నమః
ప్రసన్నాక్ష్యై
నారాయణసమాశ్రితాయై 100
దారిద్ర్యధ్వంసిన్యై
దేవ్యై
సర్వోపద్రవవారిణ్యై
నవదుర్గాయై
మహాకాళ్యై
బ్రహ్మావిష్ణుశివాత్మికాయై
త్రికాలజ్ఞానసంపన్నాయై
భువనేశ్వర్యై 108

అష్టోత్తరశతనామపూజాం సమర్పయామి.

మం. అపప్రజం...కులే.

వనస్పతిరసైర్దివ్యైర్గంధాఢ్యైస్సుమనోహరైః
కపిలాఘృతసంయుక్తః ధూపోయం ప్రతిగృహ్యతామ్.

శ్రీఇష్ట...లక్ష్మ్యై ధూపమాఘ్రాపయామి.

మంచివాసనలుగల వృక్షసారములును, కపిలగోవునేయియు గలధూపమును సమర్పించుచున్నాను గ్రహింపుము.

మం. ఆర్ద్రాం పుష్కరిణీం...మమావహ.

సాజ్యం త్రివర్తిసంయుక్తం వహ్నినా యోజితం మయా,
గృహాణ మంగళం దీపం త్రైలోక్యతిమిరాపహమ్.

శ్రీఇష్ట...లక్ష్మ్యై దీపం దర్శయామి.

ముల్లోకములందలి యంధకారము నపహరించు మూఁడు వత్తులువేసి నేయి పోసి వెలిగించినదీపము గ్రహింపుము.

ధూపదీపానంతరం ఆచమనీయం సమర్పయామి. (ఉద్ధరిణతో ఉదకమును చేత నుంచుకొని పళ్లెములో విడువవలెను.)

మం. ఆర్ద్రాం యః...మమావహ.

నైవేద్యం షడ్రసోపేతం నానాభక్ష్యసమన్వితం,
సుస్వాదు గృహ్యతాం దేవి నారాయణి నమోస్తు తే.

ఆఱురుచులగూడిన మధురమైననైవేద్యము నో లక్ష్మీ! స్వీకరింపుము.

ఉత్తరాపోశనాదికం సమర్పయామి.

మం. తాంమ్మ ఆవహ...నహమ్.

పూగీఫలసమాయుక్తం నాగవల్లీదళైర్యుతమ్,
కర్పూరచూర్ణసంయుక్తం తాంబూలం సమర్పయామి.

శ్రీఇష్ట...లక్ష్మ్యై తాంబూలం ప్రతిగృహ్యతామ్.

పోకలు పచ్చకర్పూరము తక్కుంగలవాసనద్రవ్యములుగల తాంబూలమును గ్రహింపుము.

మం. హిరణ్యపాత్రం...దధాతి.

నీరాజనం సుమంగల్యం బహువర్తిసమన్వితమ్,
సంగృహాణ సురాధ్యక్షే మయా దత్తం సురేశ్వరి.

శ్రీఇష్ట...లక్ష్మ్యై ఉత్తరనీరాజనం సమర్పయామి.
నీరజనానంతరం ఆచమనీయం సమర్పయామి.

మం. ధాతా...విద్యతే.

నిత్యం సకలకళ్యాణి భోగమోక్షప్రదాయిని,
సువర్ణమంత్రపుష్పాణి ప్రీత్యర్థం తవ సువ్రతే.

శ్రీఇష్ట...లక్ష్మ్యై మంత్రపుష్పం సమర్పయామి.

మయా కృతామిమాం పూజాం స్వీకృత్య క్షణదాయినీ,

కృతార్థం మాం విధాయాశు సుప్రీతా భవ కామదే!
మంత్రహీనం క్రియాహీనం శక్తిహీనం శివప్రియే
యత్పూజితం మయా దేవి పరిపూర్ణం తదస్తు తే.
అనయా పూజయాచ శ్రీఇష్టకామేశ్వరీ మహాలక్ష్మీః
సుప్రీతా వరదా భవతు.

---

అథ కథా

కదాచిన్నైమిశారణ్యే అహల్యా లోకపావనీ, జరయాతుసమాయుక్తారోగై ర్బహుభిరావృతా.౧.దుస్స్వప్నభీతా దుఃఖార్తా నైకాం త్యం సమపద్యత, నిత్యం నిత్యం రుజా పీడా బాధతే తాం దివానిశమ్. ౨. భూతైః పిశాచైరాక్రాన్తా పతిమాహ సుమధ్యమా, గౌతమంతు మునిశ్రేష్ఠం సర్వవిద్యా విశారదమ్. ౩. నిత్యస్నానరతం దాంతం శాంతం ధీరం శివావహమ్, సర్వమంత్రార్థవిశదం సర్వయంత్రవిశారదమ్.౪.గాయత్రీ మన్త్రజప్యం చ సర్వరోగనివారణమ్, ప్రాహ దీనప్రియ స్వామిన్ మమాంగే జాయతేఽధునా. ౫. రుజాపీడాభవద్భిశ్చ కేనోపాయేన వార్యతాం, అనయా బాధయా తేద్య శుశ్రూషాం కర్తుమాత్మనః.౬.శక్తిర్నహి జపేచ్ఛా చ మయ్యనుగ్రహ భో విభో. ఇతి సంప్రార్థితాం భార్యాం గౌతమో వాక్యమబ్రవీత్. ౭. నామ్నా కామేశ్వరీం దేవీం స్వయం వ్యక్తాం మహేశ్వరీం, అహాంతు పూజయావోద్య పూజాభిరతికోమలామ్. ౮. తస్మాత్సర్వరుజాం పీడాం నివారయతి సా శివా, అస్మాదుపాయాదన్యశ్చ నాస్తి బాధానివారకః, ౯. ఇత్యుక్తవంతం పతిమాహ

సాంగనా కామేశ్వరి నామ మహేశ్వరీ చ, కథం తు తుష్టా కథ
మాపవం తరేత్తథేత్యువాచ ప్రియమంజసా వరమ్. ౧౦.ఇత్యు
దీరితమాకర్ణ్య గౌతమో వాక్యమబ్రవీత్, కామేశ్వరీకథాం
వక్ష్యే ఆదౌ పూజాం తతఃపరమ్.౧౧. పురా బ్రాహ్మణగేహే తు
రంజకా నామ నామతః, సుద్యుమ్నస్య ద్విజస్యాస్య పుత్రీత్వం
ప్రాప్య శాంభవీ. ౧౨. పితృగేహే వర్ధమానా యౌవనం
ప్రాప్య కన్యకా, తస్మిన్నవసరే విప్రః జనకశ్చిన్తితోఽభవత్.
౧౩.—అస్యాస్సౌన్దర్యసదృశః పతిర్నాస్తి జగత్త్రయే ఇత్యా
కులం తు జనకం రంజకా ప్రాహ సుస్మితమ్. ౧౪.మమ భర్తా శివ
స్సాక్షా న్నహ్యన్యో మమార్హతి. ఇతి సాక్షాచ్ఛివం ధ్యాయన్
తూష్ణీం తిష్ఠతి భామిని. ౧౫. విస్మితో జనకశ్చైవ తూష్ణీమాస్తే
శివం స్మరన్, కదాచిద్వృషభారూఢః ప్రమథైశ్చ సమావృతః.
౧౬. అభ్యాయాద్రంజకాప్రాంతం విస్మితాస్యో ననామ చ,
హస్తం గృహీత్వా తస్యాశ్చ శంభుర్వృషభ మారుహత్. ౧౭.
తస్మిన్నవసరే విప్రం ప్రాహ సారంజకా ధ్రువమ్, భో విప్ర
త్వం హి వాత్సల్యాత్ప్రాప్తవాన్విస్మితో గృహమ్. ౧౮.
ఇదానీం తు గమిష్యామి శివసాన్నిధ్యమేవ హి, మద్రూపాం
ప్రతిమాం కృత్వా గృహే స్థాప్య దినేదినే. ౧౯. పూజాం కురు
మహాభాగ సర్వాభీష్టాం వదామి తే, కామేశ్వరీతి నామ్నా వై
మత్పూజాం కురుతే తు యః. ౨౦. సర్వాభీష్టాన్ వదామ్యస్య
తస్య వై శాశ్వతాన్ స్థిరాన్, పూజావిధానం వక్ష్యామి
శృణు నాన్యమనా తథా. ౨౧. కలశం గంధపుష్పాద్యైః కలః

కృత్య నివేశ్య చ,తస్మిన్నావాహయే న్మాతు సర్వాభీష్ట ప్రదాయినీమ్. ౨౨. ప్రాతఃకాలే నిత్యకృత్యం నిర్వర్త్య శుచితో వశీ, మద్బుద్ధ్యా విప్రకులజాః స్త్రియః పంచచ సప్తచ. ౨౩. న వైకాదశ సంఖ్యావా సమాహూయ ప్రయత్నతః, తాసామభ్యంగ స్నానం తు నిర్వర్త్య స్వగృహే చవై. ౨౪. ప్రాతస్తాసాం పద స్స్వస్యాః లేపయేద్రక్తకేనచ,పూజయిత్వాతు సర్వాంగే గంధాద్యైః పుష్పదామభిః. ౨౫. తతః పిష్టం సమాధాయ. తాంబూల దక్షిణాద్యైశ్చ శర్కరామధుమిశ్రితమ్, దత్వా వాయన దానాని బ్రాహ్మణం చైకమర్చయేత్. ౨౬. ప్రత్యేకం వాయనం దద్యాద్వాచకం పూజయేత్సుధీః, నైవేద్యం క్రియతాం దేవ్యాః కదలీపానకాదిభిః. ౨౭. నారికేళఫలైశ్చాపి ఖర్జూరైరిక్షు ఖండకైః ఏవం నిర్వర్త్య విధివత్ స్త్రియః ప్రార్థయతాం వ్రతీ. ౨౮.స్వచేలం గృహ్య హస్తాభ్యాం కించిద్దేయమితి బ్రువన్, తాస్త్రియస్స్వ ప్రతిగ్రాహ్య పిష్టాద్యం కించిన్నిక్షిపేత్. ౨౯. తాభిర్నిక్షిప్త తన్మాత్రం భక్షయేద్భార్యయా సహ, తతస్తాభక్షయంత్యశ్చ బ్రాహ్మణాన్భోజయేత్తతః, ఏవం కృత్వా వ్రతీ సమ్యక్ నిత్యం పూజాం సమాచరేత్, వివాహాదిశుభేష్వాదౌ పూజ్యా కామేశ్వరీ సదా. ౩౦. తస్యసర్వరుజాబాధాః జాయంతే న కదాచన, న వైరికాః ప్రజాయంతే సర్వోపద్రవకారకాః.౩౧.పురామద్వంశజాస్సర్వే లభంతే సర్వదాహితామ్, పూజాం కామేశ్వరీం దివ్యాం త్వయా తన్నస్మృతం హి తత్. ౩౨. త్వద్దేహస్య రుజాబాధాః జాయంతే సాంప్రతం ప్రియే, తస్మాత్కామేశ్వరీ పూజా కార్యాస్త్వాభిస్సువిస్తరమ్. ౩౩. ఇతి భర్తుర్వచః శ్రుత్వా అహల్యా

లోకపావనీ, పూజాం కామేశ్వరీం దివ్యాం కృత్వా తత్రవిధా నతః 3౮. స్వదేహే కృతబాధాభిర్ముక్త్వా దృఢతనుర్బభౌ పతిశుశ్రూషకారిచ జపశీలాభవత్తతః. 3౯. తస్మాత్కామేశ్వరీం, దివ్యాం పూజాం కుర్యుర్యదుత్తమాః, తేషాం రోగా వినశ్యంతి సంపదశ్చ భవంతిహి. 3౬. పుత్రపౌత్రాశ్చ వర్ధంతే సర్వసౌభాగ్యకారకాః, అంతే కైవల్యమాయాంతి శివాశివ కృపాకరః 3౭. ఇతి శ్రీదేవీరహస్యే కామేశ్వరీ వ్రతకథా సంపూర్ణా.

## శ్రీఇష్టకామేశ్వరీవ్రతకథ

పూర్వ మొకానొకప్పుడు పవిత్రురాలైన అహల్య ముదిమినొందినదై పలురకములరోగములచే నాక్రమింపబడిన దాయెను. చెడుకలల కనుచుండెను. దుఃఖముచే దీనురాలా యెను. ఎల్లవేళల శారీరకబాధయు మానసికవేదనయు నామెను పీడించుచుండెను. అంత ఈబాధ సహింపలేని యాపతివ్రత యగు నహల్య చదువుల నెఱిగి స్నానము జపము తపము శుచియై ఒనరించుచు శాంతిధైర్యముగలిగి మంత్రములను, యంత్రముల చక్కనెఱిగియున్న మునిశ్రేష్ఠుడును తనపతియగు గౌతముజేరి "మహాప్రభో! స్వామీ! నాయీరుజను, పీడను నెటులయిన పోగొట్టుము. ఈ నాయస్వస్థతవలన నీపరిచర్యచేయ లేకున్నాను." అని యిటుల మొరపెట్టుకొనిన భార్యను జూచి గౌతముఁడి ట్లుపదేశించెను. "కర్తృరహితయు లోకేశ్వరియు నగు కామేశ్వరిని మనమిరువురముసు పూజింతము. ఆమె యాపూజవలన తృప్తినొందినదై నీ ఆధివ్యాధుల మాన్పు

గలదు." ఇట్లు భర్తచెప్పిన నామె "ఆర్య! కామేశ్వరి యెటుల తృప్తినొందును. ఎటుల నాపద దాటించును." అనగా నా మహర్షి యిటుల చెప్పెను. "ప్రియా మొదట పూజావిధానము నెరుకపరచెదనువినుము. "పూర్వకాలమున సుద్యుమ్నుఁడను బ్రాహ్మణుని యింట రంజకయనుపేరితో పార్వతి యుదయించెను. ఆమె యతనియింట పెరుగుచు యౌవన యాయెను. అట్టితరి "ఈమెసౌందర్యమునకుఁ దగినభర్త ముల్లోకములను గానరాఁడే" యని విచారించెను. ఇటులు విచారించుచున్న తండ్రితో రంజక "తండ్రీ నా కాకాలకంఠుఁడే భర్తకాని యన్యుఁడు కానేరఁడు." అని చెప్పి శివునే తలచుచు ఊరకుండెను. ఆమె తండ్రిగూడ ఫాలలోచనునే తలచుచు ఊరకుండెను. అంత నొకనాఁడు నందినెక్కి ప్రమథులు వెంటరా నాపశుపతి చిఱునగవు మొలకలెత్త రంజకయున్న ప్రాంతమునకు వచ్చి ఆమెకరము గ్రహించి తనవాహనముపై నెక్కించుకొనెను. అటు లావృషభము నధిష్ఠించి రంజక యిటు లనెను. ఓ బ్రాహ్మణా నీవు ఆశ్చర్యము నొందితివి. నే నిపు డీపశుపతియింటికి పోవుచున్నాను. నావంటిబొమ్మ నొకదానిని చేసి నీయింట ప్రతిష్ఠించి పూజింపుము. దాన నీకోరిక లీడేరును. ఏమానవుఁడు నన్ను కామేశ్వరియనుపేర పూజించునో వాని కఖిల అభీప్సితముల స్థిరముగా నొనగూర్చెదను.

నాప్రతిమాపూజ యెటులు చేయవలయునో యిక చెప్పెదను శ్రద్ధగా వినుము. గంధము పూవులు మొదలగు ద్రవ్యములచే నలంకరించి కలశమునుస్థాపనము చేయవలయును.

కోర్కులిచ్చు నన్నా కలశమున నావాహనముచేయవలెను. ప్రాతఃకాలమున నిత్యకృత్యములఁ దీర్చుకొని శుచియై ఇంద్రియములను, కరణములను స్వాధీనమున నుంచుకొని నేననెడు భావనతో 5, 7, 9, 11, సంఖ్యలలో నేదే నొకసంఖ్యకు చెందిన బ్రాహ్మణస్త్రీలను పిలిచి తనయింట వారికి తలంటి నీళ్లు పోసి వారిపాదముల ఎఱ్ఱగంధమున నలంకరించవలెను. వారి యన్ని అవయవములను గంధము పూచండలు మొదలగు వానితో పూజించి చలిమిడిని (వరిపిండి చక్కెరతోకలిపి జలమున నార్ద్రమొనరించినపదార్థము) వాయనమిచ్చి తాంబూలాదుల నీయవలెను. బ్రాహ్మణున కొకనికి ప్రత్యేకముగ వాయన మిచ్చి పండితుఁడైనవాఁడు పూజించవలయును. అరటి, కొబ్బెర, చెరకు, ఖర్జూరము మొదలగుపదార్థములను దేవికి నైవేద్యముగా సమర్పించవలయును. ఇటు లాపూజను ముగించి తన కొంగును రెండుచేతులపట్టుకొని ఆస్త్రీలను "కొంచెము ప్రసాదింపుఁడు" అని ప్రార్థించెను. అపు డాస్త్రీలు తామదివరకు పుచ్చుకొనిన చలిమిడిపండ్లు మొదలగువానిని కొంచెము విదల్పవలయును. వారిచే విదల్పఁబడిన అస్వల్పమును భార్యతోగూడ పుచ్చుకొనవలెను. ఆతరువాత బ్రాహ్మణసమారాధనము చేయవలెను. ఇటు లీవ్రత మాచరించి నిత్యమును పూజచేయుచు వివాహాదిమంగళసమయమున మొదట కామేశ్వరిని పూజించినచో ఆధివ్యాధులు లేకయుండును. పూర్వకాలమున మాహా రందరు ఎల్లవేళలను ఏమరక కామేశ్వరినిపూజించుచుండెడివారు. నీవొకసారికూడ ఆదెవ్యరాలిని స్మరింపనయితివి. అందువల

ననేక శీతజ్వరాదులు కలిగినవి. కావున కామేశ్వరీపూజ చేయుమని అనిపలికిన తనభర్తమాటల విన్నయహల్య యథావిధిగ నీవ్రతమును చేసెను. అపు డెల్లరోగములు పాసి దృఢగాత్రురాలాయెను. భర్తృశుశ్రూషయు తపమును చేయునదియు నాయెను. కావున లోకమున నెవ్వరు విధివిహితముగ కామేశ్వరీవ్రత మొనరించిన వారి కిహమున ఐహికఫలములును, అంతమున శివకైవల్యమును గల్గును.

---

## రెండవభాగమున నీవ్రతములు కలవు.

1. ఋషిపంచమీవ్రతము, 2. మథనద్వాదశీవ్రతము, 3. అమావాస్యసోమవతీవ్రతము, 4. కృష్ణాష్టమీవ్రతము, 5. శ్రీరామనవమీవ్రతము, 6. అముక్తాభరణసప్తమీవ్రతము, 7. భక్తేశ్వరవ్రతము, 8. శతవర్తివ్రతము, 9. లక్షవర్తివ్రతము, 10. త్రికార్తివ్రతము, 11. చిత్రగుప్తవ్రతము, 12. క్షీరాబ్ధివ్రతము, 13. సావిత్రీగౌరీవ్రతము, 14. సంపద్గౌరీవ్రతము, 15. సత్యనారాయణవ్రతము, 16. రథసప్తమీవ్రతము, 17. సంకటచతుర్థీవ్రతము, 18. జీవవార్త్రైకాదశీవ్రతము, 19. శ్రవణద్వాదశీవ్రతము, 20. శరన్నవరాత్రివ్రతము, 21. నృసింహజయంతీవ్రతము, 22. శ్రీమంగళగౌరీవ్రతము, 23. తులసీపూజావ్రతము, 24. సంతానగోపాలపూజావ్రతము. ధర. రూ. 2 0

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్సన్సువారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—20-7-1955.

| ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|
| ...పురాణము, సవ్యాఖ్యానాంధ్ర తాత్పర్యసహితము ... | 2 | 8 |
| ...ర్తాసమాహాత్మ్యము, సాంధ్రతాత్పర్యము ... | 0 | 4 |
| పద్మపురాణాంతర్గత మాఘపురాణము, సాంధ్ర తాత్పర్యము | 5 | 0 |

## వైదిక గ్రంథములు

| | | |
|---|---|---|
| అమావాస్యాతర్పణము ... | 0 | 2 |
| నవగ్రహారాధనమ్ ... | 0 | 6 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు ... | 0 | 4 |
| ఆపస్తంబప్రవరకాండము ... | 0 | 4 |
| ఆశ్వలాయనప్రవరకాండము ... | 0 | 4 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము ... | 0 | 3 |
| ఋగ్వేదదేవతార్చన, బ్రహ్మయజ్ఞము, సస్వరము ... | 0 | 3 |
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము ... | 3 | 0 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, చిన్నసైజు ... | 0 | 8 |
| ఋగ్వేదసంహిత, మొదటిఅష్టకము, టీకాతాత్పర్యసహితము, పాతప్రతి | 5 | 0 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక ... | 0 | 4 |
| తిథిమంత్రములు (ఆరాధ్యులది) ... | 0 | 3 |
| దేవతార్చన, చిన్నసైజు ... | 0 | 2 |
| పంచసూక్తములు, సస్వరము ... | 0 | 3 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము ... | 1 | 4 |
| పంచోపనిషత్తులు, బ్రహ్మమేధసహితము ... | 0 | 6 |
| డిటో టీకాతాత్పర్యసహితము ... | 5 | 8 |
| పితృతర్పణము, చిన్నసైజు ... | 0 | 2 |
| పుదూరుద్రావిడసంధ్యావందనము ... | 0 | 3 |
| పుదూరుద్రావిడశ్రాద్ధప్రయోగము (షట్పిండవిధానము) ... | 1 | 0 |
| బ్రహ్మయజ్ఞము, సస్వరము ... | 0 | 3 |
| మహాన్యాసము, సస్వరము, చిన్నసైజు ... | 0 | 12 |
| యజ్ఞోపవీతధారణవిధి ... | 0 | 2 |
| మంత్రప్రశ్నములు, సస్వరము ... | 0 | 6 |